# విషయానుక్రమణిక

## నవంబరు 1960



## డిసెంబరు సంచికలో

# వార్తలు

## అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం

అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం రాయపూర్‌లో ప్రత్యేకంగా నెలకొల్పబడిన రవిశంకర్ శుక్లానగర్‌లో అక్టోబర్ 29, 30 తేదీలలో జరిగింది. శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. కాంగ్రెస్ కార్యవర్గంలోని 21 మంది సభ్యులలో ఏడుగురిని ఎన్నుకోవాలని, కేంద్ర ఎన్నికల సంఘంలోని పదకొండు మందిలో ఐదుగురిని 2/3 మెజారిటీతో ఎన్నుకోవాలని తీర్మానించింది. తృతీయ ప్రణాళిక ముసాయిదాలోని పెక్కు అంశాలపై చర్చలు జరిగినమీదట, కలహాలు కట్టిపెట్టి ప్రణాళికను, దానిలోని అభివృద్ధి పథకాలను అమలుపరచడానికి కాంగ్రెస్‌వారు కృతనిశ్చయులు కావాలని తీర్మానించింది. మూడు నాలుగు సంవత్సరాలలో నిరాయుధీకరణ జరగాలని, అలా జరుగకపోతే ప్రపంచ పరిస్థితి దిగజారిపోగలదని మరొక తీర్మానంలో హెచ్చరించింది. ఆసియా, ఆఫ్రికాలలో కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించిన దేశాలు ప్రచ్ఛన్న యుద్ధానికి దూరంగా వుంటూ, సైనిక కూటాలలో చిక్కుకోకుండా తమ పరిస్థితులకు అనుగుణమైన పద్ధతిలో సంపూర్ణాభివృద్ధి చెందడానికి అవకాశం వుండాలని ఈ తీర్మానంలో స్పష్టపరిచింది.

## కృష్ణా గోదావరి జలాల వివాదం

కృష్ణా గోదావరీనదుల జలాల వినియోగంపై 1951 లో వివిధ రాష్ట్రాలమధ్య జరిగిన ఒప్పందంలో తను మైసూరు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు సంతకం చేయలేదుగనుక, ఒప్పందం చెల్లదని, దానిని మైసూరుప్రభుత్వం కూడా ధ్రువపరచలేదని, అది కేవలం తాత్కాలికమైనదని కేంద్ర గృహనిర్మాణశాఖామంత్రి శ్రీ కె. సి. రెడ్డి ఇటీవల అనడంవల్ల ఒప్పందం చెల్లుతుందా, లేదా అన్న విషయం పరిశీలించవలసిందిగా కేంద్రప్రభుత్వం కేంద్ర న్యాయశాఖను కోరింది. శ్రీ కె.సి. రెడ్డి అభిప్రాయాన్ని మద్రాసు మంత్రి శ్రీ ఎం. భక్తవత్సలం ఖండించారు. కమ్యూనిస్టుపార్టీ ఆంధ్ర సంఘం కూడా ఖండించి, రాష్ట్రప్రభుత్వం వాదాన్ని బలపరచింది.

## ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షపదవి

ఆంధ్రకాంగ్రెస్‌లో ఏర్పడిన విభేదాలను తొలగించి సామరస్యం సాధించడంకోసం శ్రీ మల్లిపూడి పళ్ళంరాజుగారు రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షపదవిని స్వీకరించడానికి అంగీకరించారు. తమ అంగీకారాన్ని ఆయన కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారికిని, కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు శ్రీ యు. ఎన్. ధేబర్ గారికిని తెలియపరచారు.

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ నూతనకార్యవర్గం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సర్వసభ్య సమావేశం తీర్మానం అనుసరించి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగాను, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఉపాధ్యక్షులుగాను ఎన్నుకోబడ్డారు.

శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, దేవులపల్లి రామానుజరావు, రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణరావు, ఎం. రామానుజరావునాయుడు (వేంకటేశ్వరవిశ్వవిద్యాలయం రిజిస్ట్రారు,) డాక్టర్ బి. రామరాజు, డాక్టర్ డి. వెంకటావధాని, పి. సత్యనారాయణరావు, హబీబుర్రహమాన్, సి. నారాయణరెడ్డి, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగార్లు—పదకొండుమంది కార్యవర్గ సభ్యులు, శ్రీ బోయిభీమన్నగారు ఆర్థికసంఘ సభ్యులుగా నియమించబడ్డారు.

## ఆస్థానకవి 95 వ జయంతి

ఆస్థానకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి 95 వ జయంతి అక్టోబర్ 10 వ తేదీన రాజమండ్రిలో వైభవోపేతంగా జరిగింది. జయంత్యుత్సవానికి పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ నిడమర్తి వేంకటనరసింహం అధ్యక్షత వహించారు. ఈ సందర్భంలో మూడురోజుల పాటు సభలు, గోష్ఠులు ఏర్పాటుచేశారు.

## ఫ్రెంచి కవికి నోబెల్ బహుమతి

సారస్వతానికి 1960 లో ఇచ్చే నోబెల్ బహుమతి 73 సంవత్సరాల ఫ్రెంచికవి సెయింట్ జాన్ పెర్సీకి ఇవ్వబడింది. ఈయన అసలు పేరు అలెగ్జిస్ లెజర్. ఈయన కొంతకాలం ఫ్రెంచి రాజకీయోద్యోగిగా దూరప్రాచ్యంలో పనిచేశాడు. 'అనాబేస్' అనే ఈయన రచన విశేషమైన కీర్తిని తెచ్చింది. దీనిని టి. ఎస్. ఎలియట్ ఆంగ్లంలోకి అనువదించాడు.

# ఆత్మ సందర్శనము

శ్రీ మోటూరి వేంకటరావు

మంకురముగా మదీయ హృది ముంగలఁ గ్రాలు; గతానుభూతు లొ
క్కొకటి పునఃపునః ప్రభవ మొంది తదీయ విచిత్రదర్పణ
ప్రకటిత చంచలా జ్వలన రాసులుగాఁ దులకించి అంతలో
వికలములై తొలంగుఁ, గను విచ్చిన తామసి తాండవింపఁగన్.

మఱల మెఱసిన కాంతులే, మఱలఁ దిరుగఁ
బడిన ధ్వాంతమ్ములే, హృదభ్రమునఁ బ్రమ్మి
మమతల నిరాశలను రేఁపి మఱల మఱల
సురిఁగి శూన్యమ్ములో రూపసరణిఁ గొనును.

వెలుఁగులు చీఁకటుల్ విరిసి వెల్లువలై యిటులే హృదంతర
స్థలి నొకదాని వెంబడిని సత్వరమున్ మఱి యొండు గ్రమ్మి భూ
తలమునఁ గర్మబంధ నిరతక్రమ జీవుల రాక పోకలన్
మలయు శుభాశుభ క్రియల మాడ్కిఁ జలించి కలంచిపోయెడిన్.

ముల్లడి గొన్న ఆ కిరణ మాలలపైఁ బయనించి తారకా
ఫుల్ల మనోజ్ఞ వీథుల విముగ్ధ గతిన్ విహరింతు - వెంటనే
వెల్లికలైన ఆ యిరుల వీచికలం బడి యూఁచముట్టుగాఁ
దల్లడ మొందుచున్ వడి నధఃపతనమ్మును గాంతు నంతలో.

తుది మొదలే తలిర్పని గతుల్ వెలయించి మరీచు లొక్క య
ద్బుదము, తమిస్ర రేఖికల పుంజములున్ సమపంక్తులై యటుల్
ప్రిదులుచు నుండ నా హృదయ బింబములోఁ గనుచుందు సృష్టితో
వదలని యెన్ని జన్మముల వాసనలో ననుఁ జుట్టి ముట్టుటల్.

ఇన్ని మహాత్కళాంశు తతు లిన్ని బృహద్విలయాంధకారముల్
పన్నిన ఇంద్రజాలికుని భంగిఁ దదతుగుణాధికారియై
యున్న మదాప్త నిస్తుల మహోజ్జ్వలితావ్యయ నిర్గుణాత్మ ఆ
తెన్నుల వెన్క సుస్థిర విధిన్ ధ్రువతారకగా స్ఫురించెడిన్.

# తిమ్మావజ్ఝలవారి “తెలుఁగు మఱుఁగులు”

## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

కడచిన సెప్టెంబరుమాస 'భారతి' లో మిత్రులు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు 'తెలుఁగు మఱుఁగులు' అను శీర్షికతో ప్రాచీనాంధ్ర మహాకావ్యములలోని సదసత్ పాఠములను చర్చించుట కుపక్రమించి చాలా మంచిపని చేయుచున్నారు. ఇందుకై వారెంతో అభినందనీయులు. ఈ బరువును నెత్తిపై వేసుకొను శక్తియుక్తులు కలవారు నేఁడు పలువురు లేరు. ఉన్న కొండఱి అగ్రపంక్తికి చేరినవారు శ్రీ తిమ్మావజ్ఝలవారు.

నన్నయ్యగారి భారతము మొదలుగాఁగల మహాకృతులన్నియు నేఁడు పరిశోధన సాపేక్షములై యున్నవి. ప్రాఁత వ్రాఁతప్రతులు ఎన్నో నశించి పోవుచున్నవి. ఉన్నవానినైన సంగ్రహించి రక్షించు ప్రయత్నము, వానిని పరస్పరము పోల్చిచూచి ప్రాచీన సాధు పాఠములు నిర్ణయించి ప్రకటించు నుత్సాహము ఇప్పుడు చాలా శిథిలముగా నున్నది. పుస్తక వ్యాపారులకు ఇందుకై పెట్టిన అసలు లేవదు గనుక వారికీ ప్రక్క చూపు సహజముగా నుండదు. మరి విశ్వవిద్యాలయాలవారికి ఈ పనియందంతగా గౌరవాభిమానము లున్నట్లు కానరాదు. వారు నిత్య'విజ్ఞాన భిక్షు'వులు. ఎంత ద్రవ్యము వచ్చినా ఏ 'లేబరేటరీ' గవాక్షము నందో కుమ్మరించి సంచి దులుపుకొని నిత్యయాత్రకు మరల వెళ్ళువారు. ఈ భాష, చరిత్ర, తత్త్వశాస్త్రము, సాహిత్యము, సంగీతము మొదలగు వినోదములకు వారి యార్థిక ప్రణాళీ వేగములో చోటు చాలదు.

ఇక పాఠశాలలలో విధిలేక పాఠము చెప్పవలసిన పండితుల పరిశ్రమోత్సాహమును గవులు కొల్పువారు విద్యార్థులు. కాని వారి ప్రధానదృష్టి పరీక్షలో కృతకృత్యులగుటయే. ఆ సిద్ధికి ఎన్నో మార్గాలు. ఈ పాఠశోధనాది పరిశ్రమ వారి తలకు మించినది. కనుక ఉపాధ్యాయులకును ఇది ఉదాసీన విషయమే. ఏదో 'సంతకు మూఁడు మూరలు నేసిన చాలును' అను చిత్తవృత్తియే వారియందు ప్రబలమగును.

మరి సాధ్వసాధు పాఠములు నిర్ణయించుటకు భాషావ్యాకరణ పాండిత్యము మాత్రము చాలదు. పాండిత్యము చేత శబ్దార్థముల యౌచిత్యము, కవిహృదయమును అనుభవమునకు రావు. అట్టి అనుభవజ్ఞానము నే వ్యుత్పత్తి యందురు. 'ఈ వూర్లో పండితులెందరో ఉన్నారు రా. కాని అందరూ అవ్యుత్పన్నులు' అని నా ఆచార్యులు శ్రీ కృపబ్రహ్మతంత్ర పరకాలస్వామి సెలవిచ్చుచుండిరి. వ్యుత్పత్తి హేతువాదమును మీఱినది. సహృదయత దానిమూలము. దాని విలువగూడ సహృదయులకే. 'కే తార్కికాః కే వయం?' అన్నాఁడొక సహృదయ శిరోమణి. ఈ క్రింది నన్నయ పద్యభాగమును పరిశీలింపుఁడు:—

'అఖిల సూర్యమండల సహస్ర సమప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రము...'

(అర. 1-332)

ధనంజయుఁడు అర్జునుఁడు. 'సవ్యసాచీ ధనంజయః' అని కలదు గదా. మఱి ధనంజయప్రవరుఁడేమి? శ్రేష్ఠుఁడైన అర్జునుఁడనియా? అప్పటికి రామశూరుఁడు, రావణక్రూరుఁడు – ఇట్టి వింతప్రయోగములు – తలక్రిందైనవి – భాషలో నున్నవా? నన్నయ ఇతరత్ర ప్రయోగించినాఁడా! అదిగాఁదట! ఈ ప్రయోగమున నన్నయ భట్టారకుని అసాధారణ కవితారహస్య మొకటి కలదట! అదేమనగా: ధనంజయుఁడనగా అగ్నికూడ నగును. 'వీతిహోత్రో ధనంజయః' లేదా! కనుక ధనంజయ శబ్దమునకు వాచ్యులైన అగ్ని – అర్జునుఁడు ఇరువురును ఇక్కడ పనికివచ్చినవారే. ఆ యిద్దఱిలో శ్రేష్ఠుఁడు అర్జునుఁడు; ఎట్లంటిరా, అగ్నికి అజీర్ణరోగమునకు చికిత్స చేసి ఖాండవదహనము చేయించినవాఁడు గదా అతఁడు! కనుక 'ధనంజయ ప్రవరు కరమ్ము' అను సమాసమునకు-ధనంజయశబ్దవాచ్యులైన ఇరువురు వ్యక్తులలో ఉత్తముఁడైన అర్జునుని హస్తము – అని నన్నయగారి గుప్తార్థము: ఎంత ప్రతిభావంతమైన వ్యాఖ్యానము!

కాని పై పద్యమున పాఠము 'ప్రవరకరమ్మొ' గాని 'ప్రవగుకరమ్మొ' గాదని తోఁచుచున్నది. అప్పుడు 'ధనంజయుని ప్రవరహస్తము'-పరమశివునితో పోరాడి అతని యనుగ్రహమును సాధించుకొన్నది గదా అది!— అను తంటాలేని అర్థము లభించును.

మరి ఈ 'ర'లో లేని కొమ్మును అతికించి 'రు' చేసిన దెవరు? నన్నయ ఒక్కఁడు చేసియుండఁడు గాని ఆయన గారి లేఖకుఁడు మొదలుగా నేఁటి ముద్రా శాలలలోని యే 'కంపోసిటరు' వఱకు ఎవరైనా చేసి యుండవచ్చును. చిత్తులు దిద్దువారు దద్దమ్మలైనప్పుడు ఇటువంటి గుప్త చమత్కారము లెన్నో అవతరింపఁ గలవు.

'మీ పర్యవేక్షణక్రింద సిద్ధపఱిచిన పుస్తకములో ఇన్ని అచ్చుతప్పు లెందుకు వచ్చినవయ్యా?' అని యడుగఁగా ఒకానొక ఆధునిక మహాకవి 'ఆంధ్రులకు ముద్రారాక్షసం సహజమే కదా' అని ప్రత్యుత్తర మిచ్చినాఁడు. ఇంకేమి? నన్నయనుగూడ మనము మినహాయింపవలసినది లేదు. ఆయనయే పొరపాటున ఈ 'ర'ను 'రు'గా వ్రాసియుండవచ్చును; చెప్పి యుండవచ్చును. కాని బుద్ధిపూర్వకముగా అట్లు చేసి నాఁడని నేను నమ్మను.

నన్నయభారతమునుండియే ఇంకొక యుదాహరణము :—

"దారుకుఁ డిట్లనియె మహా
వీరు నుపేక్షింపఁ దగునె వీనిని మాయా
ప్రారంభు నుపేక్షింప ర
పార పరాక్రములు పోర బలియుఁడు వీనిన్."

(ఆర. 1-196)

ఇందు 'బలియుఁడు' అను పదమునకు సరసమైన అన్వయము కుదురదు. కష్టపడి ద్రావిడ ప్రాణాయామము చేసి పదములను అన్వయించవలయుట నన్నయ శయ్యలో ఎందును కానరాని ధర్మము. కనుక నే 'పోఁ బ్రాకృతు (వీనిన్) నయినన్' అని పాఠాంతర మొకటి యిందు వచ్చి చేరినది. పాఠాంతరము కాన వచ్చినదంటే అసలు పాఠములో ఏదో ఛిద్రమున్న దనియే అర్థము. నాకుఁ జూడఁగా ఇక్కడ 'బలియుఁడు' కాదు నన్నయ్య వ్రాసినది. మరి 'బలియిడు' అని; బలివేయుమని యర్థము. 'జహి శాల్వం మహాబాహో' (3.22-22) అనియే మూలమందలి దారుకుని సలహా.

తిక్కన్నగారినుండి యొక యుదాహరణము :

ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధము. పద్మ వ్యూహమునఁ జొచ్చి అభిమన్యుకుమారుఁడు అసాధారణముగా విజృంభించినాఁడు. వాని దెబ్బకు తట్టుకొన లేక శకుని కర్ణ దుశ్శాసనాదులు దిక్కొకపాలుగా పారిపోఁజొచ్చిరి. అప్పుడు సేనాపతి ద్రోణుఁడు వారిని జూచి,

"నిలు నిలు కర్ణ! యో కృపుఁడ
నీ కిటు లేల కతంకదక్క? సౌ
బల స్మృతిమాల నేమిటికి?
బాహ్లిక! యిత్తఱిఁ గౌరవేంద్ర నీ
బలముఁ జలంబుఁ జూపి నిలు
పందగు సేనల నంచుఁ జెక్కు ధం
గులఁ బురిగొల్పె నెవ్వగను
గొత్తల సేయర యేమి సెప్పఁగన్"

(ద్రో. 2-59)

కర్ణ కృప శకునులకు తలకొక్కమాట చెప్పి నాఁడు ద్రోణుఁడు. అంతకు కొంతముందే దుర్యోధనుఁడు 'నీవు పాండవపక్షపాతివి. సరిగా మనసిచ్చి యుద్ధము చేయవు' అని తన్ను నిందించియుండెను. కనుక కొంత వానిని దెప్పుటకై రెండుమాట లెక్కువగా అన్నాఁడు. కాని యీనడుమ బాహ్లికుని పేర్కొన నేల? పసపు కుంకుమలేని యీ పేరంటమున ఆ ముసలివాని కేమి పని? మరి ఆనాటి యుద్ధమున బాహ్లికుని ప్రవేశమే లేదు. రెండవనాటి యుద్ధమున ద్రోణుఁడు కట్టిన గరుడవ్యూహమున ఒక రెక్కలోని యాకగా అతని పేరున్నదంతే. తరువాత కానరాదు. సంస్కృతమూలమందు ఈచోట బాహ్లికుని పేరే లేదు. కనుక 'బాహ్లిక' అనుచోట 'బాయక' అని పాఠముండునేమో! 'కౌరవేంద్రా! నీ విప్పుడు పాయక-తప్పించుకొనిపోక—నీ బలముఁజలము జూపి సేనల నిలుపందగును' అని సమంజసమైన యన్వయము కుదురును. 'బాయక' అనుచోట తాటాకుల వ్రాతలో యకారమును ఏ పురుగో తిని పెట్టగా దానిని చూచి వేరొకప్రతి వ్రాసికొను మహానుభావు డెవరో చేసిన చేదూగ్బు ఇది. 'బా...క'ను 'బాహ్లిక'గా ఊహించి వ్రాసుకొన్నచో తప్పుపట్టు ధైర్య మెందరికి? భారత మహారణరంగములో ఎవరిపేరెక్కడ దూర్చినను సామాన్యులదృష్టిలో చెల్లిపోవును గదా. కాని తిక్కన్నది అంత అజాగ్రత్తగా వ్యవహరించు హృదయము గాదు.

వ్రాతప్రతులను పరిశీలించువారందరికిని సుగ్రహమైన విషయమిది. ఇంకెవరో వ్రాసినప్రతి ఆధారముగా అనులేఖనము చేయునప్పుడు అతని పొరపాట్లకు తోడు అందు పురుగులు తిన్న అక్షర పద వాక్యాలను యథావ్యుత్పత్తిగా పూరించుకొను పనియును చేయకుండ లేడు. ఈ న్యాయము నేటి గ్రంథపరిశోధకులకును అన్వయించును. పోల్చి పరిశీలించుటకు ఇంకను ఎన్నో వ్రాతప్రతులు లభించు మహాభారతాది గ్రంథముల గతియే ఇట్లుండగా, ఏ ఒకటో రెండో ప్రతులు మాత్రమే కలిగి అవియు క్రిమిదష్ట శేషములుగా నున్న ఎఱ్ఱనగారి నృసింహపురాణము, నన్నిచోడుని కుమారసంభవము, నాచనసోముని ఉత్తరహరివంశము మొదలగు గ్రంథములను ప్రకటించుటలో ఇట్టి పాఠకాలుష్యములు విర్వడుట వింతకాదు. నృసింహపురాణములోని యీ క్రింది యుదాహరణము పరిశీలింపుడు:—

"...శ్వేతద్వీపంబు దీపించుచుండు.

క. ఆదియు మహిమయు నేర్పడ,
నాదిపురుషుఁ డొక్కఁడెలుఁగు నన్యుల కెలుఁగం-
గా దరముగాదు కమలభ
వాది దివిజవంద్య మది మహోద్భుతము మహిన్" (1-39)

శ్వేతద్వీపమును వర్ణించుట కుపక్రమించిన యీచోట "ఆదీవి మహిమ యేర్పడ" అని సాధుపాఠముండెదగును. 'ఆదియు మహిమయు' అను రెండుపదములును శుద్ధములే; కాని ఇక్కడ సుబద్ధములు కానేరవు. "దాని" అను రెండక్షరాల పదమొకటి అధ్యాహారము చేసుకొన్నచో 'ఆద్వీపము మొదలును మహత్త్వమును ఆదిపురుషు డొక్కఁడెఱుఁగును' అని యన్వయము కుదురును గదా—అని వాదించుట కవి హృదయమునుగాని భాషాసంప్రదాయమునుగాని తెలిసి చెప్పుట కానేరదు.

అందే ఇంకొకచోట ఈ లుప్తపూరణమును గమనింపుడు:

"పద్మనివాసిని పట్టపుదేవులు[1]
నలినాసనుఁడు ప్రియనందనుండు,
విహగాధినాథుండు మహనీయవాహనం,
బహికులాధీశుఁ డింపారు శయన,
(మతిలోకనందకం బద్భుతోజ్జ్వల హేతి),
ఘనపాంచజన్యముత్కటపుఁ జిందము.."

ఇది శ్రీ నారాయణుని వర్ణనమని చెప్పఁబనిలేదు. కుండలిత భాగము క్రిమిభక్షిత పూరణము. కాని అతని పంచాయుధములలో ప్రధానమైన సుదర్శన చక్రమును వదలి నందకమును పేర్కొనుట సంప్రదాయౌచిత్యమునకు భంగము. శ్రీ విష్ణు సహస్రనామముల కడపటి శ్లోకము 'శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః' అని పంచాయుధములను పేర్కొని మరల వెంటనే 'రథాంగపాణి రక్షోభ్యః' అని పునరుక్తి చేయుట దాని ప్రాధాన్యమును తెల్పుటకే. మరి అన్నిటిలోను శ్రీ సుదర్శనమునే శ్రీమన్నారాయణుని మూర్తిగా భావించి యుపాసించుట వైష్ణవ సంప్రదాయము.

"యదాయత్తం జగచ్చక్రం కాలచక్రంచ శాశ్వతమ్,
పాతు న స్తత్పరం చక్రం చక్రరూపస్య చక్రిణః."
(షోడశాయుధస్తుతి-2)

అని శ్రీ వెంకటనాథుల సూక్తి. కనుక 'అతుల సుదర్శనం బద్భుతోజ్జ్వల హేతి' ఇట్లో ఇంకెట్లో పూరించుట యుచితము. దానిని వదలి నందకమును స్మరించుట ఉచితము గాదు.

ఇఁక నన్నిచోడుని కుమారసంభవముమాట చెప్పఁబనిలేదు. ఆ గ్రంథమునం దున్నన్ని కలుషితపాఠములు ఇంకెందును కానరావు. ఎందరు చేయివేసి కడిగినను మాయని మచ్చలు దానిలో మితిమీరి అంటుకొని నిలిచినవి. ప్రథమాశ్వాసము రెండవ పద్యము మొదటి పాదముననే,

"రమణీయ శృంగార రజతపర్వతము నా
శోభిల్లు సిద్ధవిస్ఫూర్తిమూర్తి"

అని పాఠము వావిళ్లవారి ముద్రణముననున్నది. రజతపర్వతమువలె పరమశివుఁడున్నాడని చెప్పవలయుటకు కావలసినది 'శుద్ధవిస్ఫూర్తిమూర్తి'యే కాని 'సిద్ధవిస్ఫూర్తిమూర్తి' కాజాలదు. 'సిద్ధులకు విశేషముగా స్ఫురణగలమూర్తి' అని యర్థము చెప్పుట సాధ్యమే కాని అది ప్రకృతోపయోగములేని ఆడంబరవాక్యమగును. ఆ పద్ధతిలోనే అదే పద్యపు మూఁడవ పాదమున, 'ఆతుంగశృంగ జలాపూర్ణ సరసినాఁ బొంగారు జాహ్నవిభూరివారి' అనుచో 'శిలా

---

1. 'దేవియు' అని సవరణ; అనావశ్యకము. దేవులు గౌరవబహువచనము. దీనివంటిదే 'దేవేరి' గూడ. 'దేవియరు' అను కన్నడ బహువచనరూపము తెలుఁగున ఆ రూపముతో నిలిచినది.

పూర్ణ సరసి' యని అచ్చులోఁగల పాఠమును గూడ సాధింపవచ్చును. కొండమీఁది సరస్సులో రాళ్లుండక పోవునా? కాని ప్రకృత కవికల్పన కుపకరించునది 'జలాపూర్ణత'యే కాని 'శిలాపూర్ణత' గాఁజాలదనుట ఔచితీవిదులకు స్పష్టమే.

ఇట్లు సాధుపాఠముల నూహించుట యెంతో జాగ్రత్తతో చేయవలసిన సాహసకార్యము. కాని సాహిత్య వ్యాసంగము సాధింపవలసిన ప్రధానసిద్ధి అది. ఇదే కవిహృదయమని నికరముగా చెప్పగలుగుట సాహిత్యానుభవమునందలి పరసీమ; పరకాయప్రవేశ విద్య. కాని యీ ప్రయత్నములో ఎప్పుడో యెక్కడనో కాలుజారుట యెవరికైనను తప్పనిసరి. అట్లని ఆ ప్రయత్నము నే వదలుకోలేము. వదలుకోరాదుగూడ. వదలుకొంటిమా చదువు వట్టి సంతకోలాహలమగును; చదువు చెప్పుట వట్టి పాండిత్యపు బిగుసులగును; గ్రంథ ప్రకటనమున ములుకులు జోడించువానికి, చిత్తులు దిద్దువానికి, పరిశోధకునకు భేదము లేకపోవును; అచ్చుపడిన పుస్తకము వ్రాతప్రతికంటె పనికిమాలినదగును. ఇప్పటి అనేక ప్రాచీనగ్రంథ 'పరిశోధన' యీ మెట్టు ఇంకను దాటలేదని చింతతో చెప్పవలసియున్నది. మరి వానినే నమ్ముకొని పాఠశాలలలో పాఠము చెప్పవలసిన పండితుల స్థితి చెప్ప బనిలేదు. ఇందువలననే శ్రీ తిమ్మావజ్ఝలవారి ప్రయత్నము నభినందింప నర్హమైయున్నది. వారు గ్రహించిన నాలుగు ప్రయోగములనుగూర్చి నాకుతోచిన రెండుమాటలు వ్రాయుచున్నాను:

౧) మొదటిది 'వారణసేయ దావగొనవా' అను శ్రీనాథుని గాథాంధ్రీకరణ పాఠము. ఈ పద్యము 'కొన్ని లక్షణగ్రంథములలోఁ గానవచ్చుచున్నది' అని శ్రీ కోదండరామయ్యగారు వ్రాసిరి. కాని ఏ లక్షణగ్రంథములో వివరింపలేదు. ఆగ్రంథముల పాఠమును పరిశీలింపఁగల్గినచో మన కింత చర్చ చేయవలసిన పని యుండదు. ఏయొక లక్షణగ్రంథము ప్రతియందైనను సులభాన్వయమైన పాఠము లభింపక పోదు. నాదృష్టికిదివచ్చుట శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు 1909 లో మొట్టమొదట ప్రకటించిన ప్రతియందు క్రింది టీకలో - (ప. ౬౬౮) - సుమారు 1912 సమయమున. అప్పటికి దీనిమూలమైన ప్రాకృతగాథ, దాని పరివర్తనమైన సంస్కృతశ్లోకమును నాకు పరిచితములే. వాని పాఠ మిది:

i) "కస్సవ ణ హోఇ రోసో
దట్ఠూణ పిఆఇ సవ్వణం అహరం,
సభమ పఉమగ్ఘాఇణి
వారిఅవామే సహసు ఎణ్హిమ్."

(ధ్వన్యాలోకాదులు)

('ఉపమగ్ఘాఇణి' అని అక్టోబరు భారతి 71, 78 పుటలందలిది అచ్చుపొరపాటు.)

ii) "కస్యవా నభవేద్రోషః
ప్రియాయాః సవ్రణేऽధరే,
సభృంగం పద్మ మాఘ్రాసీః
వారితాऽసి సహస్వేదానీం."

(కువలయానందము, వ్యాజోక్తి.)

దీనికి నా తెలిగింపు-ఎప్పుడో భారతిలో దానిని ప్రకటించినట్లు నాజ్ఞప్తి-ఇట్లున్నది:

"ఎవని కలుక గలుగదే ప్రియురాలి కె
మ్మోవి కొఱుకగన్న? ముగుద! తేంట్లు
ముసరియున్న తమ్మి మూర్కొంటివి వల
దన్న వినక! సైఁపుమ్ము యిపుడు"

(తరువాత దిద్దుకొన్న పాఠము)

శ్రీనాథుని పద్యపాఠము మానవల్లివా రిచ్చినది ఇట్లున్నది:

"వారణసేయ దావగొన
వానవ వారిజమ్ముఁగొఁ డేఁటి శ్రో
త్రాగుదునుంట నీ పెఱుఁగ
నా! ప్రియ! హా! తెరగంటి గంటి కె
వ్వారికిఁ గెంపు రాదె? తగ
నా మగవాఁల దూఱు! నీ మగం
డారసి నీ నిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వు వెచ్చలీ!"

పై శ్రీగీతల పాఠమనన్వితమని దానిమొగమే చెప్పుచున్నది. కనుక 'ప్రియ వాఁతెరగంటిఁ గంటి కెవ్వారికి' అని సవరణనే నూహించుకొన్నది. 'దావగొనక=నిలుపోపక, నిలువలేక' అన్న అర్థమును మానవల్లివారే అక్కడ సూచించి ఇతర కవిప్రయోగము లిచ్చినారు. వానిలో పై శ్రీనాథపద్యము నొకటి. రెండవదానిని వారు తేఁకలేదు. తరువాతి పండితు లెందఱో దీని ననువాదము చేసిరి కాని పద్యపాఠ చర్చను చేయు చేయలేదు. ఆంధ్ర ధ్వన్యాలోకమున పండితవతం

సులు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు గారు 'తావిగొనవా' అనుపాఠము పరిగ్రహించిరి. ఇది వారే యూహించిన పాఠమని నా నమ్మిక. ఎట్లును ఆసవరణ నాకు రుచించినది. అంతేగాని 'త్రావఁగనునా' అని నేను సవరణ సూచించినానేమో యని శ్రీ కోదండరామయ్యగారు సందిగ్ధముగా ఉంచుకొన్న జ్ఞప్తి అనావశ్యకము. అసలు యతియే ఆసవరణలో ఎగిరిపోవును. 'తావిగొనవా' అను సవరణగూడ అట్టిదే. 'తావుగొనవా' అను వారి సవరణయందును తద్దోషతాదవస్థ్యము తప్పదు. 'తాల్మిగొనవా' అను దిద్దుపాటు యతిని రక్షించినదిగాని ప్రకరణ సామంజస్యము లేనిది. 'ప్రియ వాతెర' అన్నచో 'ప్రియము వాతెర' అను సంస్కరణము అసలు ప్రకరణమునే తలక్రిందు చేసి చిక్కును తెచ్చిపెట్టుచున్నది. కనుక ఇవేవియు పరిగ్రాహ్యములు కావు. 'వారణసేయ పద్యనాత్మిక' అను శీర్షికతో విద్వద్వరేణ్యులు శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు, శ్రీ అవధానం చంద్రశేఖరశర్మగారును ఈ విషయమునే అక్టోబరు భారతిలో స్పష్టపరిచినారు. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారి 'తావుగొనవా' అను సూచన అంత తృప్తికరముగా దోపదు.

ఇక పైపద్యమందలి 'దావగొను' అను నుడికారమునకు వేరేమైన సమంజసార్థము గలదేమో విచారింతము. మానవల్లి వా రిచ్చిన 'నిలుపోపు' అనునర్థము ఎట్లు వచ్చినది? 'దావ' అనఁగా 'నిలుపు' అని, 'కొను' అనుటకు 'ఓపు' అని అర్థము లేదుగదా... శబ్దరత్నాకరము ఈ శబ్దపల్లవక్రియనే సంగ్రహింపలేదు. కాని "దావ. దే. వి. తగవు. 'దావలఁ బెనఁచి' ద్వి. హరిశ్చ. ౧ భా" అని చెప్పి '(ఇది విచార్యము)' అని సూచించినది. సందిగ్ధము అవ్యుత్పన్నమునైన ఆ యర్థమును పరిగ్రహించితిమేని ప్రకృతపద్యమున 'తగవులాడు - ఎదురు తిరుగు' అను నర్థము సంపాదించుకోవచ్చును. 'వారణసేయ దావగొనవా' అనుటకు 'నేను వద్దనఁగా ఎదురు తిరుగలేదా నీవు!' అని యూహింపవచ్చును. ఇది 'వారితవామే - వద్దన్నపని వాలాయముగా చేయు పెంకెదానా!' అను మూలవాక్యమునకు కొంత చేరువగా నుండును. కాని దావ అనురూపమే సందేహాస్పదమైనప్పుడు? సూర్యరాయ నిఘంటువు అసలు పాఠమున చిన్నయరసున్న చేర్చి 'తావగొను' అని విడదీసుకొన్నది. 'తావ'ను వేఱుపఱుపక 'తావలము' అను దాని వృత్తిశేషముగా భావించి 'తావగొను' అనుటకు 'తావుగొను' అని వ్యుత్పత్తి చూపినది. మరి 'దావ'ను పూర్తిగా వదలిపెట్టలేదు. శ. ర. ఇచ్చిన ప్రయోగమును పూర్తిగా నిచ్చి 'ఇది విచార్యము' అను శంకను మాత్రము త్రోసిరాజన్నది. 'తావగొను' అనుపదమునకు నెలకొను, నిలుకడనొందు, స్థైర్యమునొందు, తాళు, ఓర్చు అను లక్ష్యార్థములిచ్చినది. 'ఈ పదము కు. సం. లోనే కొన్నిచోట్ల కన్పట్టుచున్నది' అని కొంత అపనమ్మకమునుగూడ ప్రకటింపకయుండలేదు. మానవల్లివారు "నావుడు...ప్రార్థివముఖ్యుఁడు తల్లడంబునన్. దావగొనంగలేక తనతమ్ముల నప్పుడ..." అన్నతిక్కనగారి నిర్వచనోత్తరరామాయణ ప్రయోగమునుగూడ ఉదాహరించినారు. సూ. రా. దాని నెందుకో గమనింపలేదు. మరి తావలము కొను అను పదసంధిలో 'లము' అను రెండు అక్షరములు లోపించి తావకొను తావగొను అను రూపసంకోచమేర్పడుననుటయు సందిగ్ధమే. 'తాలగొను' అను ద్వితీయాక్షర లోపము సంభావ్యమే కాని రెండవ యక్షరము నిలచి తక్కినవి లోపించిన యుదాహరణము లరుదు. మరి ప్రయోగాంతరములును మృగ్యములు. కాని ఒక సమర్థనమార్గమున్నది. తావు అనుపదమునకు వ్యవహారమున 'తావ' అనురూపము మా సీమలో కలదు. ఏచోట అనుటకు 'యాతావ' అని ప్రాకృతవ్యవహారము. కన్నడమందును 'తావు' అనునదే గ్రాంథికరూపమైనను 'తావ' అను వ్యావహారికరూపము గలదు. 'తావ' అను నేఁటి వికృతిరూపము ప్రాచీన ప్రాకృత వ్యవహారమందే యేర్పడియుండునని సాధించుటకు ఆధారము చాలదు. కనుక ఈ ప్రదక్షిణాలు వదలి 'తావిగొనవా' అను సవరణ గ్రహించుట సుఖము. మరి 'సభ్రమర పద్మాఘ్రాయిణి' అను ప్రధాన భావమును తెలుఁగున పూర్ణముగను. ఇక 'వారితవామే' అనుచోటి 'వామే - పెడసరిదానా!' అను నర్థము తెలుగులో రాలేదేయని సంకోచింతురేని వ్యంగ్యమర్యాదచే దానిని సాధింపవచ్చును. శ్రీనాథుని తెలిగింపు స్వతంత్రమే కాని మూలమునకు పరవశము కాదనుట విస్పష్ట విషయమే.

౨) శ్రీ కోదండరామయ్యగారు విమర్శించిన రెండవ పదము నాచనసోముని యుత్తరహరివంశమునందలి 'నవ్వులమాటలో నిజమొ' (౨-౭౮) అను పద్యమునందలి 'గడసాని' అనునది. 'కడసాని' అని నా జ్ఞప్తిలోని పాఠము. 'గడసాని' అనగా

గడయొక్క పల్లెలలో ప్రదర్శనము సాగించు దొమ్మరిసాని కావచ్చునని వారూహించిరి. బాగుగనే యున్నది గాని అంత దూరము ఈ ప్రకరణములో వెళ్ళవలసిన పనిలేదేమో! 'కడసారె' యన్న శ్రీ ప్రభాకరుల తీర్పుగూడ కష్టపనిగానే తోచును. 'కడసాని' అను సవరణ కడపట శ్రీ కోదండరామయ్యగారు అనుగ్రహించిరి. 'కడసాని ననుఁ' అనుటకు 'జీవిత చరమదశలోనున్న ముదుసలినయిన నన్ను' అని యర్థము వారు సూచించినది. ఈ ప్రయోగము అసాధువనలేము గాని కొంత వింతయైనది అనుకోక తప్పదు. 'కడసాని' అను పాఠమే చాలునను కొందును. పదమంది సానులుగల వేశవాటికలో తారుణ్య సౌందర్యాదులచే కమనీయులైన తక్కిన సానులు ఒకరొకరు వినియోగమైపోగా ఆ గుణములు శిథిలములైనది, ఇతరులు వదలినదయైన 'కడపటి సాని' నేనను నర్థము సుగ్రాహ్యముగనే యున్నది. గకారమును కకారముగా మార్చుట యొకటే మనము చేయవలసినది. గస డదవాదేశపు ఈ అవ్యవస్థ వ్రాతలో నాటికి నేటికిని సాధారణమే. కడసారె - కడసాని అను తీర్పులలోను ఈ కష్టము తప్పదు.

మరి పై పద్యము నాల్గవపాదమున 'గడివోయిన వా ఖ్మ్రడువంగవచ్చునే' అను పాఠము శ్రీ కోదండరామయ్యగా రిచ్చినారు. అది ముద్రణదోషమో కాదేని అర్థమేమో తెలియదు. 'కడివోయిన వే న్మ్రడు వంగవచ్చునే' అను పాఠము ఇదివఱకు ముద్రితమైనది. సుగ్రాహ్యము గూడ.

3) చర్చితమైన మూడవ పాఠము నన్నెచోడ కుమార సంభవము తృతీయాశ్వాసమందలి 'స్మరకలహంబున' అను పద్యము నాలవ పాదమునకు చేరినది. 'కరమమరిన నెత్తపలకగతి వీఁపొప్పన్' అను సవరణ గొప్ప యౌచిత్య దర్శనమున్నవారికే సాధ్యము. వ్రాతలోని 'వింపు'ను 'వీఁపు'గా చదువుకొనగల్గుటకు చక్కని ప్రకరణ పరిశీలనమును ప్రాఁతవ్రాఁతల సూక్ష్మ పరిచయమును ఆవశ్యకములు. ఇది శ్రీ ప్రభాకరశాస్త్రి గారి వ్యుత్పత్తి సౌరభమునకు సాక్షి. మరి వారికై తంజావూరి సరస్వతీమహాలులోని ప్రతిని ముక్కకు ముక్కగా తయారుచేసి శ్రీ తిరుమల రామచంద్రాచార్యు లిచ్చిన వ్రాతప్రతి యేమైనది? దానిని పరిశీలించినచో కుమారసంభవములోని గడ్డు చిక్కు లెన్నో తీరగలవని యాశింపవలసియున్నది. మానవల్లివారు ప్రశంసించిన మరి రెండు ప్రతులును, వావిళ్ళవారు చెప్పకొన్న రెండు వ్రాతప్రతులును మనకు కంటికి పడు 'భాగ్యము' లేదు. అసలుకు ఆ నాల్గుప్రతులును సృష్టిలోనున్నగదా యీ యాశ, యీ యాశంస!

4) నాల్గవపదబంధము 'నోరఁగొలఁదుల్' అనునది మాత్రము కాక ఆ కుమార సంభవ పద్యమందు సందిగ్ధములుగా మరికొన్ని గలవు - నా పాలికి.

"అక్కజమై మహార్థనివ
హంబు సడుక్తుల మెచ్చఁ జూచినన్
ప్రక్కదమైన సత్కృతి యు
గుర్వుగఁ గా కిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్లు నోరఁగొలఁ
దుల్ పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ గృతి
యుం గృతియందు రె వాని మెత్తురే"
(౧-౩౮)

శ్రీ కోదండరామయ్యగారు పరామర్శించిన 'నోరఁగొలఁదుల్' అనుదానినే మొదట పరీక్షింతము. నోరన్ + కొలఁదుల్ అని వ్యస్తముగా గదా పై ప్రయోగమును గ్రహింపవలయును! నోరన్ అనఁగా నోటియందు, సరి. 'కొలఁదుల్' అను మాట కేమర్థము? మితమైన పలుకులని తాత్పర్యమా? అప్పటికి 'పురికొల్పఁగ' అను పదమునకు సార్థకమేమి? పురికొల్పుట యనగా ఒత్తుగా పెనవేయుట కాదా? అప్పుడు అల్లు ఒకదానితో నొకటి పెనగి త్రాడుగా పేనినమాటలు మితముగా నుండవలెనన్న భావమున కేమి ప్రయోజనము? కనుకనే 'నోటి కొలఁదుల్' అను రూపము యూనివర్సిటీ ముద్రణమందు పరిగ్రహింపబడినది. 'నోటికి వచ్చినట్లెల్ల' అని యర్థము. 'ముఖమస్తీతి వక్తవ్యం' అను న్యాయముచే తోచినట్లెల్ల వదరుట. 'అట్టిమాటలలో ఏవైన ఒకటి రెండు మంచిమాటలు గూడ దొర్లినమాత్రమున వానిని మెత్తురా? దాని నొక కృతి యందురా?' అని యర్థము. కాని యూనివర్సిటీ ముద్రణములో 'నోరుగొల, నోరఁగొల' అను పాఠాంతరములును చూపబడినవి. కాని నోరు, ఊరు, తీరు వంటి రేఫాంతపదములకు ఉపవిభక్తిగా ఇకారము మాత్రమే వచ్చుట, ఏఱు, మాఱు వంటి శకటరేఫాంతములకు 'టి' వర్ణము వచ్చుట మన భాషా ప్రాచీన సంప్రదాయముగా తోఁచుచున్నది. తరువాత ర-ఱలు

రెంటను కలిసిపోయి ఉపవిభక్తి కూడ యథాయథముగా ప్రయుక్తమైనది. 'ఊరికి' అనుచోట కూడ 'ఊటికి' అను ప్రాకృత వ్యవహారము నే నొకచో విన్నాను. కనుక 'నోటి కొలఁదుల్' అను సవరణకంటె 'నోర కొలఁదుల్' అని యుండుట యుక్తతరము. ఈ చోట సూ. రా. నిఘంటువు 'నోరు' పదముక్రింద "నోరఁగొలఁది=నుర్వాక్యమగును. కు. సం. ౧-౩౭" అని గ్రహించినను, 'కొలది' శబ్దముక్రింద 'నోరికొలఁదులు= నోటికి వచ్చినమాటలు' అను రూపము నంగీకరించి 'అగుర్వ' అను పదమునకై పైపద్యమునే యుదాహరించి అందు 'నోరికొలఁదుల్' అను రూపమునే అనుగ్రహించినది. నాకేమో 'నోరికొలఁదుల్' అనుపాఠమే ఉచితతరముగా కాన్పించుచున్నది. 'నోటికి వచ్చిన ట్లెల్ల' అనియే తాత్పర్యము.

ఇక చిన్నతిరుమలాచార్యుని 'దురహంకృతికవిత నోరఁదోఁడుంగ్రుబుధుల్' అను పద్యమందలి నోరఁదోఁడు' శబ్దార్థ మేమో నాకు స్పష్టముగా లేదు. 'తోఁడు' లోని అరసున్న శ్రీ కోదండరామయ్యగారి యుదాహరణమున లేకపోవుట ముద్రాదోషము గాబోలును. నోటినుండి బలవంతముగా తోఁడుట అని యర్థము గావచ్చును. అస లది నోరఁదోఁడో ఓరఁదోఁడో నికరముగా చెప్పలేము. ఓఁదోఁడైనచో తాళ్ళపాక వారి అనేకాపూర్వ పదబంధములలో అర్థముకాని దిదియు నొకటనుకోవచ్చును ఓరఁగన్ను, ఓరఁజూపు ఇత్యాదులవలె నోటినుండి తోఁడి ప్రక్కలలో రాశి వేయవలసినవని, పనికిరాని మట్టివంటిదని తాత్పర్యము చెప్పకోవచ్చును. కాని యీ రెంటికిని పరస్పర ప్రయోజ్య ప్రయోజకభావము ఇప్పటికి సందిగ్ధమే.

పై పద్యములలోని క్రీగీతలుగల పాఠము లన్నియు అర్థనిర్ణయ చేయవలసినవే. మెచ్చఁజూచినన్ అనగా తెగఁజూచు-చొఁజూచు ఇత్యాదులవలె ప్రేరణార్థకమై 'మెప్పించు' అను నర్థము చేయవలెనా? సదుక్తులు= చక్కని వాక్పటిమగలవారు అని గ్రహించి వారినే మెచ్చువారినిగా గ్రహింపవలయునా? లేక 'చక్కని పలుకులు' అని కర్మధారయముగా తీసుకొని 'సదర్థనివహంబు'తో జతగూర్చి వాగర్థములు రెంటిని సంపాదించుకోవలయునా? క్రుక్కిదము = అను పదమునకు మూలార్థమేమి? తాత్పర్య మెట్టిది? క్రుక్కు ధాతువునకు 'అగుము—కూరు' అను నర్థమిచ్చి దాని భావార్థ కృదంతముగా గ్రహించి సూ. రా. నిఘంటువు పైపద్యమునకుతోడు పాల్కురికి సోమన్న ద్విపద యొకటియు నుదాహరించినది. 'నిండినది' అని యర్థమిచ్చినది. కాని 'మెచ్చఁజూచినన్ నిండినదై' రచనకు ప్రాస పూర్తితప్ప వేఱు ప్రయోజనము తోఁపదు. 'పూడినది' అని యిచ్చిన రెండవ యర్థమును,

'గ్రుక్కిన భస్మంబు గాఱు రంధ్రంబు
క్రుక్కిదంబై కట్టుకొని కీలుకొనుఁడు'

అను సోమనాథుని ప్రకరణమున సరిగా అతికినట్లు తోఁపదు.

ఇట్లే 'అగుర్వు' శబ్దముగూడ. దీనిని 'అగుర్వ' అను రూపముతో గ్రహించి సూ. రా. నిఘంటువు అధికము — శ్రేష్ఠము అని యర్థము లిచ్చి కుమారసంభవమునుండియే పై పద్యమును, మఱొక్కటియు ఉదాహరించినది. అగుర్వు—అగుర్వ రెంటను ఒకదానిరూపములే, గెలుపు — గెలువు ఉన్నట్లు. అర్థము మాత్రము అస్పష్టమే. కన్నడమున ఇది బహుళ ప్రయోగముగల పదము. 'అగి' అను ధాతువు కృదంత రూపము కాని, 'అఘోర' అను దాని తద్భవరూపము కాని కావచ్చునేమో అని కిట్టెలు నిశ్చయము చాలక సూచించినారు. అగుర్బు—అగుర్వ అని రెండు రూపములును దాని కందు గలవు. ప్రాయశః తెలుగు అగుర్బు నకు ఆ అగుర్బు మూలము కావచ్చును. దీనికి కిట్టెలు ఇచ్చిన అర్థము Amagement Terror, a terrible form; అద్భుతము, భయము, భయంకరరూపము— అని. ప్రకృతము మన కాయర్థములు పనికివచ్చునట్లుగా తోఁపదు. అద్భుతము అనుట కొంత పనికివచ్చునేమో కాని మొదలే 'అక్కజము' ఉండుటచే ఆ పునరుక్తి కవకాశములేదు. ప్రకాశించునది, ఆకర్షకమైనది అను లక్ష్యార్థము తీయవచ్చును.

'చీకులావుకం ద్రొక్కినయట్లు' అను సామెతయు నా పాలికి టీకాసాపేక్షమే—లావుక అనఁగా ఏ పక్షియో, గుడ్డివాఁడు దాని నేల త్రొక్కవలెనో, త్రొక్కిన నేమగునో, దీనివలన మనము గ్రహింపవలసిన సామాన్య న్యాయ మేదో నే నెఱుఁగను. ఎప్పుడో ఒకానొక పండితుడు దీనికి చేసియమైన వివరణ వ్రాసి యుండఁగా చదివినాను గాని మఱచినాను.

శ్రీ కోదండరామయ్యగారు ఈ వ్యాసంగము నింకను పెంచి తెలుగుముఱుగులు వెలికిఁదెచ్చి లోకమున కుపకరింతురు గాక.

# ఆగంతుకుడు

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

సంధ్యచీకటి, ముసుగ వేసుకు వస్తోంది.

'అబ్బ! చీకటిపడిపోతోంది...' అమృతవల్లి ఏదో చెప్పబోతోంది. శ్రీధర్ ఇంకా రొప్పుతూనే వున్నాడు. తల గట్టిగా పట్టుకున్నాడు. నువ్వేమి మాట్లాడవద్దన్నట్లు తల గట్టిగా త్రిప్పాడు. ఆమె పెదిమలు తడబడ్డాయి. కళ్లు గట్టిగా మూసుకుంది. రెండు చేతులు మొహాన పెట్టుకుని ఒక్క క్షణం గజగజ వణికింది.

'నన్ను పడుకోనీ ... కాసేపు మాట్లాడక... నిన్నే...ఊరికే వేధించక...' శ్రీధర్ బరువుగా లేచి లోపలకు వెళ్లాడు.

'నేనేం చేశానని నామీద మీకు అంత అక్కసు, కోపము... చెప్పండి...నన్ను ఇట్లా హింస పెట్టకండి..' అమృతవల్లి పొంగుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకోవటానికి ప్రయత్నం చేస్తోంది.

'అబ్బ! కాసేపు మాట్లాడక...నన్ను పడుకోనీ' ఎంతో ఆవేశంతో అన్నాడు.

'నా మొహం చూస్తుంటేనే మీకు ఇదయిపోతారు. నేనేం పాపం చేశానని...' ఇంకా ఏమేమిటో భర్తకు వినిపించనంత సన్నగా గొణిగింది.

'ఊ...' అంటూ మూలిగి పడుకున్నాడు శ్రీధర్. అట్లాగే సన్నగా మాట్లాడుతూనే వుంది. శ్రీధర్ మాత్రం మెదలకండా పడుకుని వున్నాడు.

ఓరకంటితో తలుపుల సందుల్లోంచి కళ్లు పెద్దవి చేసుకొని తీక్ష్ణంగా ఒకాయన చూస్తూ నిలబడ్డాడు. కాస్తంత గాలికే తలుపులు రెండూ చెరోవైపుకు జారుకున్నాయి. ఆవ్యక్తి తడబడుతూ చూస్తూ నిలబడిపోయాడు. అమృతవల్లి కళ్ళు రెండు ఆవ్యక్తిమీద గభాలున నిలిచిపోయినాయి. క్షణంలో పెద్ద భయం వేసింది. అపరిచిత వ్యక్తిని అంత హఠాత్తుగా చూసేటప్పటికి ఒళ్లు ఝల్లుమున్నది. మీరెవరని అడుగుదామనుకుని కూడా మాట పైకి పెగిలిరాలేక చప్పబడి వూరుకుంది. అంతకంటె కూడా ఆవ్యక్తి భయపడిపోయినట్లు కళ్లు అటూఇటూ గబగబ తిప్పేస్తున్నాడు.

అమృతవల్లి గాభరాగా బరువుగా మెల్లిగా లేచి నిలబడింది. ఏమి మాట్లాడాలో అర్థం కాలేదు. దీపం పెద్దది చేసింది. చేతులు గజగజలాడుతున్నాయి. భర్త తలమీద నిమిరింది. శ్రీధర్ చివాలున ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. కళ్లారుస్తూ చూస్తుంటే మసకమసకగా ఎదురుగా నిలబడ్డ వ్యక్తిని చూడగలిగాడు. కళ్లుగట్టిగా నలుపుకుని బాగా చూశాడు. ఆశ్చర్యంగా లేచి నిలబడ్డాడు.

'ఎవరుమీరు?' అన్నాడు.

చప్పున బెడ్డింగు క్రిందపెట్టేసి, కళ్ళు రెండు పెద్దవి చేసుకుని చిరునవ్వు మొహం పెట్టాడు ఆవ్యక్తి.

ఎవరుమీరు అన్నట్లు కళ్ళు తిప్పాడు శ్రీధర్.

'నా పేరు చంద్రం. మాది చాలా పల్లెటూరు లెండి ... అసలు నేను ఇప్పుడు ఇక్కడికి రావాలిసిందా! ఎప్పుడో పొద్దునే ఊడిపడాలసినవాణ్ని. అయితేయేం! ఈ రైళ్లు ఏనాడు సరియైన టైముకు వచ్చాయని! ఏమయితేనేమిలెండి. సరియైన ఇంటికి వచ్చాను. అసలు విషయం చెప్పటం మరిచేపోయినా. రేపు నేను ఉద్యోగంలో జాయను అవ్వాలి. అంటే ఉద్యోగానికి ఇంటర్వ్యూకు వచ్చాను. నన్ను ఇంటర్వ్యూ చేసినవాడు ఎవ్వరూ కూడా నన్ను సెలెక్టు చెయ్యకండా తప్పించుకోలేదు. అయితే ఏం ప్రయోజనం? నాకు ఒక్క వుద్యోగమూ నచ్చదు. ఇంతకీ ముఖ్యమైన విషయము ఏమిటంటే నాకు ఈ ఉద్యోగ ప్రాప్తి వుంది. ఇక్కడికి వచ్చేశాను. ఇక్కడ ఒక భాగం ఖాళీగా వుందని తెలిసింది. ఎట్లాగంటే, టులెట్ బోర్డు చూశానులెండి! మీరు నన్ను ముందుగా ఏ ప్రశ్నలు వెయ్యకండానే అతిముఖ్యమయిన రెండు విషయాలు చెప్పేస్తాను. నాకు పెళ్ళయింది; మొదటిది. నాకో పిల్లాడు కూడాను; రెండోది. ఈ పోర్షను నాకు ఇచ్చేసెయ్యండి. అద్దె విషయము నాకేమీ ఫరవాలేదులెండి...!' ఏమంటారు అన్నట్లు శ్రీధర్ మొహంలోకి చూశాడు.

శ్రీధర్ అవుతే చిత్తరువులాగ అట్లాగే నిలబడిపోయాడు. అమృతవల్లి నడ్డిన చెయ్యిపెట్టుకుని అదే. పనిగా చెవులు అప్పగించుకుని నిలబడిపోయింది

ఆ వ్యక్తి మాట్లాడటం మానేసేటప్పటికి తనకు స్పృహ వచ్చినట్లు అనిపించింది. భర్తవైపుకు చూసింది ఇట్టే. ఇంకా ఆయన, ఆ వ్యక్తిమీదనుంచి దృష్టిని మరల్చనే లేదు. భర్త కళ్లల్లోనుంచి ఆ వ్యక్తిని చూసింది. ఆయన చిరునవ్వు నవ్వుతున్నాడు.

'ఒక్కటే గది...' అని శ్రీధర్ మొదలుపెట్టాడు.

'అయితే ఏం!...' ఆయన ముందుకు అతిచొరవగా ఒక అడుగువేశాడు, తొంగి చూస్తున్నాడు.

'ఇదేగా. భేషుగ్గా వుంది! మేము ఎంతిలోనైనా సరిపుచ్చుకుంటాం. ఎవరితోనైనా సర్దుకుపోతాం. అసలు మావంతా విచిత్ర ప్రకృతి లెండి. మేము ఒకళ్ళతో పోట్లాడేవాళ్ళం కాదు. మీకు తెలీదేమో! నిజం చెప్పకూడదు కానీండి, మా ఆవిడ నాకంటె చాలా తెలివికలది. ఎక్కడ నాలుగురోజులున్నా సరే అబ్బ! అంత ఉత్తమురాలిల్లాలు లేదమ్మా అని అనిపించుకుని బైటపడాల్సిందే! నా సంగతి సరేసరి! నోటిలో నాలిక లేనివాణ్ణి. మరిచేపోయినా చెప్పటం. నేను కొంచెంగా రచిస్తాను కూడా అంటే రచయితనన్నమాట ఈ మధ్యనే ఒక పుస్తకంకూడా అచ్చువేయించాను. నా విషయాలు నేను చెప్పకోకూడదు లెండి. నాలుగురోజులు లాగితే మీకే తెలుస్తాయి. నిజంపటికే నాలుగురోజులుకూడా ఆగక్కర్లా. నేను మీకు అనవసరంగా శ్రమయిస్తున్నాననుకుంటా. కాని మీ ఇరుగుపొరుగువారి విషయము తెలుసుకునే హక్కు మీకు పూర్తిగా వుంది...ఏమంటారు...' ఎంతో ధీమాగా కళ్లు తిప్పాడు.

శ్రీధర్ మారుమాటాడకుండా గదిలోపలికి తీసుకు వెళ్ళాడు. వెనకాలే చంద్రం ఒక చేతిలో బెడ్డింగు, రెండో చేత్తో పెట్టె పట్టుకుని చకచక నడిచాడు.

బెడ్డింగు ఇట్టే పరిచేశాడు. శ్రీధర్ కొంచెం వెనక్కు తగ్గాడు. చంద్రం నిలువునా పడుకుని దుప్పటి కప్పేసుకున్నాడు.

శ్రీధర్ ఆలోచనలన్నీ పటాపంచలై పోయినాయి. ఆయన మనస్సంతా చంద్రంమీదే కేంద్రీకరింపబడింది. అమృతవల్లి అసలు తన అస్తిత్వాన్నే మరిచిపోయినట్లుంది. ఏమిటో వింతగా చంద్రం చెప్పినవన్నీ విన్నది. ఆశ్చర్యంగా ఆయనవంక చూసింది.

శ్రీధర్ వెళ్ళి గదిగుమ్మంముందు తారటలాడుతున్నాడు. చంద్రం ఉన్నట్లుండి చివాలునలేచి దొడ్డిగుమ్మందగ్గరకు వెళ్లాడు. బొక్కెనలో నీళ్ళన్నీ ఖాళీ చేసివచ్చాడు. బట్టలు మార్చుకుని ఇట్లే మళ్ళీ పడుకున్నాడు. నడుముపట్టుకుంటున్నాడు. అటూ ఇటూ వత్తిగిలుతున్నాడు. నానా అవస్థ పడుతున్నాడు.

శ్రీధర్ ఇవతల గదిలో తెగ ఆరాటపడుతున్నాడు. మథన తెగటం లేదు. శ్రీధర్ మొహంలో ఎంతో పెద్ద మార్పు వచ్చినట్లనిపించింది. చంద్రం గదిలోకి వెళ్లాడు. ఆయన మసులుతున్నాడు కళ్లు మూసుకుని.

'మీ భోజనం......' అంటూ శ్రీధర్ సగంలో ఆపేశాడు.

'ఇవ్వాళ సోమవారం......అన్నాడు చంద్రం హఠాత్తుగా. శ్రీధర్ గదిలోంచి వెళ్ళిపోయాడు అనుకుని చంద్రం కళ్లుతెరిచాడు. తప్పని సరిగా నవ్వుతూ బెడ్డింగుమీద నుంచి లేవబోయాడు.

'ఫరవాలేదు పడుకోండి...' అంటూనే శ్రీధర్ తలుపులు రెండూ వేసేశాడు.

వెనకాలే అమృతవల్లి నిలబడివుంది. ఆమెను చూడంగానే మళ్లీ శ్రీధర్ మనస్సంతా చెదిరిపోయినట్లయింది. మొహం చిటచిట లాడించుకున్నాడు. పెదిమలు రెండూ గట్టిగా కదిలించేశాడు. అమృతవల్లి చిన్నబుచ్చుకుంది. అయితే బలవంతంగా నవ్వును తెచ్చుకుంటూ 'వడ్డించమంటారా?' అన్నది.

'ఏమిటి?' అని కసిరాడు శ్రీధర్.

'అన్నం...' ఎంతో నీటుగా అన్నది. కొరకొర చూశాడు. కాని సమాధానం ఏమీ ఇవ్వలేదు.

అమృతవల్లి నవ్వుకుంటూ లోపలికివెళ్లిపోయింది.

'రండి' అంటూ లోపల్నుంచి పిలిచింది. శ్రీధర్ చాలాసేపు ఘర్షణ పడ్డాడు. ఏమనుకున్నాడో ఏమో మెల్లిగా భోజనానికి వెళ్లాడు.

అమృతవల్లికి ఎన్నడూలేని సంతోషం వచ్చింది. వడ్డిస్తున్న కాసేపు కూడా తన్మయత్వం పొందింది. తాను కాపరానికి వచ్చిన తర్వాత ఇంత సంతోషము ఎన్నడూ కూడా కలగలేదు. కారణం ఏమిటో తెలీదు. ఎప్పుడూ కూడా తన భర్త తనను ఆప్యాయంగా పిలవటం కాని ప్రేమగా చూడటంగాని జరగలేదు. కారణం ఏమిటో తెలీదు. తనవలన ఏమైనా లోపం జరిగిందేమోనని నిత్యమూ ఆలోచిస్తూ వుంటుంది. అలాంటిదేమీ కనిపించదు. అలాంటప్పుడు తన మీద భర్తకు అంతకోపం ఎందుకో అర్థంకాదు. ఎన్నోసార్లు ఎన్నో రకాలుగా భర్తప్రేమను పొందుదామని

# ఆగంతుకుడు

ప్రయత్నం చేసిందికాని సఫలురాలు కాలేకపోయింది. శ్రీధర్‌కు కొత్త చిరాకు, కారణంలేని కోపం, అర్థంలేని ఆవేశం. ఇంతకీ ఆమె అందంగా లేదని ఒక కారణం మాత్రం చెపుతూవుంటాడు. ఈ మాట అన్నప్పుడల్లా ఆమె చాలా క్రుంగిపోతుంది. మానసికంగా విపరీతమైన బాధ పడుతుంది. నిత్యఘర్షణ ఇద్దరి మధ్య నడుస్తూనే వుంటుంది.

ఇవ్వాళ ఏమిటో అమృతవల్లి మొహం విప్పారినట్లనిపించింది. తన భర్తకు తనమీద అనురాగం ఏర్పడిందని మురిసిపోతోంది. ముభావంగా కూర్చున్నాడు. భార్య ఎన్నిసార్లు పిలిచినా సమాధానం చెప్పనూ లేదు. ఒక మాటకూడా మాట్లాడనూ లేదు. తన సంతృప్తికోసం అవీ ఇవీ మాట్లాడుకుంటూనే వుంది.

శ్రీధర్ తమాషాగా నవ్వుకుంటూ లేచాడు. వెను వెంట అమృతవల్లి లేచి నిలబడింది. వెనక్కు ఒకసారి చూసి గదిలోకి వెళ్లిపోయాడు. తాను గదిలోకి నడిచింది.

'ఏమండీ మిమ్మల్ని ఒక్కమాట అడుగుతాను.'

శ్రీధర్ చప్పున కళ్లు పెద్దవిచేసుకుని భార్య మొహంలోకి నిర్లక్ష్యంగా చూశాడు.

'ఏమండీ...' అన్నది మళ్లీ ప్రాధేయపడుతూ.

'నామీద ఎందుకండీ అంతకోపం ... నేనేం చేశానని... నా మొహం చూస్తేనే మీకు...' మాటలు తడబడ్డాయి.

'ఊఁ...'అంటూనే మంచంమీద పడుకున్నాడు శ్రీధర్. మంచందగ్గరగా వచ్చి నిలబడింది. మళ్లీ భర్తను పిలవటం మొదలుపెట్టింది. ఆయన చలనంలేకుండా పడుకుని వున్నాడు.

'నేనీ విసంగా ఈ ఇంట్లో ఇంక ఒక్కక్షణం ఉండలేను...' బాగా అక్కసుగా అంది.

'మీరు నన్ను ఈ విసంగా హింసపెట్టటం...'

శ్రీధర్ చివాలున దుప్పటి తీసి లేచాడు.

'నీవు కాదూ చెప్పేది, వెళ్లమన్నా! ఎందుకు ఇక్కడ నిలబడ్డావు? చెపుతుంది నీవు కాదా అంట! ... నిన్నే!...' హుంకరించాడు.

మొహాన చేతులు పెట్టుకుని వెనక్కు తిరిగింది.

శ్రీధర్ ఇట్టే నిద్రపోయాడు. ఆమె మాత్రం తన జీవితాన్ని గురించి రకరకాలుగా ఆలోచించుకుంటూ చాలా ప్రొద్దుపోయేవరకు కూర్చునే వుంది. ఆ ఆలోచనల్లో మధ్యమధ్య చంద్రం వచ్చి కొంచెం మనశ్శాంతి కలిగిస్తున్నాడు. ఎందుకనో తెలీదు. చంద్రం వచ్చినప్పటినుంచి శ్రీధర్ మొహంలో మార్పువచ్చినట్టే తనకు కూడా ఏదో మార్పు వచ్చిందని అనిపిస్తోంది. విచిత్రమైన మార్పో అర్థం కావటంలేదు. మొత్తం మీద అతను ఈ ఇంట్లో అడుగుపెట్టినప్పటినుంచి అదో రకమైనభావము ఆమె మనస్సులోకి వచ్చి కూర్చొంది. ఆమె మనస్తత్వం ఇట్టే మారిపోయిన ట్లనిపించింది. చంద్రం మాట్లాడుతున్నంతసేపు ఎంతో హాయిగా వింటోంది. ఈ ప్రపంచమే మరిచిపోయిన ట్లనిపించింది. అతనిమాటల్లో అంత ఆకర్షణ కనిపించింది. కొంతసేపు చంద్రాన్ని గురించి ఊహించుకుంటుంటే చప్పగా తెల్లారిపోయింది.

అమృతవల్లి కళ్లు రెండూ ఎర్రబడ్డాయి. ఒళ్ళు బద్ధకంగావుంది. తెల్లారినా కూడా ప్రక్కమీదనుంచి లేవ బుద్ధిపుట్టటం లేదు. ఇంకా ఆలోచిస్తూనే వుంది. అప్రయత్నంగా లేచింది. ఇంకా భర్త నిద్రపోతూనే వున్నాడు. ప్రక్కగదిలో చంద్రం గాఢంగా నిద్రపోతూనే వున్నాడు. పాపం ప్రయాణంలో ఎంత అలసిపోయాడో అనుకుంది. మెల్లిగా గదివైపుకు వెళదామనుకుంది. మళ్లీ ఎందుకనో తటపటాయించి వూరుకుంది.

శ్రీధర్ నిద్రలేచేటప్పటికి కాఫీ తయారుచేసి పెట్టింది. ఆయన ఇంకా లేవలేదా అన్నట్లు గది దగ్గరకు వెళ్ళాడు. ఇంకా చంద్రం ముసుగు పెట్టుకునే వున్నాడు. పాపం ప్రయాణంలో ఎంత అలసిపోయాడో అనుకున్నాడు. భర్త మొహంలోకి చూసి, అమృతవల్లి పెద్ద నిట్టూర్పు విడిచింది. ఈసారి ఏమిటో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నట్లు కనపడ్డాడే కాని ఒక్కమాటకూడా మాట్లాడలేదు. అమృతవల్లి అయితే ఆత్రంగా భర్త ఏమంటాడా అని ఎదురుచూస్తూనే వుంది.

గదితలుపులు తీశాడు చంద్రం. శ్రీధర్ 'గుడ్ మార్నింగ్!' అన్నాడు. ఆయన చిరునవ్వుతో స్వీకరించాడు. శ్రీధర్ ముందుకువెళ్లిపోతూ, వెనక్కు తిరిగి మెల్లిగా 'వల్లీ! కాఫీ తీసుకురా' అన్నాడు. అమృతవల్లికి హృదయభారం ఎంతో తగ్గిపోయినట్లనిపించింది. భర్త పిలుపులో ఎంతో ఆప్యాయత, ప్రేమ, తొణికిసలాడినాయి. ఇట్టే కాఫీ తీసుకువచ్చి భర్తప్రక్కనే నిలబడింది. పమిట బాగా లాగి ఒళ్ళంతా కప్పేసుకుంది. తలకొంచెంగా వంచేసుకుంది. అయితే కళ్ళుమాత్రం పైకి చూడటానికే తహతహ లాడుతున్నాయి. కళ్లు

కాటిక మొహంమీదికి కొంచెంగా సాగింది. కను బొమ్మలు పైకి క్రిందకు ఎగురుతున్నాయి. ఆ సన్నటి నుదురుమీద చిన్నటిబొట్టు చాలా అందంగా కనిపిస్తోంది. కనిపించీ కనిపించని అబుగ్గసొట్ట ఆమెనవ్వుతో పాటు కనిపిస్తూ ఇట్టే మాయమయిపోతోంది. ఆసన్నటి పొడుగాటిముక్కు ఆమె మొహంలోకి ఎంతో తీరుగా వచ్చి కూర్చుంది. పొడుగాటి మొహం ఆమెఎత్తును ఎంతో ఆకర్షణగా కనిపిస్తోంది. వయ్యారంగా కాఫీకప్పును పట్టుకుని కదలక మెదలక నిలబడి పోయింది.

'కాఫీ తీసుకోండి' అంటూ శ్రీధర్, చంద్రానికి అందిచ్చాడు. 'అక్కర్లేదులెండి' అంటూనే చంద్రం అందుకున్నాడు.

ఆయన మాటలకు నవ్వొచ్చినా కూడా అమృతవల్లి మూతిబిగించుకునే నిలబడి వుంది. శ్రీధర్ మొహంలో అప్రయత్నంగా చిరునవ్వు తాండవమాడింది. ఇద్దర్నీ చూస్తూ ఆమె తనవు మరిచే పోయింది.

'మీ ఆదరాభిమానాలకు కృతజ్ఞుణ్ని...' అంటూ కాఫీకప్పు క్రింద పెట్టేశాడు.

అమృతవల్లి సిగ్గుపడి తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది.

'ఇంటర్వ్యూ కన్నారు ఏ ఉద్యోగానికి...' శ్రీధర్ చొరవ చేసుకో దలుచుకున్నాడు.

చంద్రం పకపక నవ్వాడు.

'ఈ ప్రశ్న మీరు నిన్నే వేస్తారనుకున్నా... అసలు ఉద్యోగానికి వచ్చానని చెప్పిన తర్వాత, ఆ వివరాలు చెప్పాలసినబాధ్యత నామీదే వుంది. కాని నాకు చెడ్డ బిడియం. నేను ఉద్యోగం చేస్తున్నట్లు ఎవ్వరికీ తెలియకూడదని నా అభిమతం. అందాకా ఎందుకు నాకు ఉద్యోగం అంటే ఇష్టంలేదు. నేను ఈనాడు ఇక్కడకు వచ్చానంటే నాభార్యను సంతోషపెట్టటానికే. ప్రతివాడు ఏదో ఉద్యోగం చేస్తుంటే, మీరు ఊరికే ఇంట్లో కూర్చుంటారేమిటి అంటూ ఒక టేపోరు. ఆబాధపడలేక కొన్నాళ్ళబాటైనా నేను కూడా ఒక ఉద్యోగస్థుణ్నే అనిపించుకుందామని చక్కా వచ్చేశాను. ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో నేను ఫలానా దానికి వచ్చానని చెప్పటంవలన నాకు సంతృప్తివుండదు. మీకు సంతోషమూ కలగదు. అందువలన...' చంద్రం ఇంకా తనధోరణిలోనే సాగబోతున్నాడు.

'ఈ ఉద్యోగానికి వెనక ఇంత అగాధమైనచరిత్ర వుందని నాకు తెలీదుసుమండీ...' శ్రీధర్ బాగా చొరవ చేసుకున్నాడు.

'అబ్బో! చాలాబాగా అన్నారే!...' చంద్రం పకపక నవ్వాడు. లోపల్నుంచి భర్తమాటలు వింటున్న అమృతవల్లి తెగ మురిసిపోయింది. ఇంత నాజూకుగా తన భర్త మాట్లాడతాడని తనకు ఇంతవరకు తెలియనే తెలియదు. చీదరింపులు, విసుక్కోటాలు తప్ప తన భర్తనుగురించిన వివరాలు తెలియనే తెలియవు. అత్యంత మృదుహృదయమూ, చాలా సొంపుగా కూడా మాట్లాడకలడు. సున్నితమైన హాస్యం కూడా తెలుసు. అబ్బ! ఈవిధంగా నాతో మాట్లాడుతూ వుండరాదూ!—కాసేపు అమృతవల్లి బాధపడింది.

'ఇక మీరు శెలవిస్తే...'

'అవును నాకూ టైమవుతోంది...'

చంద్రం మాటల్ని మనస్సులో నింపుకుని లోపలికి వచ్చేశాడు శ్రీధర్. ఎదురుగా చిరునవ్వు మొహం పెట్టుకుని అమృతవల్లి ఆకర్షణగా నిలబడాలన్నట్లు నిలబడిపోయింది. ఒక్కక్షణం తన మనస్సు తళుక్కుమన్నది. ఇట్టే శ్రీధర్ గిర్రున తల తిప్పేశాడు. ఆమె మనస్సు చివుక్కుమన్నది. మళ్ళీ మాట్లాడలేదు. ఏమిటో చిరాకు పడుతూనే వున్నాడు. కొన రాకుండా బాధపడుతూనే వున్నాడు. అమృతవల్లి ఓ మూల సతమతమయి పోతోంది. ఇద్దరూ కూడా తలో రకంగా బాధపడుతూనే వున్నారు. గబ గబ రెండు మెతుకులు నోట్లో వేసుకున్నాడో లేదో, చరచర వెళ్ళిపోయాడు శ్రీధర్. వెళ్ళిపోతున్న భర్తను దిగాలపడి చూస్తూ, గుమ్మం ముందు నిలబడిపోయింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినాయి. ఒళ్ళు గజ గజలాడింది. కళ్లు రెండూ పమిటకొంగుతో అద్దుకుంటూ వెనక్కు తిరిగింది. గదిలోంచి చంద్రం వచ్చేస్తున్నాడు. ఆయన్ను చూసి గబ గబ మొహం తుడుచుకుని బింకంగా కనిపించటానికి ప్రయత్నం చేస్తోంది.

వాకిటి తలుపులు దగ్గరగా వేసి నిలబడ్డాడు. ఓరవాకిలిగా వేసివున్న తలుపుచాటున అమృతవల్లి. చీరె చిరుగాలికి రెపరెప లాడుతోంది. చంద్రం రెండుకళ్లు టపటప కొట్టుకున్నాయి. ఒక్కక్షణం అగాధంగా ఆలోచించాడు.

'ఏమండీ!...' అన్నాడు ఆడగొంతుకతో. అమృతవల్లి ఉలిక్కిపడింది.

'తాళం వుంటే ఇస్తారూ!...తాళం వెయ్యాలని నా ఉద్దేశం కాదు. మీరు ఇక్కడ ఉన్న తర్వాత మా ఇల్లు తాళం వెయ్యకపోతే మాత్రం ఏమేం! అయితే మిమ్మల్ని మా యిల్లుకూడా కాపలా కాయమని చెప్పటం నాకేమాత్రం ఇష్టంలేదు. ఇది సభ్యతాలక్షణం కాదు. నాకు తెలుసు...' చప్పున చంద్రం ఆపేశాడు.

అమృతవల్లికి ఏమి మాట్లాడాలో అర్థంకాలేదు. ఏదైనా సమాధానంగా మాట్లాడాలని ఉబలాటపడింది కాని ధైర్యం చాలలేదు. ఇరకాటంలో పడ్డట్లయింది. ఏమీ తోచలేదు. ఆలోచన తెగక చప్పున లోపలికి వెళ్ళి తాళం తీసుకువచ్చి గుమ్మంలో పెట్టేసింది.

తాళాన్ని చూసి చంద్రం నవ్వాడు. తలుపులు రెండు బిగువుగాలాగి తాళం వేసేశాడు. వెళ్ళొస్తానని చెప్పాలనుకున్నాడు. ఆ క్షణంలో తనభార్య జ్ఞాపకం వచ్చింది. ఎప్పుడు వాకిట్లోకి వెళ్ళినా తనభార్యతో వెళ్ళొస్తానని చెప్పటం చంద్రానికి బాగా అలవాటు. అందువల్లనో ఏమో మనస్సొప్పలేదు. చేతుల్లు ఊగించుకుంటూ వెళ్ళిపోతున్నాడు. అమృతవల్లి వాకిట్లోకి వచ్చి చంద్రాన్ని చూస్తూ అట్లాగే నిలబడిపోయింది. కొంతదూరం వెళ్ళి చివాలున చంద్రం వెనక్కు తిరిగాడు. గభాలున అమృతవల్లి లోపలికి వెళ్ళి తలుపు వేసుకుంది. చంద్రం నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

మళ్ళీ భర్త ఆఫీసునుంచి వచ్చేదాక, ఆమెకు ఏవిధమైన కాలక్షేపమూ లేదు. కాసేపు ఏమీ తోచకపోతే ఏదైనా పుస్తకం పట్టుకుకూర్చుంటుంది. ఇవ్వాళ ఎందుకనో, పుస్తకం చదవాలనే ధ్యాస పోనేపోలేదు. ఎంతసేపటికీ తనభర్తను గురించిన ఆలోచనలే! మధ్య మధ్య మాత్రం చంద్రం వచ్చి తొంగి చూసి పోతున్నాడు. ఎందుకు తన ఆలోచనల్లోకి చంద్రం వస్తున్నాడా అని ఆరాటపడింది. ఎంత ఆయనమాట తలుచుకోకుండా వుండాలన్నా, చంద్రం వస్తూనే వున్నాడు. చాలా విసుగ్గాలేచి గట్టిగా కళ్ళుమూసుకుంది. అప్పటికీ చంద్రం తన ముందు నిలువునా నిలబడినట్లుగానే కనిపిస్తున్నాడు. అబ్బ! ఏమిటిది ఇదంతా అనుకుంటూ తెగబాధపడుతోంది. ఒక్క క్షణంసేపైనా మరిచేపోవాలని ప్రయత్నంచేసినా వీలుపడటంలేదు. ఏమిటో వింతగా ఆలోచన మొదలుపెట్టింది. బాగా అలసిపోయి చప్పగా నిద్రపోయింది.

శ్రీధర్ వచ్చి, వచ్చీ వరండాలో కుర్చీలో కూర్చున్నాడు. భర్త వచ్చినట్టే తెలీదు అమృతవల్లికి. లోపలే వుండిపోయింది. అవతల గది చప్పుడయినట్టు వినిపిస్తే దభాలున వాకిట్లోకి వచ్చింది. భర్త కుర్చీలో కూర్చుని వున్నాడు. చప్పున ఉలిక్కిపడింది. ఏమి మాట్లాడటానికి తోచలేదు ఆక్షణంలో.

తడబడుతూ 'ఎప్పుడొచ్చారు?' అంటూ భర్తదగ్గరకు వెళ్ళింది. శ్రీధర్ కోరచూపు చూశాడు.

'మీరు వచ్చినట్టు నాకు తెలీదండీ నిజంగాను..' ఏదో పెద్ద తప్పయినట్లు ప్రాధేయపడింది.

'ఏమండీ! నాతో మాట్లాడండి!...'

సమాధానం లేదు.

గబగబ లోపలికి వెళ్ళి కాఫీ తీసుకువచ్చింది. ఇవ్వాళ ఏమనుకున్నాడో ఏమో కాఫీ తీసుకున్నాడు శ్రీధర్.

'పంచదార చాల్లేదు' అన్నాడు.

ఎంత తియ్యగావుంది ఈమాట – అనుకుని పంచదార తీసుకువచ్చింది.

'ఇప్పుడు కాఫీ బాగుందండీ!...' కళ్ళల్లో కళ్ళు పెట్టి అడిగింది. శ్రీధర్ కొంచెం చలించినట్లయిపోయాడు.

'ఊఁ...' అంటూ బిగువుగాను, బింకంగాను అన్నాడు.

'అబ్బ! ఈకాస్తయినా మాట్లాడారు' అనుకుంది లోపల.

శ్రీధర్ మనస్సులో అలజడి బయలుదేరింది. తన ఆలోచన భార్యమీదకు మళ్ళింది. ఆమెమొహం చూస్తుంటే తీవ్రమైన అసంతృప్తి వెంటాడుతోంది. ఎందుకు పెళ్ళిచేసుకున్నట్లు అనే ప్రశ్న మళ్ళీ ఇంకోసారి తనలో తాను వేసుకున్నాడు. నాకు ఇష్టంలేని పెళ్ళి అని మళ్ళీ గొణుక్కున్నాడు. అంతర్ఘర్షణలో పూర్తిగా అలసిపోయాడు. అబ్బ అనుకుని తల పట్టుకుని కళ్ళు మూసుకున్నాడు.

'ఏమండీ తలనొప్పిగా వుందా?...' నుదురుమీద చెయ్యిపెట్టి అన్నది.

'ఏం లేదులే! నువ్వెళ్ళు!...' గట్టిగా కసురుకున్నాడు. బిక్కమొహం వేసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

తలుపులు తెరుచుకుని. చంద్రం నిలువునా నిలబడ్డాడు. కుర్చీలో కూర్చున్న శ్రీధర్ తన కళ్ళల్లోకి వచ్చాడు. హఠాత్తుగా ఒక ఐడియా వచ్చేసింది. చిటిక వేశాడు. చివాలున లోపలికి వెళ్ళాడు. కాగితాలబొత్తి

తీసుకువచ్చాడు. అప్పటికే శ్రీధర్ కళ్లు తెరిచి చంద్రం లోపలికి వెళ్లటం చూశాడు. ఇద్దరూ ఒకర్ని చూసి ఒకరు చిరునవ్వు మొహం పెట్టుకున్నారు. చంద్రం గబగబ దగ్గరకువచ్చి పక్కన కుర్చీ లాగేసుకున్నాడు.

'కాఫీ తీసుకురా' అన్నాడు శ్రీధర్.

క్షణంలో ప్రత్యక్షమయింది కాఫీ తీసుకుని అమృతవల్లి.

'కాఫీ చాలా బాగుందండీ...' గుటకలు వేస్తూ అమృతవల్లి మొహంవైపుకు చూశాడు. ఆమె తల వంచేసుకుంది.

'చూడండి! మీకు నా రచన చదివి వినిపించాలనుకుంటున్నాను. మీరు కొంత తీరుబడిగా వున్నట్టున్నారు... కొంత ఓపికపడతారా!...అయినా నేను రాసేది ఎవరికి? మీబోటి రసికులకు. మీరే కనక విని ఆనందించకపోతే నేను రాయటం వృథా. అయితే నాఅంతట నేనుగా వచ్చి నా రచన వినమని కోరటం నా గౌరవానికి భంగం కలుగుతుందని నేను ఎన్నడూ భావించను. నాకు అలాంటి దురభిమానంలేదు...' చంద్రం గళమెత్తాడు.

అమృతవల్లి తలుపుచాటున నిలబడి తొంగి చూస్తోంది శ్రీధర్ వింటాడో అన్నట్లు. చంద్రం ఆయన మొహంలోకి చూశాడు. అతను చిరునవ్వు నవ్వాడు.

'మీ నవ్వుయొక్క అంతర్యం ఏమిటి?' అని ప్రశ్నించాడు చంద్రం.

'అంతర్భావాన్ని పెట్టుకుని నవ్వే అలవాటు నాకు లేదు. అన్నాడు చాలా స్వాతికంగా శ్రీధర్.

మంచి సమాధానం చెప్పారులెండి!...' చంద్రం నవ్వుగా మార్చేసుకున్నాడు.

'నేను అందుకు కాదు అన్నది. ఇవ్వాళ రాత్రి కూడా బ్యాంకుకు వెళ్లాలి. నాకు ఎక్కువ టైము వుండదేమోనని...' మాటలు చప్పరించాడు శ్రీధర్.

'దాని కేముంది. డ్యూటీ ముఖ్యం. ఇవ్వాళ కాకపోతే రేపు చదివి వినిపిస్తాను. దానికి నేనేమీ అనుకోనులెండి!...' తనచేతిలో కాగితాలు చూస్తున్నాడు.

అవి చదువుతుంటే మనస్సు చలిస్తోంది. తాను సృష్టించిన వ్యక్తులు తన కళ్ళఎదుట నిల్చి, తనకు తీవ్రమైన అన్యాయం జరిగిందని పోట్లాడుతున్నారు.

నేను మీకు ఏవిధమైన అన్యాయం చెయ్యలేదు. మీరు ఆవిధంగానే పుట్టారు. ఆవిధంగానే చచ్చిపోతారు...మీ జీవితాల్లో చెప్పుకోతగ్గ మార్పులేమీ రావు... చంద్రం వాళ్లతో తీవ్రంగా ఘర్షణ పడుతున్నాడు.

ఇట్టే శ్రీధర్ వంక చూశాడు. అతను కుర్చీ లోంచి లేవబోతున్నాడు.

'చూడండి! ఈ శకుంతలకు నేను ఏమన్యాయం చేశాను? మీరు చెప్పండి...భర్తను మెప్పించలేక ఆయన తనమీద ప్రేమగా వుండటంలేదని వాపోతోంది. అసలు ఈఆడవాళ్లు...' శ్రీధర్ వాలకం చూసి చప్పున తగ్గాడు.

శ్రీధర్ అమృతవల్లివైపుకు తీక్ష్ణంగా చూశాడు. ఆమెకు చెడ్డ గాభరా వేసింది. ఆమెకూడా కళ్లార్పకుండా అట్లాగే చూస్తోంది. చంద్రం అప్రయత్నంగా ఆమె మొహంలోకి చూశాడు.

ఆహా! ఏమందం! స్త్రీమూర్తంటే ఇలాగే వుండాలి. ఆజానుబాహులరాలు. పొడవైన వేళ్లు చిన్న మొహం. తీక్షమైన కళ్ళు. పల్చటి పెదిమలు. కనుబొమ్మలు రెంటినికలిపే గుండ్రటి తిలకం. ఎత్తరి విగ్రహం. సన్నటినడుము. నిజంగా నేను సృష్టించదలుచుకున్న స్త్రీమూర్తి నాకు సాక్షాత్కరించింది - అనుకున్నాడు. హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

శ్రీధర్ అదోరకంగా చంద్రంవంక చూశాడు. ఇద్దరూకూడా ఎవరి మనస్సుల్లో వాళ్ళు అసంతృప్తి పడ్డారు.

ఒకటిరెండు రోజులు ఇద్దరూకూడా ముభావంగానే వుండిపోయారు. అమృతవల్లిమాత్రం ఏమిటా కారణం అని ఆలోచించటం మొదలుపెట్టింది. భర్తను అడుగుదామని తటపటాయిస్తుంది; మళ్లీ ఏమనుకుంటాడో అని వెనక్కు జంకుతుంది.

ఓనాడు సాయంత్రం చంద్రం తన గదివైపుకు వెళుతూవుండగా శ్రీధర్ ఎదురుగావెళ్లి 'మీ ఆడవాళ్లు ఎప్పుడు వస్తారు?' అని అడిగాడు హఠాత్తుగా.

చంద్రం నివ్వెరబోయి నిలబడిపోయాడు. క్షణంలో నవ్వుతెచ్చుకున్నాడు.

'అసలు నేనే ఆవిషయము చెపుదామనుకున్నాను. నాభార్య అంత ఆరోగ్యవంతురాలు కాదు...అయితే ఏం నాదగ్గర వుండక ఇంకెక్కడ వుంటుంది? అందుకనే కొంత ఓపికరాగానే వెంటనే బయలుదేరి రమ్మని రాసేశాను. అయినా నేను ఒక్కణ్ని వున్నా కుటుంబంతో వున్నట్టే లెక్క. మీరు ఏమాత్రం సందేహ

పడక్కర్లేదు. నేనుమాత్రం ఎన్నాళ్లని హోటల్లోపడి తినగలను. నాశరీరంకూడా అంత దృఢమైనదేం కాదు...మీకు ఏవిధంగానూ కూడా ఇబ్బంది కలుగ చెయ్యనని హామీ యిస్తున్నాను...' చంద్రం ఇంక తనను సమర్థించుకోవటంలో పడిపోయాడు.

'అందుకు కాదు నేనన్నది...' శ్రీధర్ తాను అడిగిన ప్రశ్నకు అర్థం చెప్పబోతున్నాడు.

'ఏమైనాకాని నేనుమాత్రం మా ఆడవాళ్లని తెచ్చి తీరతాను...' చంద్రం నిశ్చయంగా చెప్పేశాడు.

లోపలికిపోయి తాపీగా కూర్చున్నాడు చంద్రం. బుర్రనిండా ఎప్పుడూ ఏవో ఆలోచనలే. క్షణం ఊరికే కూర్చోడు. ఎవర్నో ఒకర్ని గురించి, ఏదో ఒక విషయాన్ని గురించి మనస్సులో చర్చ జరుగుతూ వుండాల్సిందే! అందులో ఈ ఊరు వచ్చినప్పటినుంచి అతని మనస్సు ఎలాగో ఉంది. ఆలోచనలు ఎదురెదురుగా వచ్చి ఒకదాన్ని ఒకటి ఛేదిస్తున్నాయి. నిలకడగా ఆలోచించటం కుదరటంలేదు. తనకున్న సమస్యతో పాటు ఇంకో క్రొత్తరకపు సమస్య ఎదురయి కూర్చుంది. తాను వచ్చినప్పటినుంచి ఓకంట కనిపెడుతూనే వున్నాడు. ఏదో తెలియని మనఃస్పర్థ శ్రీధర్ కు అమృతవల్లికి మధ్య కనిపిస్తూనేవుంది. కారణం ఇదమిత్థమని ఊహించలేకపోతున్నాడు. ఒకటిమాత్రం నిశ్చయం. భార్యాభర్తలమధ్య పొరపులు ఉన్నాయి. వాళ్ళ సంసారజీవితం సాఫీగా సాగిపోవటంలేదని మాత్రం గట్టిగా తెలుసు.

పాపం అమృతవల్లి పూర్తి అమాయకురాలు. భర్త ప్రేమకోసం నిత్యం నిరీక్షిస్తూ వుంటుంది. కాని శ్రీధర్ ఆమె విషయము పట్టించుకోనట్టే ప్రవర్తిస్తూ వుంటాడు. అప్పుడప్పుడు భార్యాభర్తల మధ్య ఘర్షణ చంద్రానికీ వినిపిస్తూనే వుంటుంది. హఠాత్తుగా ఒక గంభీరమైన ఐడియా తట్టింది. కాగితం కలం పట్టుకున్నాడు. బరబర వ్రాసేశాడు.

శ్రీధర్ కూడా కొంచెంగా బాధపడ్డాడు. అంత ఇదిగా చంద్రాన్ని ఎందుకు అడిగానా అని. గదిలోంచి బైటకు వస్తాడేమో, ఏమైనా మాట్లాడదామన్నట్లు కాపలాగా కూర్చున్నాడు. ఎంతసేపటికి చంద్రం బయటకు రానేలేదు. శ్రీధరే తలుపుతట్టాడు. చంద్రం తలుపు తీశాడు.

'ఇవ్వాళ మీరు భోజనం...' అంటూ శ్రీధర్ మాట్లాడటం ప్రారంభించాడు.

'ఇవ్వాళ శుక్రవారం...' అన్నాడు చంద్రం హఠాత్తుగా. శ్రీధర్ మూగవాడయి నిలబడిపోయాడు.

'మీ రేదో రాసుకుంటున్నట్టున్నారు...' క్షణం ఆగి మళ్ళీ శ్రీధర్ అన్నాడు.

'అవునవును...కొత్తనవల ఒకటి ప్రారంభించాను లెండి!...'

'మిమ్మల్ని అనవసరంగా డిస్టర్బు చేశానను కుంటా?...'

'అబ్బే! అలాంటిదేమి లేదు...ఎంత మందితోనైనా మాట్లాడుతూ వుంటా. ఎన్ని విషయాలైనా వింటూనే వుంటా. అయితే నాధోరణి నాదే..లేకపోతే మాబోటి రచయితలకు మహాకష్టం. ఒక్క లైనుకూడా రాయలేము చూడండి......అందాక ఎందుకు నేను క్రిందటిసారి నవల రాసినప్పుడు, పిల్లలు ఒకటే రణగొణధ్వని. చుట్టుప్రక్కలవా రందరూ వచ్చేసి నాసహనాన్ని పరీక్షించేశారు. ప్రక్కింటివాళ్లింట్లో ఒక రోగిష్టివా డుండేవాడు.ఆయనబాధ చెప్పటానికి వీల్లేదు. పైపెచ్చు మాయింటికి వచ్చిన చుట్టాలు ఒకటే గోల. ఆమాటలకు అంతూ పొంతూ వుండదు. మాది వీధిమీద ఇల్లేను. ఇంకా ఆజాతర చెప్పటానికి వీల్లేదు. ఇన్నింటి మధ్య కూర్చుని నవల పూర్తిచేశాను. అయితే ఆ వాతావరణం గురించే రాశాను లెండి...'

'తలుపేసుకోండి... నే వస్తా'...శ్రీధర్ వెనక్కు తిరిగాడు. చంద్రం మళ్లీ కాగితాలముందు కూర్చున్నాడు. రాత్రి ఎంత ప్రొద్దుపోయిందో తెలియనే లేదు. తెల తెలవారుతుండగా పడుకున్నట్టున్నాడు. తొమ్మిదయినా తలుపులు తెరవలేదు. ఒకటి రెండు సార్లు శ్రీధర్ గదిదగ్గరకు వచ్చికూడా వస్తాయించి వూరుకున్నాడు.

చంద్రం బద్ధకంగా నిద్రలేచి, ఆవలించి, ఒళ్లు విరుచుకుని, నానా హంగామా చేశాడు. నిమిషాలమీద డ్రస్సు వేసుకుని చకచకా వాకిట్లోకి వెళ్లిపోయాడు. మళ్లీ రెండు మూడు రోజులదాక చంద్రం, శ్రీధర్ తరుచు కలుసుకోవటం కూడా జరగలేదు.

కుటుంబంతో వుంటానని చెప్పి, ఒంటరిగానే వుంటున్నాడే అని మథనపడుతున్నాడు శ్రీధర్.

అడుగుతే ఏవో కారణాలు చెప్తాడన్నమాటే గాని అసలు విషయం చెప్పనే చెప్పడు. ఈయన ప్రకృతి అంతా అదో తమాషాగా వుంది. ఈయన

ఎలాంటి రకమో కూడా తెలియటంలేదు. లేనిపోయింది తెచ్చి పెట్టుకున్నాను. ఇవాళ్ళ వెళ్ళిపొమ్మంటే బాగుంటుందా! బాగుండటంమాట తర్వాత సంగతి. అసలు వెడతాడా అని. క్షణంపాటు తనదృష్టి అమృతవల్లి మీదకు మళ్ళింది. ఆమెనుగురించి రకరకాలుగా ఆలోచించుకుంటున్నాడు. క్షణంలో పెద్ద పెట్టున కోపం తామసం వచ్చి ఆవహించేస్తున్నాయి. మరు క్షణంలో మామూలుమనిషయి కూర్చుంటున్నాడు. మొత్తంమీద శ్రీధర్ మనస్సులో తీవ్రమైన కలవరం బయలుదేరింది.

ఆ తీవ్రతతోనే లోపలికి వెళ్ళాడు. కళ్లు పెద్దవి చేసి భార్య మొహంలోకి చూశాడు.

'నిన్న సాయంత్రం చంద్రం గారు ఏమిటి నీతో మాట్లాడుతోంది!' అన్నాడు శ్రీధర్.

'నాతోనా!...నాతో ఏం మాట్లాడాడు?...'

'లేకపోతే నాతోనా మాట్లాడింది!...' హుంకరించాడు.

'నాకేమి అర్థం కావటంలేదు...నాకేం తెలీదు. నేను ఆయనతో అసలు మాట్లాడెం జే!...'

'ఊ!... నేను కళ్లారా చూసినా కూడా...'

'ఏం చూశారు...'

'మనగది గుమ్మందగర నిలబడి...'

'అదా! ఎప్పుడూ ఆయన అంతే! ఏదో తనలో తాను అనుకుంటూనే వుంటాడు. కథ రాశాడుట. అది బిగ్గరగా చదువుకుంటున్నాడు. నాతో ఎక్కడ మాట్లాడాడు...'

ఇంతలోనే చంద్రం గదితలుపులు తెరిచి బైటకు వచ్చేశాడు.

'సమయానికి మీరు ఇక్కడే వున్నారు... ఎప్పుడు అవకాశం దొరుకుతుందా అని కాచుకు కూర్చున్నాను...' కాగితాలు తీశాడు.

'ఇది ప్రేమికుల మనస్తత్వాన్ని నిశితంగా, సూక్ష్మంగా చిత్రించిన కథ. వింత ప్రకృతులున్న నలివిలయి, ఒకర్నొకరు అర్థం చేసుకోలేక, వృథాగా తమ తమ యౌవనాన్ని కాలానికి బలిచేసి, తీరిగ్గా పశ్చాత్తాప పడ్డ ఇద్దరి గాథ.

'ఒకరిలో లేని గుణాన్ని మరొకరు పూరించి, ఇద్దరూ కలిసి ఒకే పూర్ణవ్యక్తిగా మెలగాలి. ఇదే భార్యాభర్తల అనుబంధం, అనురాగం. భార్యాభర్తలు ఒకర్నొకరు ఆకర్షిస్తూ వుండాలి. ప్రతి వ్యక్తికి హృదయం వుంటుంది. మనస్సుంటుంది. ఆమె మనస్సు ఆరాటపడుతూ వుంటుంది. ఆయన హృదయం పరితపిస్తూ వుంటుంది. ఆమె ఆరాటానికి అతను సమాధానం చెప్పాలి. ఆయన పరితాపానికి ఆమె ఉపశాంతిగా ఉండాలి...' చదువుత చంద్రం ఆపేశాడు.

'ఏమిటండీ అట్లా చూస్తున్నారు నావంక...' శ్రీధర్ మొహంలోకి నిశ్చేష్టుడయి చూశాడు.

'అబ్బే! ఏంలేదు!...' అంటూ దభాలున ఉలిక్కిపడ్డాడు శ్రీధర్.

చంద్రం మాటలు వింటుంటే, శ్రీధర్ మనస్సు అదోలాగువ అయిపోయింది. ఎక్కడికో పోయి ఏదో ఆలోచిస్తోంది. చంద్రం పలకరించేటప్పటికి మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చిపడ్డాడు శ్రీధర్.

లోపల్నుంచి ఆతుర్దాగా వింటున్న అమృతవల్లికి హృదయభారం తగ్గిన ట్లనిపించింది. తనకు తెలియని ఆనందం తనను చుట్టుముట్టేసింది. ఆమె కళ్ళనుంచి జలజల నీళ్లు క్రిందపడ్డాయి. అప్రయత్నంగా కళ్ళు తుడుచుకుంటూ ఆవేశంగా ఆలోచిస్తోంది.

శ్రీధర్ తల గిర్రున తిరిగిపోతోంది. చంద్రం ఇంకా ఏమంటాడో అని ఆతుర్దాగా ఎదురుచూస్తున్నాడు.

'మీరు ఏమిటో గా వున్నారు. మిమ్మల్ని బాధపెట్టదలుచలేదు. ఇంకోనాడు చదువుతాను లెండి...' అంటూ చంద్రం లేచాడు.

'అబ్బే! ఏం లేదులెండి!...' అంటూ మాటవరసకు శ్రీధర్ అన్నాడు. చంద్రానికిమాత్రం మనస్సు ఒప్పలేదు. వెళ్లిపోయాడు.

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేదాక శ్రీధర్ ఇంటికి రానేలేదు. అమృతవల్లి అంట్లో ఒక్కత్తి కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమెలో ఏదో చెప్పలేని బాధ ఏర్పడింది. దుఃఖము పొంగుకొస్తోంది. ఏంచెయ్యాలో అర్థంకావటం లేదు. ఉద్వేగం హెచ్చిపోతోంది.

చంద్రం అయితే ఓమూల వ్రాసుకుంటూ కూర్చున్నా, పక్క గదిలో అమృతవల్లి ఏంచేస్తోందో అనే ఆలోచనమాత్రం వెనువెంటనే వుంది. ఒక చెవి, ఒక కన్ను అటు అప్పచెప్పే వుంచాడు, తెగమథన పడు

తున్నాడు. ఇలాంటి పరిస్థితుల్లో తన కర్తవ్యం ఏమిటో అని బోధపడక తీవ్రంగా కలవరపడిపోతున్నాడు.

శ్రీధర్ మెల్లిగా, బరువుగా వచ్చి వచ్చి గుమ్మం దగ్గర నిలబడ్డాడు. లోపల అమృతవల్లి ఏం చేస్తోందో చూడాలని చాలా ఉబలాట పడుతున్నాడు. కొంచెం కొంచెంగా నిట్టూర్పు వినిపిస్తోంది. శ్రీధర్ హృదయం కదిలిపోయింది. గజగజ క్షణంపాటు వణికిపోతాడు. తత్తరపడిపోయాడు.

'తలుపు' అంటూ మెల్లిగా తట్టాడు.

చప్పున కళ్లుతుడుచుకుని గద్గదకంఠాన్ని కప్పి పుచ్చటానికి ప్రయత్నం చేస్తూ వచ్చి తలుపుతీసింది వల్లి. ఎదురుగా భర్త నిలబడివున్నాడు.

'ఇంత ఆలస్యమయిందే...' అంటూనే పెదిమ కరుచుకుని దుఃఖము ఆపుకోలేక గిర్రున వెనక్కు తిరిగింది. శ్రీధర్ నోట మాటలేదు. వెనకాలే నడిచాడు. యాంత్రికంగా లోపలికి వెళ్ళి మంచంమీద ఒరిగాడు. అమృతవల్లి కూడా మెల్లిగా మంచం దగ్గరకు వచ్చి నిలబడింది.

శ్రీధర్ కు ఆవేశం హెచ్చిపోతోంది. అయితే అభిమానం అడ్డం వస్తోంది. ఈ రెంటిమధ్య సతమతమయిపోతున్నాడు. లోపల లోపల వల్లీ వల్లీ అనుకుంటున్నాడు. ఏవో చెప్పాలని తాపత్రయపడుతున్నాడే కాని, మాటలు పెగిలి పైకిరావటం లేదు. అస్పష్టంగా ఏవో మాటలు అంటున్నాడు. వల్లి పెదిములుకూడా తడబడుతున్నాయి. ఇక శ్రీధర్ నిబ్బరంగా వుండలేక పోయాడు. అమాంతం మంచమీదనుంచి లేచాడు.

'వల్లీ !...' అంటూ గట్టిగా అమృతవల్లిని కౌగలించుకున్నాడు. ఆమె భర్త బాహుబంధాల్లో కరిగిపోయింది.

చంద్రానికి అస్పష్టంగా కొంచెం తెలిసింది. వల్లి అనేమాట చెవుల్లో గింగురుమంది. అనుకోకుండా చంద్రం తడబడ్డాడు. ఏదో తెలియని ఆనందం అతన్ని ఆవహించింది. కళ్లు క్షణంలో చెమ్మగిలినాయి. ఆపుకోలేనంత ఆవేశంవచ్చి ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. ఏవో రకరకాల ఆలోచనలు వచ్చేసి అతన్ని విపరీతంగా కలవరపెట్టేశాయి. వ్రాస్తున్న కాగితాలన్నీ తీసేసి కట్టకట్టేశాడు. గబగబ బెడ్డింగు చుట్టేశాడు. డ్రెస్సు వేసుకున్నాడు. ఒకసారిమాత్రం అమృతవల్లిని శ్రీధర్ ను చూడాలని, అతని కళ్ళు తహతహలాడినాయి. కాని స్పష్టంగా కనబడలేదు. దూరాన్నుంచి అస్పష్టంగా చంద్రానికి కనిపించారు. వాళ్ళిద్దరు ఒక టయ్యారు అని పెద్ద నిట్టూర్పు విడిచాడు.

భళ్లున తెల్లవారింది.

శ్రీధర్ కు ఎందుకనో వెంటనే చంద్రాన్ని చూడాలనిపించింది. చంద్రానికి తాను ఎంతో ఋణపడి వున్నానని అనుకున్నాడు. ఎట్లాగైనా తన కృతజ్ఞతలు చెప్పుకోవాలని తహతహ లాడిపోయాడు. అమృతవల్లి లోపల కోర్కెను దాచుకోలేకపోయింది. ఆవేశాన్ని ఆవేదనను పైకి చెప్పుకోలేక పోయింది.

'ఏమండీ! చంద్రంగారికి కూడా కాఫీయిస్తాను" అంటూ తెగ ఆయాసపడిపోయింది.

'అవును ఆసుకురా!' అన్నాడు చప్పున శ్రీధర్.

ఇద్దరు ఇద్దరు చంద్రం గదిముందు నిలబడ్డారు. గది తలుపులు బార్లగా తీసివున్నాయి. అక్కడ ఒక కాగితం పడివుంది.

శ్రీధర్ చప్పున కాగితం తీసి చూసుకున్నాడు.

'మా ఆడవాళ్ళు ఇప్పట్లో వచ్చేటట్టు లేరు. నేను ఇక్కడ ఒంటరిగా వుండి మిమ్మల్ని బాధపెట్టటం నాకేమాత్రం ఇష్టంలేదు. మీరుచూపిన ఆదరాభిమానాలకు సర్వదా కృతజ్ఞుణ్ణి. ఆదర్శదంపతులైన మీకు నా శుభాకాంక్షలు.'

చంద్రం.

# నత్కీరుని కథ - కొన్ని విశేషములు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ధూర్జటి మహాకవి రచించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యమున నత్కీరునికథ మూడవ యాశ్వాసమునం దున్నది. కాళహస్తి మాహాత్మ్యమునకు మూలము స్థలపురాణముల కెల్లను మూలకందమగు స్కాందపురాణములోని షడధ్యాయికథ. ధూర్జటికవి ప్రపౌత్రుఁ డగు ధూర్జటి లింగరాజకవి తన కాళహస్తిమాహాత్మ్య ప్రబంధమునం దీ విషయము నిట్లు పేర్కొనుచున్నాఁడు.

క॥ విను కాళహస్తి మహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికథన్
దెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను బెదధూర్జటి కవీంద్రశేఖరుఁ డనఘా!

స్కాందపురాణమునందలి వైష్ణవఖండమున వేంకటాచలమాహాత్మ్య మనుభాగ మున్నది. దానియందు ముప్పదవ యధ్యాయము మొదలు ముప్పదియైదవ యధ్యాయమువఱకు కాళహస్తి మాహాత్మ్యకథయు, సువర్ణముఖరీనది యుత్పత్తి కథయు నున్నవి. ఈ భాగ మాఱధ్యాయములుగా నుండుటచే లింగరాజకవి చెప్పిన షడధ్యాయికథ యిదియే. అందలి కథను మూలాధారము చేసికొని యింకను మఱికొన్ని కథలను జేర్చి ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యప్రబంధమును రచించెను. శ్రీకృష్ణదేవరాయలు తన యాముక్తమాల్యదలో వైష్ణవ మహత్త్వ నిర్ధారకొఱకై కథకు నిజముగా సంబంధము లేకపోయినను యామునాచార్యుల వృత్తాంతమును ప్రత్యేకముగాఁ జేర్చినట్లు ధూర్జటికవి నత్కీరుని యుదంతము మూలకథయందు లేకపోయినను శైవమహిమను ప్రకటించుటకు ప్రత్యేకముగా జేర్చినాఁడు. నత్కీరుఁడు తమిళకవి తల్లజుఁడు. సంఘకాలపుఁ గవులలో కడ సంగమునకు జెందినవాఁడు. మహాశివభక్తుఁడు. ఈ మహాభక్తుని యుదంతము తమిళమున తిరువిళైయాడల్ పురాణము (శివలీలా పురాణము), శ్రీ కాళహస్తి మాహాత్మ్యము అను గ్రంథములందు గలదు. ధూర్జటి ఈ మహాకవి చరిత్రమును రచించు సందర్భమున దెలిపిన యంశములు కొన్ని మనకు బరిచితములు కాకుండుటచే సరిగా నర్థమగుట లేదు. ఆ యీ విషయములను వివరించుటయే యిందు నా యుద్దేశము.

## 1. నత్కీరుడు

తమిళములో నీ మహాకవి పేరు 'నక్కీరుడు'. ఇది యాతని బిరుదనామము. నల్=మంచి, కీరర్=రచయిత, కవి. నక్కీరుఁ డనగా సత్కవియని యర్థము. తమిళ సాహిత్య చరిత్రము నాంగ్లములో రచించిన శ్రీ పూర్ణలింగంపిళ్ళె నక్కీరుడనగా 'The celebrated poet' అని యరము వ్రాసియున్నారు. తమిళములో నిట్లు 'నక్కీరు'డనియున్న కవినామమును ధూర్జటి నత్కీరుఁడని పేర్కొనెను. ఈ పద్యమున 'నత్కీరు' డనియే ప్రాసస్థానమునం దుండుట యిందులకు ప్రమాణము.

"నత్కీరాది కవీంద్రులన్ దివిషద
న్నప్రాయ వాగ్గుంభ సం
పత్కావ్య ప్రతిపాదక ప్రతిభులం
బన్నిద్దఱన్ శైవసం
విత్కాసారమరాళ రత్నములఁ ద
ద్విద్యారసాపేక్ష భూ
భృత్కాంతీరవుఁ డుంచె సంపదలఁ దృ
ప్తిం బొందగాఁ జేయుచున్."

కాని తమిళములో 'నక్కీరు' డనియే యితని వ్యవహారము.

## 2. ఆలవాయి

నత్కీరుని కథలో మధురాపురవర్ణన సందర్భమున నిట్లు కలదు.

"కపట చతుష్షష్టిగతుల నాడిన వాల
వాయి చొక్కేశు నివాసభూమి"

మధురకు దమిళమున 'ఆలవాయి' యని నామాంతరము. కాని పద్యమునందు 'వాలవాయి' యని కలదు. ధూర్జటి యట్లు పొరబడుట కవకాశము లేకపోలేదు. తమిళములో మధురను బేర్కొనునపుడు పూజ్యతార్థకమయిన 'తిరు'పదముతో జేర్చి 'తిరువాలవాయి'

అంగురు. తిరు+ఆలవాయి అనుపదములు కలిసినపుడు సంధివశమున వడాగమము వచ్చి 'తిరువాలవాయి' యని యగును. ధూర్జటి యారూపమును 'వాలవాయి' గానే గ్రహించెను. మధురానగరమునకు 'ఆలవాయి' యను పేరు కలుగుటకు గలకారణము తిరువిళయాడల్ పురాణములో నిట్లు వివరింపబడి యున్నది.

"సుగుణపాండ్యుడు దివంగతు డయినపిదప చిత్రరథుడు, చిత్రభూషణుడు, చిత్రధ్వజుడు, చిత్రవర్ముడు, చిత్రసేనుడు, చిత్రవిక్రముడు, రాజమార్తాండుడు, రాజచూడామణి, రాజశార్దూలుడు, ద్విజరాజకులోత్తముడు, అయోధనప్రవీణుడు, రాజకుంజరుడు, పరరాజభయంకరుడు, ఉగ్రసేనుడు, శత్రుంజయుడు, భీమరథుడు, భీమపరాక్రముడు, ప్రతాపమార్తాండుడు, విక్రమకంచుకుడు, యుద్ధకోలాహలుడు, అతులవిక్రముడు, అతులకీర్తియను ఇరువది యిద్దఱు పాండ్యులు వంశపారంపర్యముగా రాజులై రాజ్యమును బరిపాలించిరి. అతులకీర్తిపాండ్యునికి బిమ్మట నతని కుమారుడైన కీర్తివిభూషణుడు రాజ్యపరిపాలనము చేయుచుండిన కాలములో నొకగొప్ప ప్రళయము సంభవించెను. అప్పుడు సప్తసముద్రములును మహాపొంగి నెల్లవలై పాతివిశ్వమునంతను ముంచెత్తెను. సోమసుందరదేవుని విమానమును, మీనాక్షీదేవి దేవాలయమును, ఋషభపర్వతమును, గజపర్వతమును, నాగపర్వతమును, పశుపర్వతమును, వరాహపర్వతమును మాత్రము నశింపక యుండెను. నెల్లువ తీసినవెనుక పరమేశ్వరుడు ప్రపంచమును దొంటివలె సృజించి చంద్ర, సూర్యాగ్నులను మువ్వురియొక్క వంశములనుండి తమిళభూపతులు మువ్వురిని సృష్టించెను.

"అప్పుడు చంద్రవంశమునందు బుట్టిన వంశశేఖరపాండ్యుడు సోమసుందరదేవుని దేవాలయము చుట్టును నొకచిన్నినగరమును నిర్మించి యందులో నివసించుచు రాజ్యపాలనము చేయుచుండెను. అతడు నీతిని దప్పకుండ రాజ్యపాలనము చేయుటచే దేశములో క్షామబాధ లేకుండెను. అతని రాజ్యమంతయు సుభిక్షముగా నుండెను. జనసంఖ్య దినదినాభివృద్ధి గాంచదొడగెను. ఆ జనులెల్లరును నివసించుటకు స్థలము చాలకుండుటచే పాండ్యుడు దేవాలయమునకుబోయి సోమసుందర దేవునికి నమస్కరించి 'దేవా! తమరీ జను లందఱును నివసించుటకు వీలుగా నొకనగరమును నిర్మింపవలెను. ఈ నగరమునకు బూర్వ ముండిన యెల్ల లేవో నాకు దెలియవు. నేను వానిని నాకు దెలుపుడు' అని ప్రార్థించెను. అప్పుడు పరమేశ్వరుడు మొలత్రాడు, కౌపీనము, యజ్ఞోపవీతము, కుండలములు, పాదకింకిణులు, కరకంకణములు అనునవి యెల్ల బాములుగానే యున్న యొకసిద్ధపురుషుడై విమానమునుండి లేచివచ్చి మహామండపమునకు బ్రక్కనిలచి తనహస్తమునందు గంకణముగా నున్ననాగమును జూచి 'నీవితనికీ నగరపుటెల్లలను గుర్తించి చూపుము' అని యాజ్ఞాపించెను. అంత నానాగ మాతనికి నమస్కరించి 'దేవా, యీ నగరము నా పేరుతో బ్రసిద్ధిచెందునటుల ననుగ్రహింపుము.' అని ప్రార్థించెను. పరమేశ్వరుడును 'అట్లే యగుగాక' యని యా పాము ననుగ్రహించెను. ఆ నాగము వేగముగా దక్షిణపు దిక్కుగాబోయి తనవాలమును నిగిడ్చి నగరమును బ్రదక్షిణము చేయునట్లు శరీరమును బెంచి తనవాలమును నోటనుంచి పాండ్యుని కెల్లలను జూపి తిరిగిపోయి సిద్ధపురుషుని హస్తమున గంకణమయ్యెను. సిద్ధుడును దనదేవాలయములోని కంతర్ధానము చెందెను.

"పాండ్యుడును నానాగము కొలిచినట్లే ప్రాకారములు లేవనెత్తి దక్షిణద్వారమునకు తిరుపురంకుంద్రము, ఉత్తరద్వారమునకు ఋషభపర్వతము, పశ్చిమద్వారమునకు తిరువేంగడము, తూర్పుద్వారమునకు తిరుప్పూవణ్ణమును నెల్లలుగా నియమించెను. ఆ ప్రాకారము ఆలవాయి ప్రాకారమనియు, ఆ నగరము ఆలవాయి నగరమనియు బేరుపొందెను. పాండ్యుడు ఆ నగరమును, మండపము, గోపురము మొదలగు వానిని నూతనముగా నిర్మించి సోమసుందర దేవునికి రత్నకిరీటమును, రత్నాభరణములను జేసి సమర్పించెను. ఆ ఆలవాయి నగరములో బలువిధములయిన కుటుంబములను నిలిపి పెక్కుసంవత్సరములు రాజ్యపాలనము చేసెను."

ఇట్లా నాగము కోరిన మేరకు మధురానగరమునకు 'ఆలవాయి' అని పేరయ్యెను. 'ఆలవాయి' అనగా పాముని యర్థము. ఆలం=విషము, వాయి=నోటి యందు గలది అని వ్యుత్పత్తి. ధూర్జటి దీనినే 'వాలవాయి' అని పేర్కొనెను. యతిప్రాసస్థలముల లేకుండుటచే 'ఆలవాయి' యని దాని సవరించుకొని పఠింపదగును. తోకను నోటితో గరచుకొన్నదను కథను సూచించుటకు 'వాలవాయి' అని గ్రహించెనేమో తెలియదు.

## 3. పాండ్యభూపాలు నల్లుఁడు

మధురాపురమునందలి చొక్కనాథస్వామి పాండ్యభూపాలుని యల్లుఁడుగా నీ క్రిందిపద్యముల యందు పేర్కొనబడి యున్నాడు.

"ఏ పురంబున బెంపొందు నిందుధరుడు
పాండ్య భూపాలునల్లుడై ప్రజలకెల్ల
నుల్లములలోన నుల్లాస మల్ల సిల్ల
నట్టిమధురకు సరియె యేపట్టణంబు"
"లోకమాతృక పాండ్యధాత్రీ కళత్ర
పుత్రికామణి యువతి సంపూర్ణ చంద్ర
వదన రక్షింప సంపదం బొదలు మధుర
కితర పురములు సరిసేయ నెట్లు వచ్చు"
"అళఘుయ చొక్కనాథ శివు
డల్లుడు మూర్తి హీను ప్రభాసము
జ్జ్వల ఘనకీర్తి ధైర్యమును
శౌర్యము భూభరణ ప్రభావముం
దలప నశక్యమై నెలయ
దత్పురి పాండ్యనృపాలు డేలు ని
చ్చలు మిహికామహీధరము
చందమునం గులగోత్రపాత్రుడై"

పరమేశ్వరుడు పాండ్యభూపాలుని కల్లుడయిన యైతిహ్య మిట్లు చెప్పబడుచున్నది.

పూర్వము మలయధ్వజపాండ్యుడను నొకరాజు మధురానగరమును బరిపాలించుచుండెను. అతని భార్య పేరు కాంచనమాల. వారి కిరువురికిని జాలకాలము వఱకును సంతానము లేకుండెను. అంత నా పాండ్యుడు సంతానముకొఱకై పుత్రకామేష్టి యాగమును జేసెను. కొన్ని నాళ్ళకు కాంచనమాల గర్భవతియై యొక స్త్రీ శిశువును బ్రసవించెను. ఆ శిశువు మూడుకుచములను గలిగియుండెను. అది చూచి యెల్లరును నాశ్చర్యమందుచుండగా వారికొక యశరీరవాక్కు వినవచ్చెను. 'ఓ రాజా! పార్వతీదేవియే యిప్పుడు నీకోరిక చొప్పున నీకు కుమార్తెగా మూడుకుచములతో జన్మించినది. ఆమె తన భర్తను జూచినపు డామధ్య కుచ మడగి పోవును. విచార మందకుము.' తరువాత నా శిశువు పెద్ద పెరిగి రాజ్యమునకు వారసురాలై రాజ్యమును బరిపాలించెను. ఆమె భూలోకముననున్న రాజుల నెల్లరను జయించి శివుని జయించుటకై కైలాసమునకు బోయెను. అపుడు శివుడామెతో బోరాడుటకు దన నందిని బంపెను. నంది యామెతో యుద్ధము చేయ జాలక యోడిపోయెను. అంత శివుడే యామెతో బోరాడుట కరుదెంచెను. అతనిని జూడగనే యామె మధ్యకుచ మడగి పోయెను. ఆమెయు నతనితో బోరాడ జాలకపోయెను. శివు డామెను మధురలో బెండ్లాడుద ననెను. అతడట్లే మధురకు వచ్చి యామెను బెండ్లాడి మలయధ్వజపాండ్యుని కల్లు డయ్యెను. ఆమెయే 'తిరుత్తడాదగై పిరాట్టియార్'. 'తఱుగు లేని సౌందర్యము కలదేవి' యని దాని కర్థము.

## 4. అంగయ కన్యాంబ

మధురాపురమునందలి మీనాక్షీదేవిని ధూర్జటి అంగయకన్యాంబ యనియు, అంగయకన్య యనియు నీ క్రింది పద్యములందు పేర్కొనెను.

"గంగాధరుని మహోగ్రా
పాంగము రతి విధవజేసె నాలోపల మా
యంగయకన్యాంబ కృపా
పాంగం బంగజుని దేవి నైదువ జేసెన్.
మాణిక్య వల్లియు మరకత వల్లియు
నానంద వల్లియు నమృతవల్లి
కర్పూరవల్లియు గల్పక వల్లియు
నంగయకన్య యనంగ నాది
యైన నామంబుల.........
తన పేళ్లం దన సేవయు
దనదు ప్రసాదంబు నొసగి దయ నంగయక
న్య నగజ పెంపగ బురి మను
వనితల వైభవము బొగడ వశమే వసుధన్."

ఈ పద్యములందు "అంగయకన్య" మీనాక్షికి బర్యాయ నామముగా ధూర్జటిచే ప్రయోగింపబడినది. కాని 'అంగయకన్య' యనునది సాధురూపము కాదు. తమిళములో మీనాక్షీదేవికి 'అంగయక్కణ్ణి' అని పేరు. అం=అందము, కయల్=చేప, కణ్=కన్ను. అందమైన చేపలవంటి కన్నులు కలది యనునర్థముతో 'మీనాక్షి' యను సంస్కృతపదమునకు బర్యాయముగా 'అంగయక్కణ్ణి' అనుపదము తమిళములో వెలసినది. ధూర్జటి దానినే 'అంగయకన్య' యని పేర్కొనెను. దీనిచే మూలరూపమును, దాని యర్థమును స్ఫురింపక 'అంగయకు కన్య' యను నొక విపరీతార్థము స్ఫురించి దురవగాహ మగుచున్నది. అంగయక్కణ్ణి+అంబ—అంగయక్కణ్ణియంబ అని తమి

ళులు పలుకుచుండిన దేవి నామమును సంస్కృత పదముగా భ్రమించి 'అంగయకన్యాంబ' యని యూహించి యుండును.

## 5. పొత్తామర

మధురలో మీనాక్షీదేవాలయమున కెదుటనున్న సరోవరమునకు 'పొత్తామరకొళం' అని పేరు. ధూర్జటి దానిని ఈ పద్యపాదములం దిట్లు పేర్కొనినాడు.

"పొత్తామ రనియెడి నెత్తమ్మికొలని ప
శ్చిమ తటనికటకూలమున నుండి"

తమిళమున పొ౯ + తామరై = పొట్రామరై అని యగును. బంగార తామరపూవులు గలది యని యర్థము. 'పొట్రామరకొళం' అనుదానినే ధూర్జటి 'పొత్తామర' అని పేర్కొనెను. 'పొత్తామ రనియెడి నెత్తమ్మికొలని' యని ప్రాసయతితో బ్రయోగించి యుండుటచే నది మార్పరానిదిగా నున్నది. తెలుగున పొన్ను + తామర - పొందామర యనియగును. చెన్ను + తమ్మి - చెందమ్మివలె. అట్లు 'పొందామర' యని మార్చుచో ప్రాసయతికి భంగమేర్పడును. 'పొట్రామర' యని తమిళరూపమును గ్రహించినను నిదే చిక్కేర్పడును. 'పొట్రామర' నే ధూర్జటి 'పొత్తామర' యని జనవ్యవహారముననుసరించి బరిగ్రహించె ననుట యొక్కటే మనకిందు శరణ్యము.

## 6. శంఖఫలకము

"నత్కీరుని కథలో శంఖఫలక మనియు, శంఖపీఠియనియు నీ క్రింది పద్యములయందు పేర్కొనబడి యున్నది.

సృష్టింప దలపోసి యష్టాదశాక్షర
మాతృక వ్రాసి నిర్మలినశంఖ
ఫలకంబు గొనివచ్చి పాండ్యభూపతి కిచ్చి
విను మిది ద్రవిడ కవిత్వ సరణి.

"ద్రావిడ భాషాదేవి
నైవేయక మనగ గీర్తి గని తత్కవితా
శ్రీ విపుల శంఖఫలకము
పై వసియింపంగ దగు విభాసిత మతులన్.

"ఈ కవితాభిమానము వ
హించితి నేటికి శంఖపీఠిపై
నీకవు లున్నయట్లు వసి
యింపక దేవునితోడ నేల చా
ర్వాక మొనర్చితిన్......"

శ్రీ సురవరపు ప్రతాపరెడ్డిగారు తమ 'యాంధ్రుల సాంఘిక చరిత్ర'లో నీ శంఖఫలకమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"కవులు కూర్చొను స్థలమును శంఖపీఠి యనిరి. ఇది తమిళదేశాచారము. 'ఈ కవితాభిమానము వహించితి నేటికి శంఖపీఠిపై, నీకవు లున్నయట్లు వసియింపక దేవునితోడ నేల చార్వాక మొనర్చితిన్'— ఇచ్చట శంఖపీఠియన నేమో? శ. ర. లోను, శబ్దకల్పద్రుమములోను లేదు." "మధురాది తమిళప్రాంతాలలో పూర్వము సంగము (సంఘము) అనుకవుల పీఠము లుండెను. దానినే మనకవి శంఖము చేసెను."— రాళ్ళపల్లి.

అందే రెండవ యనుబంధములో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారీ విషయమునుగూర్చి వ్రాసిన వివరమిట్లు కలదు.

"శంఖఫలకము అరవములో 'చంగప్పలకై' అనుదాని పరివర్తనము. మధురలోని ప్రాచీన ద్రావిడ 'సంఘ' సంప్రదాయములకు చేరినది. అరవవ్రాత 'చంక' అని యుండును కదా! తెలుగులో అది సంస్కృత వాసనతో 'శంఖ' గా మారిందేమో! ఈ మార్పు ధూర్జటి కాలానికే వచ్చిందేమో! ధూర్జటే స్వతంత్రంగా చేసిన ప్రయోగాలో, అచ్చువేసినవారు అవివేచనగా చేసిన రూపాలో కాళహస్తి మాహాత్మ్యములో ఎన్నో యున్నవికదా!"

ఆంధ్రుల సాంఘిక చరిత్ర ప్రథమ ముద్రణములో దీనిగూర్చి యింకను నిట్లు కలదు. "కవులు కూర్చొను వేదికమీద దేవతావిగ్రహము, శంఖము పెట్టి పూజించినందున, వేదికపై శంఖముండినందునను శంఖపీఠియని దానికి పేరు వచ్చెనేమో!"

తమిళ సాహిత్య సంప్రదాయముతో బరిచయమున్నప్పుడు కాని యీ పదముయొక్క యర్థము పూర్తిగా బోధపడదు. తమిళములో దీనికి 'సంగప్పలకై' అని పేరు. ఇదే కాళహస్తి మాహాత్మ్యములో శంఖఫలకమనియు, శంఖపీఠియనియు పేర్కొనబడినది. తమిళసాహిత్యమునుండి నత్కీరునికథను బరిగ్రహించిన ధూర్జటి యందలి 'సంగప్పలకై' యనుపదము

యొక్క యర్థము, సంప్రదాయము పూర్తిగా నవగాహన కాకపోవుటచేతనో—సంగఫలకము అని పేర్కొనిన దెలుగువారి కర్థము కాదనియో దానిని 'శంఖఫలక'మని పేర్కొనినట్లు తోచుచున్నది. 'సంగ' పదమునకు బదు లందు 'శంఖ' పదముండుటయే శ్రీ ప్రతాపరెడ్డిగారు పైవిషయమున దానిని వివరించుట కవకాశ మొసగినది. ఈ శంఖఫలకము పుట్టినక్రమము కాళహస్తి మాహాత్మ్యములోనే యిట్లు తెలుపబడినది.

తొల్లి యగస్త్యుడు ద్రావిడశబ్దశాస్త్రమును, నిఘంటువును, ఛందోలంకారములను సృష్టింపదలచి యొకఫలకముపై నష్టాదశాక్షరములతో మాతృకవ్రాసి దానిని పాండ్యభూపతికడకు గొనివచ్చి యాతనితో నిట్లు పలికెను. 'రాజా! తమిళమున సరస్వతీదేవితో సమానముగా గవిత చెప్పగలవా రెందరైనను దీనిపై గూర్చుండవచ్చును. ఒక్కజేయయిన నాతని కొక్కనికి మాత్రమే వలసినంతచోటు నిది యిచ్చును. దీనిని గ్రహించి మీరు వంశపారంపర్యముగా నర్చించుచుండుడు'—అప్పటినుండి పాండ్యభూపతులు వంశపారంపర్యముగా దాని నర్చించుచుండిరి.

పాండ్యరాజుల రాజధానియగు మధురలో బూర్వము తమిళకవిసంఘములు వర్ధిల్లుచుండినట్లు ప్రతీతి. ఆ సంఘములకు జెందిన కవు లనేకులు తమిళమున గొప్పకావ్యములు రచించిరి. ఇట్టి కవీశ్వరులకు గూడలిస్థల మగుటచేతనే మధురకు 'కూడల్' అనుపేరు కూడ గలిగినది. ఈ పద్యములో మధురకు నామాంతరమయిన 'కూడల్' పేర్కొనబడి యున్నది.

"నిజదృగబ్జ ప్రపూజిత నీలకంఠ
కూడలళఘుయ వైకుంఠ కుంతితాఘు
నిఖిల సంపత్పరంపరానిహితకింప
చానతాపంబు మధురాభిదానపురము"

తమిళ వాఙ్మయమున నిట్టిసంఘములు మూడు వర్ధిల్లినట్లు చెప్పబడుచున్నది. తొలిసంఘము, మధ్యసంఘము, కడసంఘమునని వానిపేర్లు. సమకాలిక కవుల గ్రంథములలోని యోగ్యతలను జర్చించి విలువగట్టుట యీ సంఘములయొక్క పని. అప్పటి ప్రాస్తామగకాలములో సంగపలక యుండెడిదట. ఆయా గ్రంథముల యోగ్యత తెలుసుటకై యీ సంగకవులు వానిని 'సంగపలక'పై నుంచినపుడా గ్రంథము నీటిలో మునుగక నిలిచినచో సత్కావ్యమనియు, మునిగినచో నసత్కావ్య మనియు నిర్ణయించి తీర్పు చెప్పువారట! ఈ 'సంగపలక'నే ధూర్జటి 'శంఖఫలక'మని పేర్కొనెను.

## 7. సింధురరాజగమనాధమ్మిలబంధంబు

నత్కీరుని కథలో హరద్విజుని వృత్తాంత మిట్లు కలదు.

క॥ మానిసి మానిసి దినుకఱ
వైనం దరియింప లేక యాపురి మూల
స్థానహరద్విజు డొక డెం
దేనియు బో దలచిన న్మహేశుడు కరుణన్.

వ॥ అతనికి బ్రసన్నుడై యన్నగరం బేలు మన్నుకేనిమీద నఱవబాస బద్యంబు శృంగారరసానుబద్ధంబుగా నొకటి చెప్పి యిచ్చి యిది చదివిన మెచ్చి వేయి మాడల ముడుపిచ్చు నెచ్చంబున గొదవు నీవు నెవ్వగ న్నొవ్వక బ్రతుకం గలవాడవు. అంతట గఱువుందీరు. జగంబున గృతిహర్షం బగు వర్షంబు గురియం గలదు. సస్యంబులు పండు బండువు జనంబుల కవునని యనుపుటయు నతండుడు నారాజసమ్ముఖంబునకుం బోయి శ్రీపరమేశ్వర ప్రణీతంబైన కవితా చమత్కారంబు వచించిన నందలి యర్థంబు 'సింధురరాజగమనాధమ్మిల్లబంధంబు సహజగంధం' బని యుండుటంజేసి—"

తమిళ సాహిత్యములోని 'తిరువిళయాడల్ పురాణము'లో నీ హరద్విజుని వృత్తాంత మిట్లు కలదు.

"వంశచూడామణిపాండ్యుడు సోమసుందరదేవునికై యొకనందనవనమును వెలయించి యందొక చంపకవనమును బ్రత్యేకముగా నేర్పఱచెను. అందుబూచిన సంపెగ పూవులను గోసికొనిపోయి యతడనుదినమును సోమసుందర దేవునికి సమర్పించుచుండెను. అట్లు తాను సమర్పించిన 'చంపకమాల'ను ధరించిన సోమసుందర దేవునియొక్క దివ్యసుందరమూర్తిని దర్శించి యా రాజాశ్చర్యపడి 'యీ స్వామి చంపక సుందరుడు' అని చెప్పి నమస్కరించెను. ఈ నాటికిని ఆ దేవుని కాదివ్యనామము వర్ధిల్లుచున్నది. ఆ స్వామికి జంపకమాలను సమర్పించిన కారణముచే వంశచూడామణి పాండ్యుడును 'చంపకపాండ్యుడు' అని పేరు పొందెను. చంపకపాండ్యుడు చంపకసుందర దేవుని కిట్లు సేవచేయుచుండిన కాలములో నొకప్పుడు వసంతకాలము వచ్చినది.

"ఆ వసంతకాలమున నొక్కనాడు చంపకపాండ్యుడు తన దేవేరితో నెండవేడిమిని దొలగించు

# నక్కీరుని కథ - కొన్ని విశేషములు

కొనుటకై యా చంపకవనములో నొక చంద్రకాంత శిలా వేదికపై నుండెను. అప్పు డాతని దిక్కుగా నొక కమ్మని తెమ్మెర వీచినది. పాండ్యు డా సుగంధము నాఘ్రాణించి 'ఇదియొక దివ్యపరిమళము. తెమ్మెర పూదోటలోని పూలవాసనను గ్రహింపలేదు. గాలికి వాసనలేదు. ఇది యే వాసనయో!' అని తలచి తన దేవేరివైపు తిరిగి చూచెను. అపుడా దివ్యపరిమళ మామె ధమ్మిల్లమునుండి వచ్చుటగా నెఱిగి యాతడు మిక్కిలి యాశ్చర్యపడి 'తుమ్మెదకును నీ పరిమళము తెలియదు' అని ప్రశంసించి 'ఈ పరిమళ మీ ధమ్మిల్లమునకు సహజ మయినదా? (ఇయర్కైయా) లేక సంపాదితమా (శేర్కైయా) అని సందేహము పూనెను. 'నేను సందేహించిన యీ విషయము నెవరైనను దెలిసికొని తదనుగుణముగా గవిత్వము చెప్పినచో నతడీ వేయిమాడల ముడుపు గొన నర్హుడగు' నని చెప్పి, యొక బంగారు నాణెముల ముడుపును దన సేవకుల చేతి కొసగెను. వారును దానిని గొనిపోయి 'సంగమండపము' నకు ముందు వ్రేలాడగట్టిరి. సంఘకవు లందఱును రాజు మనోభావమును గ్రహించుటకై తీవ్రముగా నాలోచించి యాలోచించి విఫలమనోరథులై మిక్కిలి విచార మందిరి.

"అప్పు డాద్విశైవులలో నొక్కడును, దల్లిదండ్రులు లేనివాడును, బ్రహ్మచారియు, వివాహాపేక్ష గలవాడును నగు ధర్మి యనువాడు సోమసుందరస్వామి సన్నిధికి బోయి నమస్కరించి 'స్వామీ! ఈ మీ దాసునికి తల్లిదండ్రు లిద్దరును లేరు. నాకు వివాహ మాడవలయుననీ కోరికగా నున్నది. దానికి వలసిన ద్రవ్యము నాకడ లేదు. దాసుడు వేదములు, శివాగమములు మొదలగువాని నెల్ల జక్కగా జదివి యుండియు గృహస్థజీవితము లేకుండ మీ పూజ కెట్లర్హు డగును? మీరు సర్వజ్ఞులరు. పాండ్యుని మనోభావమును దెలిసి యొకపద్యమును రచించి యిండు' అని విన్నపము చేసికొనెను. వెంటనే సోమసుందర దేవు డాతనిపై గరుణించి తమిళములో నొకపద్యమును రచించి యొసగి యాతని ననుగ్రహించెను. ఆ పద్యమిది!

"కొంగుతేర్ వాళ్ళైక్కై అంజిఱైత్ తుంబి
కామం శెప్పాదు కండదు మొళిమో
పయిలియదు కెళ్ళియ నట్పిన్
మయిలియల్ శెరియెయిట్రు అరివై కూందలిన్
నఱియవుం ఉళవో నీ అఱియుం పూవే"

ధర్మి భక్తితో నమస్కరించి యాపద్యమును దీసికొనిపోయి సంగమండపమునుజేరి యచ్చటనున్న కవీశ్వరులచేతి కిచ్చెను. వారందఱును దానిని గొని చదివి యందలి శబ్దమాధుర్యమును, నర్థమాధుర్యమును గని సంతోషించి పాండ్యునికడకు బోయి యాపద్యమును జదివిరి. పాండ్యుడును నాపద్యము తనమనోభావమునకనుగుణముగా నుండుటచే మెచ్చుకొని తలయూచి మిక్కిలి సంతోషించి 'ఈ పద్యమును దీసికొని వచ్చిన బ్రాహ్మణు డీకవీశ్వరులతో బోయి సంగమండపములో వ్రేలాడగట్టియున్న వేయిమాడల ముడుపును గ్రహించును గాక' యని యాజ్ఞాపించెను.

"ధర్మియు నా కవీశ్వరులతో సంగమండపమునకు బోయి యచటి ముడుపును గోయుచుండగా నక్కీరు డాతనియొద్దకు మిక్కిలి వేగముగా బోయి 'నిలు నిలువు' అని యడ్డగించి 'ఈ కవితలో దప్పున్నది' అని యాక్షేపించెను. ధర్మి యామాటలు విని మిక్కిలి విచారించి తలవంచుకొని గుడిలోనికి బోయి యా పద్యముగల తాటియాకును స్వామిసన్నిధిలోనుంచి 'దేవా! యీ పేదవానికి మీరీ తప్పుడు కవిత నిచ్చితిరేల? దారిద్ర్యబాధచే గుములుచు బెక్కునాళ్లుగా మిమ్ము సేవించుచుంటిని. మీచే ఇప్పుడు పొందనుండిన ద్రవ్యమును గోల్పోయితినని నేను విచారమందుట లేదు. సర్వజ్ఞులరగు తమకృతిలో స్వల్పజీవియు, నల్పజ్ఞుడగు నగుకవిమాత్రు డొకడు తప్పుపట్టె ననగా ఇంక నెవరు మిమ్ము గౌరవింపగలరు? ఈ యవమానము మీరు గాని నాకు గాదు!' అని చెప్పి మిక్కిలి దీనముగా నిలుచుండెను.

"అప్పుడు సోమసుందరదేవు డొక కవిరూపమును ధరించి విభూతి త్రిపుండ్రములు, కంటె, పతకము, కుండలములు, ఉంగరము మొదలయిన వానిని ధరించి పాదములకు బాదుకలను దొడుగుకొని ముత్యాలగొడుగు నీడలో వింజామరములు వీచుచుండగా ననుచరులు వెంటనడచివచ్చుచుండగా బోయి సంగమండపమును జేరి ధీరముగా నిలిచి యక్కడనున్న కవీశ్వరులను జూచి 'నా కవితలో దప్పుపట్టిన వారెవరు?' అని ప్రశ్నించెను. ఆ మాట యనియు ననకమునుపే నక్కీరు డావంతయేని భయమందక 'నేనే' యనెను. అంత నాకవి 'అందలి తప్పేది?' అని యడుగగా నక్కీరుడు 'శబ్దదోషము కాదు. అర్థదోషము' అని పలికెను. కవి 'యర్థదోష మెట్లు?' అని యడుగగా నక్కీరుడు

'జడముడికి బరిమళము పూవులతోడి కలయికవలన నేర్ప డునే కాని సహజమయినది కాదే' యనెను. కవి 'పద్మినీజాతి స్త్రీయొక్క జడముడియో?' యని యడు గగా నక్కీరుడు 'అదియును నట్టిదే' యనెను. కవి 'దేవతా స్త్రీల జడముడులో?' యనగా నక్కీరుడు 'అవియును మందార పుష్ప సౌరభమును బొందుటచే సంపాదితమే కాని సహజము కాద' నెను. అంత నా కవి 'నీవు సేవించుచున్న శ్రీ కాళహస్తీశ్వరుని దేవి యగు జ్ఞానప్రసూనాంబిక యొక్క జడముడియు నట్టిదేనా?' యని ప్రశ్నింపగా నక్కీరుడు 'అదియును నట్టిదే' యని నిర్భయముగా బలికెను. వెంటనే కవి తన ఫాలనేత్రమును గొంచెము తెఱచి చూడగా నక్కీరుడు దానికిని భయపడక 'దేవేంద్రునివలె మీ శరీర మంతయును గన్నులు చేసికొని చూచినను మీ కవిత్వము తప్పు తప్పే' యనెను. అంత నక్కీరుడు శివునిఫాల నేత్రమునుండి వెలువడు నగ్నితాపమును సహింప జాలక యచ్చటి పొందామరకొలనిలో బడి యట్టడుగు నకు బోయెను. కవి వేషమున నుండిన పరమేశ్వరు డంత ర్ధానము నొందెను."

పరమేశ్వరుడు ధర్మి యను హారద్విజునికి రచించి యిచ్చిన పద్యములోని భావమిది—"పూలదేనె జక్క నరసి యానెడి జీవితమును, లోని కడగియున్న ఱెక్కలునుగల యో తుమ్మెదా! నా యుద్యానమున నుండుట కారణముగా నావలని మొగమోటమి వహింపక నీవు స్వయముగా దెలిసికొన్న దానినే చెప్పుము. నీకు దెలిసిన పుష్పములలో—జననాంతర సౌహృదమును, మయూర సౌకుమార్యమును, మల్లెమొగ్గలబోలువలె దీర్చినట్లున్న పలువరుసయు గల యీ కాంత యొక్క ధమ్మిల్లమువలె బరిమళము గలిగినపూ వెందైన గలదేమో!"

## 8. నక్కీరుని సుబ్రహ్మణ్యస్తోత్రము

నక్కీరుడు కైలాసదర్శనాపేక్షతో దీర్ఘయాత్ర చేయుచు బోవుచుండగా నొకభూత మాతని బట్టుకొని

యొకగుహలో బంధించెను. అప్పుడు నక్కీరుడాగుహలో బంధితులయినవారినెల్ల బంధవిముక్తులజేసి యనుగ్రహింపవలసినదని వేడుచు సుబ్రహ్మణ్యస్వామిని పెక్కువిధముల స్తుతించెను. ఈ విషయము నక్కీరుని కథలో నిట్లుకలదు.

"అనవుడు నక్కీరుండును
మనమున దలపోసి దీని మానుప బురభి
త్తనయుడు తారకదమనుడు
తనయం గలుగంగ నింక దల కేలనుచున్.

తారకదైత్య భంజనుడు
దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజన
తామరభూజము షణ్ముఖాస్త్రహో
సారభటీ విపాటిత ది
గంతకటాహుడు వీని బట్టి సం
హార మొనర్చి యిందఱ గృ
పాంబుధియై బ్రతికించు గావుతన్.

భూతము జంపులే యరుదు
బోరన దారకు మన్నిగొన్నవి
ఖ్యాతమహాప్రతాపునకు
నద్రిగుహాలయ మేమి దొడ్డు ని
ర్ఘాతమువంటి శక్తి గొని
క్రౌంచము జించిన రౌద్రమూర్తికిన్
భీతి దొలంగజేయు టొక
పెద్దయె వారిత దేవతార్తికిన్?

వ॥ అని యనేక ప్రకారంబుల సుబ్రహ్మణ్యోక్తి యుక్తంబుగా నిష్టదేవతావరేణ్యుండును భక్తిశరణ్యుండును నగు సుబ్రహ్మణ్యు సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుండై"

నక్కీరు డీ సందర్భమున సుబ్రహ్మణ్యస్వామిని స్తుతించుచు జేసిన స్తోత్రగ్రంథమునకు తమిళమున 'తిరుమురుగాట్ట్రిప్పడై' అని పేరు. తిరుమురుగాట్ట్రిప్పడై యనగా సుబ్రహ్మణ్యస్వామి (మురుగన్) కడకొకని బంపుట యని యర్థము. ఈ స్తోత్రము మూడువందల పదియేడుపంక్తులను గలిగియుండి యచ్చమయిన యరవ పదములతో సంస్కృతపద విరహితముగా నొప్పారుచున్నది. తమిళములో 'శైవతిరుమురైగళ్' అను పేరుతో శైవసంబంధములగు గ్రంథములు పదునొకండు కలవు. ఇది వానిలో బదునొకండవ గ్రంథమందున్నది. సంగకాలపు గవులచే రాజులయు, సేనానులయు ప్రశంసగా రచితము లయిన రచనముల సంకలనమగు 'పత్తుపాట్టు'లో నిది తొలిగ్రంథముగా గూర్పబడియున్నది.

## 9. దక్షిణ కైలాస స్తోత్రము

దక్షిణకైలాసమగు కాళహస్తిని సందర్శించినంతనే నక్కీరునికి కుష్ఠరోగము తొలగిపోయెను. అపుడు నక్కీరుడు కాళహస్తిని కైలాసముతో సమానముగా జేర్కొనుచు నూఱుపద్యములతో గాళహస్తిని స్తుతించెనట! ఆయీ విషయము నక్కీరుని కథలో నిట్లున్నది.

కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీ
కూలస్థకైలాసమున్
నిష్ఠాధీనమనస్కుడై కదిసి త
న్నీరంధ్ర కల్లోలభూ
యిష్ఠౌఘంబున దీర్థమాడి గిరిజా
ధీశున్ శివున్ దేవతా
శ్రేష్ఠున్ సంస్తుతి నూఱుపద్యముల జే
సెన్ ద్రావిడోక్తిం దగన్.

"ఆ నూఱు పద్యములకున్
సేనానీజనకు డార్తచింతామణి వి
ద్యానిధి జ్ఞానప్రసవాం
భానాథుడు కాళహస్తిపతి ప్రీతుండై."

తమిళములో నీ స్తోత్రమునకు 'అంతాది' యని పేరు. ఇది ముక్తపదగ్రస్తమువంటి రచన. కైలైపాది కాళత్తిపాది—అంతాది యని తమిళములో నిది ప్రసిద్ధి చెందియున్నది. ఒక పద్యము కైలాసమును గుఱించి మఱొకపద్యము కాళహస్తిని గుఱించి యిందుండును. మొదటి పద్యములోని కడపటి పదము రెండవ పద్యములో దొలుత గ్రహించుట యందలి సంప్రదాయము. అందలి తొలి రెండుపద్యములు మచ్చున కిట్లుండును.

"సొల్లుం పొరుళుమే తూత్తిరియుం సెయ్యుమా
నల్లిడింజిల్ ఎన్నుడయ నావాగ చ్చొల్లరియ
పెణ్ణాగ విళక్కా వియన్ కైలైమే లిరుంద
పెణ్ణాగ క్కట్టి నేన్ పెట్ట్రి.
పెట్ట్రిపయన్ ఇదువే అన్రో పిరందు యాన్
కట్ట్రివర్ గళ్ ఏత్తుం శీర్ కాళత్తి క్కొట్ట్రివర్కు
తొళాగతొడరవం సూఝ్జెన్ద అమ్మానుక్కు
ఆళాగ పెట్ట్రిన్ అడైందు." *

* తమిళ గ్రంథములలోని యాధారములను సంప్రతించుటలో నాకు మిక్కిలి తోడ్పడిన మిత్రులు, తమిళభాషా విద్వాంసులు శ్రీ సి. ఆర్. నారాయణస్వామిగారికి మిక్కిలి కృతజ్ఞుడను.

# వేదము వేంకటరాయశాస్త్రి

శ్రీ రామచంద్ర కౌండిన్య

కలము కరమ్మునన్ గదియగా మిము జూచి మిమున్ దలంచినన్
కలమును కాయమున్ కరము కంపిల నెంతటి వింత, త్వన్మనీ
ష లవము లేని మాదృశులు సామ్యము వత్తురు సర్వవర్ణ సం
కలిత సితచ్ఛవీ విజిత కాలిమకున్, బుధలోక మిత్రమా!

ఎంతలో నేర్చు వారి నొకయింతన మాత్ర దృణీకరించి యే
మంత గడించికొందు మవమానము గాక, యశేష శేముషీ
మంతుల పొంత నాత్మ లఘిమంబు నెఱుంగుట తెల్వి, చేతనై
నంత సమర్చ సేతలు జనంబు లొనర్చు తపః ఫలంబులున్.

మును హిమశైలపాదమున మూఢ భగీరథు డేకపాదుడై
ఘనము తపించి తెచ్చెనట గంగను! ముంగల పోవదేమి? నే
ర్చెనయ బినాకినీ తటి నొకింత తలంచెనొ లేదొ కావ్య క
న్యను తన వెన్క నిల్పె ననఘాత్మత, వేంకటరాయ డల్పుడే?

ప్రతిభ పరసీమ, నిర్మలశ్రుతికి గీము, ప్రతిదినోపాసనా హృష్టవాణి, కుకవి
పండితమ్మన్యకోటికి గుండె దిగులు, ప్రథిత కవికీర్తి వేంకటరాయశాస్త్రి.

తొడరిన కవి పండితులకు నిస్పృహా గూర్చ బిడికిలించె విమర్శ పేరి చిచ్చు;
చేమోడ్చు విద్యార్థి జీవన హేతువై నెఱచూఱలిచ్చె బెన్నిధుల కృతుల;
కైతవ వ్యాకర్తృ కంఠపాశంబుగా శారదా కాంచిక జతను చేసె;
కావ్యాబ్ధిని మథించు కవ్వంబుగ ప్రసన్నరాఘవాంధ్రము విమర్శనము నెఱపె;

సరస కవితల, బ్రతిపదస్ఫుర దపార
పాండితీప్రజ్ఞ, వ్యాఖ్యాన శౌండిమమున,
నలువ చెవి త్రుప్పుడుల్ల లీలల నటించె
వాణి చేవీణ, వేదాన్వవాయ భవుడు.

# "ఎడు-త"ల సంధివిచారణ

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ప్రకృతము చిన్నయసూరిగారు, బాలవ్యాకరణము క్రియాపరిచ్ఛేదములో 'ఎడు-త'ల సంధినిగూర్చి యిట్లుపదేశించినారు.

సూ:- "లూట్టు ద్వితీయ కెడు త వర్ణంబులు ద్రుతాంతంబు లగు" (26) ఉదా:- "మీకు మేలు గలిగెడును"; "మీకు మేలు గలుగుతను."

సూ:- "ఎడుతల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు" (28) ఉదా:- "నీకు మేలు గలిగెడు మనియెను"; "నీకు మేలు గలుగుత మనియెను."

ఈ యుదాహరణములలోని మకారము ద్రుతమున కాదేశముగా వచ్చినదేనా? 'కలిగెడు ననియెను' - 'కలుగుత ననియెను' అంటే తప్పగునా? 'ఎడును+అని యెను = ఎడుననియెను-' 'తను+అనియెను = త నని యెను' అని స్వరసంధి కాదా? అన్నది యిక్కడ విచారణ.

ఇందుకు సంబంధించిన వ్యాఖ్యాతల వివరణములను, అటుపై భాషాపరిశోధకులు చేసిన చర్చలను, వాటి తత్త్వమును వరుసగా ముందుచెప్పి, తరువాత నాకు తోచినమాట మనవిచేస్తాను.

## 1

సుపార్థప్రకాశిక, (1915) - "ఇచ్చట సంధి దశయందు ఎడు-త వర్ణంబులు మకారాంతంబులయ్యును విభాగావస్థయందు, కలిగెడున్+అనియెను; కలుగు తన్+అనియెను - అని నకారాంతంబులుగాఁ జెప్ప వలెను" అన్నదేగాని, సంధిదశయందు ఆ నకారము మకార మగుటకు కారణమేమో చెప్పలేదు.

అది యట్లుండగా, ఇంకొక విశేషము—26 వ సూత్రముక్రింది యుదాహరణలలో, ఎడు-తల తుది నున్న నకారము - ఉత్వ-సహితము-(ను). దానినే సూరి ద్రుత మన్నది. ఆ ద్రుతమే - అచ్చుపరమై (ను+అ) మకారమైనట్లు, 28 వ సూత్రముక్రింద చూపబడినది. అట్లు సంధిలో మకారమైన 'ను', పదవిభాగమున - యథాపూర్వము 'ను' గానే నిల్చునుగాని, ఉత్వముపోయి పొల్లగునా? సు. ప్రకాశిక "విభాగావస్థయందు - కలిగెడున్+అనియెను; కలుగుతన్+అనియె - అని (పొల్లులతో) చెప్పవలె" నన్నది. సు. ప్ర. ఒక్కటియే కాదు; తక్కిన వ్యాఖ్యానములును ఇట్లే - పొల్లురూపములనే చూపినవి. కారణమేమో!

ఆ విభాగము సూరి సూత్రమున కనుగుణము కాదు. పైగా, కలిగెడును+అనియె; కలుగుతను+అనియె - అని విభాగించుట తప్పగునేమో యన్న సంశయమున కాస్పద మగుచున్నది.

## 2

(1925.) శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, తమ 'సంధి'యను గ్రంథమున, ఇట్లు వ్రాసినారు.

"భావికాలరూపము తమిళభాషలో 'వర్' ధాతువునకు 'ఉమ్' మాత్రము చేర్చుటచేతనే యేర్పడు చున్నది. వర్+ఉమ్=వరుమ్-వచ్చును. 'వచ్చెడున్' అనునది కూడ తద్ధర్మార్థకమే యగుట భావ్యర్థమును దానిచే సూచింపఁబడును. కావున దాని తుదిని గూడ 'ఉం' అగపడుచునేయున్నది. అయ్యెడున్ (అయి+ఎడు-ఉమ్) అను రూపముల్లన ద్యోతకమగుచున్న యాశీర్వచన రూపభావిఫలమే తుదినున్న 'ఉమ్' వలన సూచింపఁబడుచున్నదనవచ్చును. వీని తుది నున్నది వాస్తవముగా 'ఉమ్' శబ్దమేగాని యర్థములేని కేవల 'న'కారము కాదనుట కీ రూపముల కచ్చుపర మగునపుడుండలి నకారము మరల మకారముగ మాఱుచుండుటయే తార్కాణము. కావుననే - ఎడు తల ద్రుతంబున కచ్చు పరమగునపుడు మగాగమం బగుట యొక విశేష విధిగా గ్రహింపఁబడినది. అనఁగా మొదటి 'ఉమ్'లోని మకారమే తరువాతి యచ్చుతో నెనసి 'అయ్యెడు మనియె' అను రూపముకాఁగా కాలక్రమమున నా పదాంత మకారము - నకారముగా మాఱుటచే 'అయ్యెడున్' అను నకారాంత రూప మేర్పడినను ప్రాచీనకాలమునందలి సంధిగత రూపములలో మొదటి 'ఉమ్' శబ్దగత 'మ'కార మగపడుచునే యున్నదన్నమాట."(పు. 266)

శ్రీ రామకృష్ణయ్యగారిది ఫైలాలజీ దృష్టి. ఆ దృష్టితో వారు తమిళములోని 'ఉమ్'ను, తెనుగులోని

ఎడు'కు తగిలించి,- "ఎడు+ఉమ్=ఎడుమ్ - భావ్యర్థ సూచక"మన్నారు. తెనుగునకు తమిళపు పోలికలు కొన్ని యున్నమాట నిజమేగాని, అవి మేనమామ పోలికలు. సర్వత్ర సరిపడవు. సర్వశబ్దములకును సరిపడవు. ప్రకృతపు "ఎడున్"కు బొత్తిగా సరిపడవు. అసలు ప్రక్రియలోనే - తమిళమార్గము వేరు; తెనుగు మార్గము వేరు. చూడండి—

(1) ఆ భాషలోవలె ఈ భాషలో ధాతువుకే 'ఉమ్' చేరి 'వచ్చుమ్' కాలేదు. ఇందు 'ఉమ్' చేరినది 'ఎడు'కు. ఎడు-ప్రత్యయముగాని ధాతువు గాదు. కావున 'ఎడుమ్' అనుటలో అర్థములేదు. అది యట్లుండగా; 'ఎడు' భావ్యర్థమును దెల్పుటకొరకు వచ్చినదే. అదియొకటి యుండగా మరల దానిమీద ఆ యర్థమునే తెల్పు 'ఉమ్'ను చేర్చుట శాస్త్రవిరుద్ధము. 'ఎడు'ను తొలగించి 'ఉమ్'ను చేర్చినను తెనుగు ధాతువు ఎట్టి యర్థమును ఇయ్యదు. నీవు మేలు గలుగుమ్; వాడు వచ్చుమ్ - అనుట పొసగదన్నమాట. కాబట్టి తమిళములోని 'ఉమ్' తెనుగులోనికి వచ్చినదనుట సరిగాదు.

(2) రామకృష్ణయ్యగారు, 'ఉమ్' అర్థవంతమనియు, నకార మర్థశూన్యమనియు సెలవిచ్చినారు. అది వాదముకొరకన్నమాటయేగాని నిజముకాదు. ఏ భాషలోని పద మా భాషలోనే అర్థవంతము. ఇతర భాషలో కాదు. తమిళములో 'వరున్' అన్నను, తెనుగులో 'వచ్చుమ్' - 'వచ్చెడుమ్'-అన్నను రెండును అర్థరహితములే.

(3) వారు, 'ఎడుమ్' అనునదే మొదటిరూపమనియు, అది కాలక్రమమున 'ఎడున్'గా మారినదనియు వ్రాసినారు. కాని ఆ మొదటిరూపమే కాలమున నుండెడిదో, అది యెప్పుడు మారినదో, అట్లు చెప్పుట కాధారమేమో వ్రాయలేదు. అంతా సొంత ఊహాయే. వట్టి యూహా ప్రమాణ మెట్లగును?

(4) "ఎడుమ్—లోని మకారము నకారముగా మారి 'ఎడున్' అను రూప మేర్పడినను, అచ్చుపరము కాగానే ఆ నకారము మరల మకారముగా మారుచున్న"దనుటయు, "అందువల్లనే - 'ఎడుతల ద్రుతంబున కచ్చుపరమగునపుడు మగాగమంబగుట' యొక విశేష విధిగా గ్రహింపబడిన"దనుటయు పులిమి పుచ్చుట యగునుగాని క్రమమైన వాదము కాదు.

ఎన్నడోపోయిన మకారము, అచ్చుపరము కాగానే తటాలున మరలవచ్చి, సంధిలో నకారమును త్రోసివేసి, దాని స్థానమున తాను కూర్చుండుననుట ప్రాజ్ఞులు నమ్మదగినమాటకాదు. "అచ్చు చేరిన నకారము (న్+అ) 'న' కాదు; 'మ' యగు" ననుట భాషాస్వభావ విరుద్ధము.

(5) వారి మతము ప్రకారము, 'ఎడుమ్' అను రూపమున్న కాలములో, తద్ధర్మార్థకములైన, వచ్చు - కలుగు మొదలగు ధాతువులును - వచ్చుమ్; కలుగుమ్ - అనియేయుండి, 'ఎడుమ్'తోపాటు అవియును కాలక్రమమున - ద్రుతాంతము లైనవైగదా!

అయినప్పుడు, అవియును సంధిలో-వచ్చున్+అనియె = వచ్చుమనియె; కలుగన్+అనియె = కలుగుమనియె-కావలసినదేగదా! అట్లుకాక, 'వచ్చుననియె'-'కలుగుననియె' యని యగుచున్నవే. అట్లగుటకు కారణమేమి?

'ఎడున్'లోని నకారమునకేగాని, మకారాదేశము క్రియలలోని నకారమునకు లేదందురా? అట్లనుటకు ప్రమాణ ముండవలె గదా! ఏదీ?

(6) వారు, సంధిలో నకారము మకారమగుట "ఆగమ" మన్నారు. పొరపాటు. అది "ఆదేశము"గాని ఆగమము కాదు. ఆగమ మనగా వర్ణాధిక్యము.

(7) వారు 'ఎడు-త'లలోని 'ఎడు'కు 'ఉమ్' చేరునన్నారు. 'త' సంగతి యెత్తలేదు. 'త' కు 'ఉమ్' చేరదా? 'ఎడు'కు చేరినప్పుడు, దానివెంటనుండు 'త' కు ఎందుకు చేరదు? వారి మతము ప్రకారము 'త' వర్ణమునకును 'ఉమ్' చేరి 'తుమ్' అయి, 'కలుగుతుమనియె'; 'కావుతుమనియె' అను వ్యవహార మేర్పడవలె. కాని, యేర్పడలేదు. ఎందువల్ల? 'కలుగుతమనియె'; 'కావుతమనియె' అనిగదా నేడున్నవాడుక? అదియును 'ఉమ్' చేరుటవల్ల ఏర్పడినదేనా? అది యేలాగు? త+ఉమ్=తమ్. అగునా?-'తుమ్' అగునా?

ఇంకను చర్చయెందుకు? రామకృష్ణయ్యగారు "న్+అ=మ" అన్న పరవస్తువారి మాటను పట్టుకొని, అదియే సత్యమనుకొని, దానిని సమర్థించుటకే ద్రావిడ ప్రాణాయామమార్గము నవలంబించినారు.

## 3

ఈ విషయమున భాషాసంప్రదాయానుసారముగా పరిశోధనచేసి, ఎడు-తల ఆచూకీ కొంతవరకు కనిపెట్టినవారు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

గారు. వారు (1926. లో) తమ 'ఆంధ్రభాషానుశాసనము'లో,-'ఎడును-తను' క్రియావిభక్తులనియు, 'కలిగెడున్'-'కలుగుతన్' క్రియారూపములనియు తెలిపి, 'ఫుట్ నోటు'లో ఇట్లు వివరించినారు.

'ఎడము'-'తము' ఇవి ప్రాచీన రూపములు.

"దీవన కెడమయుఁ గాతయుఁ
గావుతమును దెలుగులందు గలవంద్రు మహిన్
శ్రీవెలుఁగెడ మధిపుఁడు మే
ల్గావించును గాతి మేలు గావుత మనగన్"

అను కేతనార్యుని లక్షణము ముద్రణములో మాఱిపోయినది. 1

అయ్యెడము - కావుతము-అనురూపములు పూర్వశాసన తాళపత్ర గ్రంథములఁ గనవచ్చుచున్నవి. ఇవి క్రమముగా, ఎడుఁ - తఁ - అని మాఱినవి. మార్పును బట్టి చిన్నయసూరి "ఎడుతల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు"నను సూత్రము కల్పించెను. అర్వాచీన సంప్రదాయమునుబట్టి నేనును వీనిని పై విధముగాఁ జూపితిని." (పు. 234)

శాస్త్రిగారు, కేతన లక్షణమునుగూర్చి యిట్లు తెల్పి, 268-వ పుటలో, ఈ క్రిందివిధముగా అనుశాసించినారు.—

"సూ:- ఆశీశ్శాపములందు ధాతువులకు వచ్చు ఎడును - తను - వర్ణకముల ద్రుత మచ్చుపరమగునపుడు మకారమగు. (౧౧౨)

ఇది చిన్నయసూరి మతము ననుసరించినసూత్రము. ప్రాచీన మతము వెనుకఁ దెలుపఁబడినది.

ఉదా:- శుభం బయ్యెడు మని. మేలు కలుగుత మని—మొద.

సూ:- ఆశీరాద్యర్థములందు తద్ధర్మార్థక క్రియలపై కాతఁ - కావుతఁ - కాక - యనునవి చేరును, అచ్చు పరమగునపుడు ద్రుతము మకార మగును. (౧౧౩)

ఉదా:- పోషించుఁ గాతన్ - రక్షించుఁగాత మని, ఏలుఁగావుతఁ - ఏలుఁ గావుత మని, వర్ధిల్లెదవు గాక. మొద—

ఇవియును కళలైనట్లు శాసనాదుల వలనను కేతన కవి లక్షణమువలనను దెలియును. చేయు గాతయని - చేయుఁగావుత మనఁగఁ - కాని యివి క్రమముగా ద్రుతాంతములుగా మాఱినవి."

శ్రీ శాస్త్రిగారు, ఎడు-త-ల విషయమును ఇతర భాషలలో వెదకబోక తెనుగులోనే విచారించినారు. శ్రమకోర్చి వ్రాతప్రతులను పరిశోధించి, కేతన లక్షణ పద్యమును సంపాదించి 'ఎడమ' - 'తము' అను రూపములు గలవని చూపించినారు. దానితో 'కలిగెడు మనియో'; కలుగుత మనిగొ' అను తావులలో కనబడుచున్న మకారము - ఎడు-తల పొంతముగాని సంధివశమున సంభవించినది కాదని తేలినది.

కాని, శాస్త్రిగారు, ఎడమ - తము - అను రూపములు పూర్వపు శాసన తాళపత్ర గ్రంథములలోనే కాక, కేతన లక్షణమునను ఉండుట చూచియు, వాటిని గూర్చి గట్టిగా విచారింపక వదలివేసి, మరల చిన్నయసూరి దారికే వచ్చినారు. అది పొరపాటు. కేతన ఆంధ్రభాషా భూషణము తెలుగునకు తొట్టతొలి వ్యాకరణము. కావున దానినిబట్టి సూరి సూత్రమును విచారింపదగును గాని, సూరి సూత్రమునకు ప్రామాణ్యమొసగి కేతన లక్షణమును త్రోసివేయగూడదు.

శాస్త్రిగారు సూరి వాక్యము నే విశ్వసించి, కేతన పద్యములోని ఎడమ - తము - ప్రాచీన రూపములన్నారు. అవి, ఎడుఁ-తఁ-గా మారినవన్నారు. ఆ మార్పునుబట్టి సూరి, నకారమునకు మకారాదేశమును

---

1 ముద్రణములలో పాఠము లిట్లున్నవి:—

(1) "దీవెన కెడమయుఁ గాతయుఁ
గావుతయున్ దెలుఁగు కవుల కబ్బంబులలో
శ్రీవెలిఁగెడ మధిపుఁడు మేల్
గావించుం గాత మేలు గావుత యనఁగన్" (161)

ఇది (1949. సం.) వావిళ్ళ ప్రతిపాఠము. ఇందు 'ఎడమ' యున్నది గాని, 'తము' లేదు. కాత; కావుత. రెండును కళలుగా నున్నవి. పద్యమున క్రియాపదము లేదు.

(2) "దీవెన కగు నెమఁ గాతను
గావుతనున్ దెనుఁగు కవుల కబ్బంబులలో
శ్రీ వెలిఁగెడు మధిపుఁడు మే
ల్గావించుం గాత మేలు గావుత మనఁగన్" (161)

ఇది, 'కళాకృష్ణులు' శ్రీ వఙ్గమూడి గోపాల కృష్ణయ్యగారిచే పరిష్కృతమై, శ్రీ దేవినేని సూరయ్యగారి వివరణముతో -1953. లో-ప్రకటితమైన ప్రతిలోని పాఠము.

ఈ పాఠము చిన్నయసూరి సూత్రము ననుసరించి సవరింపబడినది.

విధించినా డన్నారు. తామును అట్లే అనుశాసించి, యిది యర్వాచీన సంప్రదాయమన్నారు. ఇదియంతయు పొరపాటులో చేరినదే. దీని కంతకును కారణము కేతన లక్షణమును సరిగా నరయక వదలివేయుటయే.

శాస్త్రిగారు-"కేతన లక్షణము ముద్రణములో మాఱిపోయిన" దన్నారు. ముద్రణములోనే కాదు; వ్రాతప్రతులలోను మారిపోయినది. అట్లుమారిన పాఠ మే అది.

ఆ పద్యములో "ఎడమయు అని యున్నది. 'ఎడుమును' అని యుండవలెను. కేతనకు ముందటి— వెనుకటి యెల్ల గ్రంథములలోను 'ఎడుము' అనురూపమే గాని "ఎడమ" యనురూపము కనబడుటలేదు. వ్రాతప్రతులలో క్వాచిత్కముగా నున్నను గ్రహింప దగినదికాదు. కారణ మేమనగా: అసలు ప్రత్యయము "ఎడు"గాని "ఎడ"కాదు. 'ఎడ' యను రూప మే లేనప్పుడు 'ఎడమ' యనురూపమెట్లు పుట్టును? "ఎడమ" యున్నచో-ఆశీరాదులందు-'ఎడన్' అనియు నుండవలెను గదా! నీకు మేలు-'అయ్యెడన్'; 'కలిగెడన్' వంటి ప్రయోగములు నాకగపడ లేదు. కేతనయు 'ఎడు'ను చెప్పినాడే గాని, 'ఎడ'ను చెప్పలేదు. "అడిగెడు, నడిగెద రనఁగా" (అం. భా. భూ. 144) మరియు నతఁడు, దశ. వ. లో 'ఎడున్' అను రూపమునే పలుమారు వాడియున్నాడు.

"దురితం బయ్యెడు నెట్లు" (7.93)
"ఆఱడివెట్టెడు" (10.120)
"నాకుఁ గౌతుకము పుట్టెడు"

ఇత్యాదిగా అతని ప్రయోగములు కనబడుచున్నవి. 'ఎడున్' అనురూపమును తన లక్షణములో చూపి, తన గ్రంథములోను వాడిన కేతన 'ఎడమ' కలదని యేల చెప్పును? కావున 'ఎడమ' పాఠము సరియైనది కాదు.

'ఎడుము' అనురూప మొకటి యున్నది గాని, అది యిక్కడ (కేతన పద్యమునఁ సరిపడదు. అందున్న "కావుతమనఁగన్" (కావుతము+అనఁగన్) అను లక్ష్యమెట్టిదో-"వెలిఁగెడు మధిపుఁడు"(వెలిగెడుము+ అధిపుఁడు) అను లక్ష్యమును అట్టిదే. 'ఎడుము'; 'తము' కలవని చెప్పుటకే ఆ లక్షణము పుట్టినది.

ఎడున్, తన్ - అనుననేకాక, ఎడుము - తము, అనునవియును గలవని పద్యభావము. అందుకే "ఎడుము-ను; తము-ను గలవండ్రు" అని సముచ్చయము ప్రయోగింపబడినది. "కలవండ్రు" అనగా కలవని యర్థము. అంతేగాని, 'కలవని కొందరందురు గాని ఆ రూపములు + లేవని యర్థము కాదు. కేతన తన కాలమున ప్రచారములోనున్న భాషకే లక్షణము వ్రాసినది. ఆ భాషయే మనము వాడుకొనుచున్నదియును. కావున కేతన లక్షణము మనకు ప్రమాణము.

ఆ లక్షణ పద్యము పూర్వోక్త కారణములను బట్టి యిట్లుండవలెను.

"దీవన కెడుమును గాతయుఁ
గావుతమును దెలుఁగులందు గలవండ్రు మహిన్
శ్రీవెలిఁగెడు మధిపుఁడు మే
ల్గావించును గాత మేలుగావుత మనఁగన్"

ఎడున్, తన్-అనుగుణాంత రూపములే కాక, ఎడుము, కాత (కళ), కావుతము - అనురూపములును గలవని పద్యమున నుపదేశము

పై రూపము లన్నియు నన్నయనాటినుండి నేటి వరకును వాడుకలో నున్నవి. పూర్వశాసనములలోను ఉన్నవి. అన్నిటికిని ప్రయోగములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. వ్యాసము పెరుగునని, ఒక్కొక్క దానికిని కొలది కొలదిగనే, ఉదాహరణ లిచ్చుచున్నాను.

## 'ఎ డు ము'

"వాఁడు రెండవ యింద్రుం డయ్యెడు మని" (ఆది. 2.87)

"ఇక్కుమారుండు పెరుగునంతకు నాయొద్దన యుండెడు మని శంతను నొడంబఱచి" (ఆది. 4. 162)

"నీ తమ్ములు లబ్ధజీవితు లయ్యెడు మనిన" (అర. 7.458)

"పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని" (విరాట. 1.57)

"వర్ధన మొందెడు మనుడు" (ద్రోణ. 2.12)

"అట్ల యయ్యెడు మూఱకుము" (అను. 2.331)

"ఇచ్చుచు నుండెడు మర్థి సహార్నిశముఁ" (నన్నె. కు. 12.224)

"ఆ కమలజుఁ డతనితోఁడ నయ్యెడు మనుచుఁ" (భాస్క. బాల. 445)

"అవ్వాహిని షష్ఠతోయ యయ్యెడు యనియు...అప్పుడ్యే యయ్యెడు మనియు శపియించిరి" (భీమ. 4.195)

'ఎడున్'

"అనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" (ఆది. 1.105)

"ఈ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు"(ఆది-1.149)

"నీ కభీష్టముల్ ఘనముగఁ జేయుచుండెడు" (ఆది. 2.57)

"ఆ కద్రువపుత్రు లశన మయ్యెడు నాకున్" (ఆది. 2.117)

"పాయక యెప్పుడుఁ గాచుచుండెడున్" (ఆర. 7.348)

"వెరవరి యయ్యెడును సకల విద్యలయందున్" (నిర్వ. రా. 2.30)

"త్రిపథగాహ్వయయై విలసిల్లెడున్" (భాస్క. బాల. 459)

"నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్"(భీమ. 2.156)

"మీకు నయ్యెడుఁ జిరాయువు భాగ్యము" (భీమ. 5.86)

ఈ క్రిందిది శాసన పద్యము:—

"భాస్కరుండు దయం గాచుచుండెడుం
గరుణా రసపూర్ణుఁ హృదయుం గాటయం
బ్రీతిం ని" (శా. మం. పు. ౭౯)

'తము'

"మీ తలంపునకు దైవం బనుకూలంబు గావుత మని పాండుపుత్రుల దీవించి" (విరాట. 1.57)

"మగుఁ డీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్" (నన్నె.కు. 1.9)

"అంబా! మా కొసఁగుఁ గాత మభ్యుదయంబుల్" (భీమ. 4. 170)

"చేయుపనులెల్ల సఫలముల్ చేయుఁ గాత మలరి రామానుజయ్య వేదాద్రిపతికి" (పాండు. 1.7)

"ఈ తీర్థంబు నసన్నామాంకిత సమర్థనంబున నుత్తమం బగుం గాత మని" (పాండు—4.111)

"దీర్ఘాయు వగుం గావుత మని దీవింప" (మొల్ల. రా. యు. 2.38)

"ఆదిత్యుం డొసఁగుఁ గాత మభ్యుదయంబుల్" (దశ. చ. 1.4)

మరి:—కేతన తన లక్షణమున 'కావుతము'ను చెప్పినాడు గాని, 'కాతము'ను చెప్పలేదు. "కాత" యని కళగా చెప్పినాడు. అయినను, ఈ పద్యమున "కాతమభ్యుదయంబుల్" అని ప్రయోగించినాడు ఈ 'కావుతము'నుబట్టి 'కాతము' అను రూపమును అగునని తెలిసికొనవలసినదని యతని యభిప్రాయము. "అనుక్త మన్యతో గ్రాహ్యమ్" కదా!

ఈ క్రిందివి శాసనపద్యములు:—

"కాటయ కీవుత మిష్టసంపదల్" (శా. మ. పు. ౭౮)

"హరి గాటయ కీవుతము దయామతి శుభముల్" (శా. మ. పు ౭౮)

ఇందలి "ఈవుతము" శిలాక్షరము గావునను, "ఈవుతము దయామతి" యన్నచోట సంధిగొడవ యేమియు లేదుగావునను "తము" అనురూపము గల దనుట కిక ప్రయోగములు చూపపనిలేదు.

'తన్'

"అహోబలేశుఁ డతిలోకుఁడు లోకముఁ గాచుఁ గావుతన్" (నృసింహ. 1.1)

"మత్కృతి కభీష్ట చిరస్థితిదాయి గావుతన్" (నృసింహ—1.3)

"తము" కలదని చెప్పిన కేతనయే 'తన్' పలు మారు వాడినాడు:—

"హరి యన్నమతిక్కని ధన్యుఁ జేయుతన్" (దశ. చ. 1.1)

"కొమ్మయ తిక్కనిఁ గాచుఁ గావుతన్" (దశ. చ. 1.2)

"తిక్కనిఁ జిరాయురధిష్ఠితుఁ జేయుఁ జేయుతన్ (దశ. చ-1.3)

"మహాకవి తిక్కనిఁ గాచుఁ గావుతన్" (దశ. చ. 1.6)

ఇతర ప్రయోగములు:—

"ఉమాపతి ప్రీతి వహించుఁ గావుతన్" (భీమ. 2.131)

"మూల మౌఁ గావుతన్ భోగమోక్షములకు" (భీమ-5.21)

"శ్రీరినవర మిచ్చి ప్రోవుతను శ్రీరఘునాథ..." (ఆం. భా. 1.2)

ఈ క్రిందిది శాసనపద్యము:—

"గౌరీవరుం డనవరతంబును
నీవుతం గాటయకు దయ నభీష్టఫలంబుల్" (శా. మం. పు. ౭౯)

ఎడుము - ఎడున్; తము - తన్ అను నాలుగు రూపములును, గ్రాంథికభాష పుట్టినది మొదలుకొని

యిప్పటివరకును వాడుకలో నున్నవనుట కీ ప్రయోగములు చాలవా? ఇంకను విస్తర మెందుకు!

(అ) ఎడున్, తన్ - అనురూపములు నన్నయనాఁడే యున్నవి. పూర్వశాసనములలోను ఉన్నవి. కావున అవి యర్వాచీనము లనుట సరిగాదు.

(ఆ) 'ఎడుము - తము'లను నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, భాస్కరుడు, నన్నెచోడుడు - వారికి పిమ్మటివారైన - శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడును వాడియున్నారు. మొన్నమొన్నటి మొల్లయు వాడినది. అంతేకాదు; ఈనాటి శ్రీ శ్రీపాద కవిసార్వభౌములు, **1927** లో తమ భారతములో, "అట్ల యగుంగావుత మని" (భీష్మ.5. 257)అని యుపయోగించియున్నారు. కనుక, "ఎడుము; తము - ప్రాచీన కాలపురూపములు; ఈనాడు లే" వనుటయు సరిగాదు.

(ఇ) 'ఎడుము-తము'లతోపాటు 'ఎడున్-తన్' గూడా భారతములో నున్నవి గావున, ఎడుము; తము- అనునవి 'ఎడున్-తన్' గా మారినవనుటయు, మార్పును బట్టి సూరి విశేషవిధి కల్పించినా డనుటయు నొప్పదు.

(ఈ) ఎడుము; తము - అనురూపము లున్నవి గావునను; ఎడుము + అనియో = ఎడుమునియో; తము + అనియో = తమునియో - అని, ఉకారసంధి యగుటలో ఎట్టి విప్రతిపత్తియు లేదు గావునను, విశేషవిధి కల్పన మప్రసక్తము.

(ఉ) 'కలిగెడుమనియో'-'కలుగుతమనియో' అను ప్రయోగములలోని ఎడు, తలు ద్రుతాంతము లనుట పొరపాటు.

ఈ పొరపాటు - అన్ని వ్యాఖ్యానములలోను పాతుకొన్నది.

## 4

**1937** లో, బాలవ్యాకరణమునకు టీక వ్రాసిన విద్వాన్ శ్రీ దూసి రామమూర్తిశాస్త్రిగారును,—

"26 చే విధింపఁబడిన ద్రుతాంతములైన ఎడు-త అనువాని ద్రుతమున కచ్చుపరమగునపుడా ద్రుతమునకు మకార మాదేశ మగునని సూత్రార్థము..." అన్నారు.

అంతేగాని, ఆయర్థ మొప్పుదగియున్నదా? యని గాని, అసలు - అట్టి సూత్ర మవసరమేనా? యని గాని విచారించినారుకారు. ఎట్టి విచారణమును పెట్టుకొనక సూత్రాని కర్థముమాత్రమే చెప్పి ఊరకున్నవారును గారు. ఎడమ - తము - అనురూపములు కలవను మా మల్లాది పండితులు తెలిపిన సంగతులు మనసున నుంచుకొని యిట్లు వ్రాసినారు.

"తొలితటి భాష నివి 'కలిగెడుము'-'కలుగుతము' అనురీతి నకార విశిష్ట మకారము తుది గలిగియుండెడి వనియు, మకారము కాలక్రమమున నకారముగాఁ బరిణామమునంద నానంతర వ్యాకర్తలు ద్రుతాంతములుగాఁ దీర్మానించుచు వాని ద్రుతమునకు మకారమును విధించిరనియు భాషాచరిత్ర దృష్టిని గొందఱందురు" అని వారి వాక్యములు.

"కొందఱందురు" అనుటలో భావమేమి? వారట్లనుట తగదనియా? తగుననియా? ఇట్టి సందిగ్ధపు వచనములవలన పఠితల కేమి లాభము? ముఖ్యముగా చర్చింపవలసిన యిటువంటి పట్టులలో ఔదాసీన్యము చూపుట వ్యాఖ్యాతృధర్మము కాదు.

ఈ శాస్త్రిగారును - వెనుకటి వ్యాఖ్యాతలవలెనే "ణ + అ = ము" అన్న చిన్నయసూరి సిద్ధాంతమును పరమ ప్రమాణముగా పెట్టుకొన్నవారే గాని, స్వయముగా పరిశీలించిన వారుకారు. అట్లు స్వతంత్రించి పరిశీలించినవారు ఒక్క వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు కనబడుచున్నారు.

వారు తమ "ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము"లో ప్రకృత విషయమును సుదీర్ఘముగా పరామర్శించి, సూరిగారి విశేషవిధి సూరిజన సమ్మతము కాదని తేల్చినారు. వారి వాక్యములనే యీ క్రింద చూపుచున్నాను.

## 5

ఆం. వ్యా. సం. సర్వస్వము:—"సూరిగారు, 'ఎడుతల ద్రుతమున కచ్చు పరమగునపుడు మకారంబగు' నని సూత్రించిరి. ఎడున్, తన్, కాతన్, కావుతన్ అనున వెల్ల ద్రుతప్రకృతికములే యనియు నట్టి ద్రుతము స్వరపరక మగునపుడు మకారమగుననియు సూరిగారి యాశయము. అథర్వణుఁడు వీనిని వంచించుటలో 'డుము' అను దానిని మాత్రమే 'ము' వర్ణఘటితముగఁ జేర్కొని తక్కిన వాని నట్లు పేర్కొనకుండుటచే 'డు' మేతరములందు మవర్ణస్థితి లేదని తోఁచుచున్నది. వీనిలో నైద్దానియందును మకారస్థితిని నిర్వహింపఁజాలు ప్రామాణిక కవి ప్రయోగము కానరాదు. కాని ముద్రణములందే కాక తాళపత్రమాతృకలందును వీనిలో మకారస్థితి కన్పట్టుచున్నది. 'డుము'లోని మకారమునుబట్టి సామ్యభ్రమచేఁ దక్కిన కావుతాదులందును స్వరసంధిలో మకారస్థితి యర్వాచీనులచేఁ బ్రక్షిప్తమగుచు వచ్చెనని తోఁచుచున్నది. తద్ధర్మక్రియల కాశీర్వర్థకత్వము సర్వసమ్మత మగుటచే 'ఇష్టసిద్ధులఁజేయు

నెల్లప్పు డీశ్వరుండు'-మున్నగు చోటులందువలెనే, చేసెడుఁ, చేసెడిన్-మున్నగు వానియందును స్వర సంధిలో మకారాభావము న్యాయ్యము. ఇట్లగుట చేత నేగదా 'డుమ' అను మకారఘటితము నథర్వ ణుఁడు విధింపవలసెను? కాఁబట్టి కౌవుతాదుల ద్రుత మునకును స్వరపరకత్వమున మకారము కానేరదనుట యుక్తము. 'పొందెడుమంచు' (ఆది. ౭.౧౮౨) మున్నగు నన్నయ తిక్కనల ప్రయోగముల నరసియు సూరి "డుమకౌతా విత్యాది" కారికను సరిగ గ్రహింప మింజేసి యట్టిమకారస్థితిని సమర్థించుటకయి ప్రకృత సూత్రము నుపదేశించెనని యెన్నవగును. 'పొందెడు మంచు' అనురీతిగల నన్నయాదుల ప్రయోగములలో 'పొందెడున్+అంచున్' అని సూరిపక్షమందు పద చ్ఛేదమనియు, 'పొందెడుమ+అంచుఁ' అని నన్న యాథర్వణీయ పక్షమునఁ బదచ్ఛేదమనియు నెఱుంగ నది. ఇందలి సూరిపక్షము నన్నయాథర్వణీయ విరుద్ధ మగుటంజేసి నిర్మూలమని చెప్పనగును. ఈ క్రింది మహాకవి ప్రయోగములును సూరిపక్షమును నిరోధించు చున్నవి.

'వార, లొక్క మొగి వింటిగొనయంబు పెక్క తునియ లయ్యెడుమ యనవుడు నది యట్లయయ్యె' (సౌప్తి ౨.౧౨౪)

'ఇష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడుమ నాకు' (ఆను. ౨.౨౮౭) ఇట్టి ప్రయోగము లథర్వణ వచన సమ్మతము లగుచుండఁగా సూరికై వీనిని నవరించి యన్య థాకరించుట యుక్తము కాదు గదా!" (పు. 1388, 1392)

(1) శాస్త్రిగారు,—"ద్రుతమునకు స్వరపరకత్వ మునఁ మకారము కానేరదు గనుక, 'చేయుఁ+ఎల్ల పుడు=చేయునెల్లపుడు' అయినట్లే - 'కలిగెడుఁ+ అనియె=కలుగెడు ననియె' యగును గాని, 'కలిగెడు మనియె' కా" దన్నారు.

అది న్యాయ్యమే గాని, చేయున్ - కలిగెడుఁ - అనువానికి అచ్చుపరమగునపు డగునది 'స్వరసంధి' యన్నారు. అట్లనుట సరిగాదు. చేయు; కలుగు - అగు వాని తుది నున్నది నకారపొల్లు. ఆ పొల్లు అచ్చు పరమై పూర్ణాక్షరమగుచున్నదే గాని అందు సంధి కార్యము లేదు. స్వరసంధి - యను పక్షమున - 'చేయును+ఎల్లప్పుడు; కలిగెడును+అనియె' ఇత్యా దిగా పదవిభాగమున స్వత్వమును చూపవలెను. అప్పుడు ద్రుతములోని ఉకారమును, అవతలి అకారమును కలిసి 'న' యగును. అది స్వరసంధి. (పూర్వ పరస్వరంబులకు పరస్వరంబే కాదేశ మగుట స్వరసంధి).

(2) "పొందెడుమంచున్" అన్నచోట, "పొందె డున్+అంచున్" అను సూరిపక్షు పదచ్ఛేదము తప్పని చెప్పి, శాస్త్రిగారు - "పొందెడుమ+అంచున్" అని పదచ్ఛేదమన్నారు. కాని, 'ఎడుము' - 'తము' అను వానికి అచ్చుపరమగునపుడు యడాగమమే గాని, అత్వ సంధియగుటలేదు. "అయ్యెడుమ యనవుడు" (సౌప్తి. ౨.౧౨౪) "కౌవుతమ యఖండితముగ" (ఆది. ౮.౯౩) అను ప్రయోగము లందుకు ప్రమాణములు. "పొం దెడు మంచుఁ" అన్నచోట, పొందెడుము+అంచుఁ అని సరియైన పరిచ్ఛేదము. 'ఎడుము' అనురూపము కలదని యింతకుముందే తెలుపబడినది.

(3) వారు 'డుమ' అనుపద మొకటి యున్నట్లు చెప్పినారు.

ఆశీరాదులందు వచ్చునది 'ఎడుము' గాని, వట్టి 'డుమ' కాదు. వా రుదాహరించిన భారతప్రయోగ ములు మూడింటను ఉన్నది 'ఎడుమ'యే.

(4) అథర్వణుడు 'డుమ' అను మకారఘటిత మును విధించినాడనియు, అతని గ్రంథములో, 'డుమ కౌతా' విత్యాది కారికయున్నదనియు వ్రాసినారు.

కాని, వారిచే పరిష్కృతమైనవారి పీఠికతోనే 1921 లో ప్రకటితమైన వావిళ్ళవారి ప్రతిలో, ఆకారిక "డుజ్మకారా కౌవుతాద్యా ఆశీరర్థేతు సమ్మతాః" (అజన్త. ౬౬) అని యున్నది. అందు న్నది 'డుఙ్' గాని, 'డుమ' కాదు. "డుజ్మకారా = బిందుపూర్వక డువర్ణక మువర్ణకములు" అని, ఆ కారిక క్రింద టీకలో తెలుపబడియు నున్నది.

ఇట్లా నాడు, ఆ కారికనూ - దాని టీకనూ అంగీ కరించి, ప్రచురించిన శ్రీ శాస్త్రిగారు, ఈ ఆం. వ్యా. సం. స. లో, ఆ కారిక తప్పనియు - "డుమ కౌతౌ కౌవుతాద్యాః" అని తొలిపాఠమనియు, ఆ పాఠమును, నారాయణీయాంధ్ర వ్యాకర్తలు - సూత్రములోని 'డుమ' ప్రత్యయమును పరిశీలింపక "డుజ్మకారా కౌవుతాద్యాః" అనురీతిని దిద్దివేసి, తెల్గించినార నియు, లిఖించినారు. (మా. పుట. 1387)

ఇది పొరపాటు. నిజానికి, కారికను దిద్దినవారు శాస్త్రిగారు గాని, నారా. వ్యాకర్తలు కారు. దిద్దు బాటు సరైనది కాదు.

(5) "డుమేతరములందు (అనగా కౌవుతాదుల యందు) మవర్ణస్థితిని నిర్వహింపఁజాలు ప్రామాణిక ప్రయోగము కానరా" దన్నారు.

'కౌవుతము' - 'కౌతము' అను రూపములు కల వని నే నింతకు పూర్వమే తెలిపియున్నాను. ప్రయో

గము లిచ్చియున్నాను. ఆ ప్రయోగము లన్నియు ప్రామాణికములే.

(6) "పెక్కు తునియ లయ్యెడుము"-"ప్రసన్నుఁడయ్యెడుము" అను ప్రయోగములు సూరిపక్షమును నిరోధించుచున్న-వనుట సూరి విశేషవిధి 'ఎడున్' అను గ్రుతాంతరూపమునకు సంబంధించినది. ప్రయోగముల లోని 'ఎడుము' కళ. కావున సూరి సూత్రమునకును ఉదాహృత ప్రయోగములకును ఇలాకాలేదు. అవి సూరిపక్షమును నిరోధింపవు.

ఇంకను చర్చయెందుకు? శాస్త్రిగారి విపుల విమర్శలోను, ఎడు-తల సంధి సంగతి విశదము కాలేదు. కాని, అచ్చుపరమైన నకారము మకారముగ నన్న సూరిమాట పాటింపదగినది కాదని తేలినది.

## నాకు తోచినమాట

"పొందెడుమంచున్" - "కలిగెడు మనియె" మున్నగు ప్రయోగములలో నున్నది. "ఎడుము" గాని, సూరియనుకొన్న 'ఎడున్' కాదు. రామకృష్ణయ్యగారు ఫైలాలజీ పంథాలో సాధించిన-తమిళసంకరపు "ఎడుమ్" కానేకాదు. మల్లాది పండితులు భావించిన - 'ఎడుము' మారి యేర్పడ్డ - 'ఎడున్' కాదు. వజ్ఝల పండితులు వ్రాసిచ్చిన 'డుము' కాదు. 'ఎడుము' యును గాదు.

పై ప్రయోగములలో - ఎడుము + అంచున్ = ఎడుమంచున్; ఎడుము + అనియె = ఎడుమనియె - అని ఉకారసంధి.

ఇట్లే "కలుగుత మనియును" అన్న సూరి యుదాహరణలో నున్నదియు "తము" గాని 'తన్' గాదు. తము + అనియె = తమనియె - అని ఉకారసంధి.

సూరిగారు 'ఎడును' - 'తును' అనురూపము లుండుట నరయక, కలిగెడు మనియె; కలుగుత మనియు అన్న తావులలో సంధి నిర్ణయము కుదరక "స్థితస్య గతి శ్చింతనీయా" అన్నట్లు ఆ వాక్యములలోని 'ఎడు-తు'లు గ్రుతాంతములనియు, వాటిలోని మకారము గ్రుతిమున కాదేశముగా వచ్చినదనియు సూత్రించినారు. అది పొరపాటు. వారి పొరపాటే మన కలవాటయినది.

సూరి తెలుపనీ, ఆయన నిర్ణయమునకు లొంగనీ విశేషరూపములును గలవు.

## 1. 'కాత'

"ఎడుతలు గ్రుతాంతంబులగు" నన్న సూరి సూత్రము ప్రకారము 'కాత' గ్రుతప్రకృతికమే కావలెను. కాని, కళ గాగూడా ఉన్నది.

"దీవన కెడుమను గాతయుఁ
గావుతమును దెలుఁగులందు గలవు" (కేతన)

"ప్రోచుఁ గాత యనంగఁ బ్రోతువు గాతి నాఁ
బ్రోతును గాత నాఁ బోలుచు లిట్లు"
(ఆంధ్రభాషార్ణవము. 3.140)

"ఉనుగులకు మీఁద నొగిఁ గాతయున్న నా
శీర్వచనమునకును జెల్లునదియు"
(కావ్యా. చూడా. 9.158)

(వేదం వారి ప్రతిలో "కాఁత"యని సార్ధబిందువుగా నున్నది.)

"కవ యిది సఁగాంఘనం బగుఁ గాత యనుచు" పాంచు. (2.131) కాత, 'కాక'యను నర్థమునను ప్రయుక్తమైయున్నది.

"జాతి దొలంగుఁ గాత గుణశక్తి రసాతల సీమకుం జనుం గాత కులంబు బూదియగుఁ గాత నగంబుననుండి శీలముం బాతముఁ జెందుఁ గాత...బహుభంగుల విత్తమె మాకు మేలు" (భర్తృ. నీతి. 32)

జాతి తొలంగుఁ గాత=జాతి చెడితే చెడుగాక. ఇత్యాదిగా అర్థము.

## 2. 'ఎడుము' 'తము'

ఎడుము; తము - అనునర్థమునవే, అనగా ఆశీరాబులందు 'ఎడుము' - 'తము' అను రూపములును గలవు.

"ప్రసన్నుఁ డయ్యెడుము నాకు" (శాంతి 4. 222)

"స్థిరవు నయ్యెడుము నీకు" (అను. 2.287)

"ఉండెడుము కప్పలని" (అను. 3.143)

"అయ్యెడుము యినవుడు" (సౌప్తి 2.124)

"ఉండుఁ గావుతమ యఖండితముగ" (ఆది. 8.63)

ఈ 'ఎడుము' - 'తము' లనునవి, "ఎడుము-తము'లకు అవధారణ రూపములై యుండునని, అందు వల్లనే అత్వసంధి జరుగక యడాగమము గుచున్నదనియు నా యభిప్రాయము. క్రియాపదములకును అవధారణము కలదా? అన్న శంకకు, ఈ క్రింది ప్రయోగము వారకము.

"విను నీవదితి సుతుండవు
వినతా కొడుక నేను విడిసిఁ గెడు మనకున్
జనకుఁడు కశ్యపుఁ డొక్కఁడె
దనుజుల శోధించి చంపుదము యిరువురమున్"
(ఉద్యో. 3.295)

ఇరువురమున్ = మనమిద్దరమును, దనుజులన్, చంపుదము = చంపుదుము. (చంపెదు వారమే) అని యర్థము.

# "ఎడు-త"ల సంధివిచారణ

ఇక 'ఎడు - త'ల ద్రుతాంతత్వము సంగతి:— ఆశీరాద్యర్థములందు, ఎడు - తలకు ద్రుతాంతత్వము గలదు. తద్ధర్మార్థములందును 'ఎడు' ద్రుతాంతమే గదా! ద్రుతము (ను,న్) ఎక్కడున్నను, అచ్చు పరమగునపుడు నకారమే యగును. ఆ ద్రుతమునకు మకారమాదేశమగునన్న చిన్నయసూరి మాటయెన్నదగినది కాదు. ఈ యంశమును వజ్ఝలపండితులు తెల్పియే యున్నారు కాని, వారు చేయున్, ఇచ్చున్ వంటి తద్ధర్మక్రియలకే గాని, ఆశీరాద్యర్థకములుగా సూరి చెప్పిన - ఎడున్; తన్ - అనువానికి తగిన యుదాహరణము లియ్యలేదు. నేనిక్కడ ఉభయరూపములకును ప్రయోగము లిచ్చుచున్నాను.

'ఎడున్'

"నీ కిష్టావాప్తి యయ్యెడు నరుగు మనిన" (ఆర. 3.341)

(ఇచట, అయ్యెడును + అరుగుము - అనియు పదవిభాగము చెప్పవచ్చును. అప్పుడు స్వరసంధియగును. ఇట్లే తక్కిన ప్రయోగములలోను చూచుకొనునది).

"మత్ప్రసాదంబున...త్రిలోకహితంబైన కార్యం బొక్కటి నీచేత సాధితంబయ్యెడు నది యెయ్యది యనిన" (ఆర. 4.379)

"నీవలన నఖిలలోకంబులు సంతసిల్లెడు నని పలికి" (ఆర. 4.399)

"అర్యైకరూపంబు లలవడియెడు నెట్టున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగకుండునట్లుగా వరంబిచ్చితి" (ఆర. 7.464)

"అప్పటి కెల్లయిన నయ్యెడు నని యర్జునుండు" భీష్మ. (3.314)

"ఈ గంగయు నిప్పు డెట్లు నీకు భార్య యయ్యెడు ననినం దలంకి సముద్రుండు - నాకు నిది ప్రస్ఫుట వైజము గాని యేమియున్, గర్వము గాదు శాప మొసగం దగ దే" (హరి. పూ. అ. 5)

"భోగంబులు భవదిచ్ఛానుగుణంబులై యుం దొడనెడు నధిక" (హరి. ఉ. ఆ. 10)

"ఒక్క పుణ్యపురుషుండు...జనియించి వానికి మృత్యు వయ్యెడు ననిన" (హరి. పూ. ఆ 9)

"నీకుం, దనయుండు గాధి గలిగెడు, ననుపమ" (భాస్క. బాల. 325)

"తినగుచుండెడు నన వార లనుమతించి" (భాస్కర. బాల. 615)

"దురితంబయ్యెడు నెట్టు" (దశ. చ. 7. 93)

"ప్రసిద్ధంబయ్యెడు నం తవునంతకు" (దశ. చ. 12.26)

"పునర్దర్శనంబయ్యెడు నని పలికి" (శృం. నై 6.27)

"రాజపదభాజన మయ్యెడు నెల్ల కాలమున్" (భీమ. 6.49)

"మీ యిద్దరి ప్రశ్నంబులకు నుత్తరం బయ్యెడు నని" (పాండు. 2.4)

"ఇన్నియు శుభోదర్కంబు లయ్యెడునని" (పాండు 3.175)

"నీదు దేహంబంటక్, గావెఱపయ్యెడు నెంగిలి కేవల్గోర్చితిని" (కాశీ. 3.97)

"పరగుచుండెడు నాసుధాకరభానుతారక విశ్రుతిన్" (కావ్యా. చూడా. 9.175)

'తన్'

"గోపాలుఁడు ప్రోచుఁగావుత నపారకృపామతి" (భీమ. 1.3)

"హరినను రక్షించుఁగాత ననవరతంబున్" (వాసిష్ఠరామా. 1. ఆ.)

ఈ ప్రామాణిక ప్రయోగము లన్నియు, 'ఎడుత'ల ద్రుత మచ్చుపరమగు నపుడు నకారమగునని తెలుపుచున్నవిగదా! ప్రాగ్వకవుల ప్రయోగములకును, భాషాస్వభావమునకును విరుద్ధముగా, సూరిగారు - "మకారమగు" ననుటకు కారణమేమి? వేరె కారణమేమీ లేదు. ఆయనగారు, ఈ ప్రయోగములను పరికింపలేదు. పరికించియేయున్నచో ఆ విశేషవిధిని కల్పించియుండరు. అంతేకాదు. పై ప్రయోగములను చూచి, వాటిలోని సంధితప్పని భావించియున్నచో ఆ విషయమును తమ, 28 వ సూత్రము క్రింద ఉటంకించి యుండెడివారే.

చూడండి. 'ఉండి'కి 'ఉంచి' యనుట తగదంటూ - (కారక. సూ. ౧౧. క్రింద - "ఘనమునుంచి యని, యుంచి శబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని, యది సాధుకవి ప్రయోగ రూఢంబు గాదని యెఱుంగునది" అని వ్రాయలేదా!

అట్లే, "కలిగెడున్ + అనియె = కలిగెడుననియె; కలుగుతన్ + అనియె = కలుగుతననియె. అని కొందఱందురు గాని, అట్లనుట సరిగాదు. ఆ ద్రుతమునకు మకారాదేశము చెప్పచేసరి" యని యేల వ్రాసి యుండరు?

ఎందు కిన్ని మాటలు: ఈ ఎడు - తల విషయమున సూరిగారు ప్రమాదపడ్డారు. ఈ ప్రమదము వారు

తొలుత సంస్కృతభాషతో వ్రాసిన సూత్రగ్రంథము లోనే జరిగినది.

అందలి సూత్రము లివ్వి:—

"లోట్ లో డుశ్ఛో ద్రుతాంతౌ తు స్యాతా మేడుతవర్ణకౌ"

"పరస్యా చ్చే దుతయో ర్ద్విత్వా ద ఇక్కు స్తదా భవేత్"

ఈ రెండు సూత్రములకు తెనిగింపే, బాల.లోని 26, 28 సూత్రములు.

సూర్యరాయ నిఘంటువు, వావిళ్ళ నిఘంటువు కూడా "ఎడు. ద్రు, ఆశీశ్శాప సంప్రార్థనములందు క్రియాప్రత్యయములకువచ్చు ఆదేశము. దీనికి అచ్చు పరమైనచో 'మ' వచ్చును" అన్నవి - సూ. ని. "కావుత = కౌత. ద్రు. అగుధాతువుయొక్క ఆశీరార్థక ప్రత్యయాంతరూప" మన్నది.

ఈ 'కావుత' విషయమునమాత్రము వా. ని., సూ. ని. ననుసరింపక స్వతంత్రించి మెచ్చదగిన పని చేసినది. అది యేమనగా. 'కావుతము' అను రూపమునుగూడా చూపి, "కావుతము = కావుత (కౌత - ఆశీరర్థకము)" అని వివరించి:- "ఉండుఁగావుత మ్మఖండితముగ" అను భారత ప్రయోగమునుగూడా ఇచ్చినది. సూరి యెరుగనీ, సూ. ని. గుర్తింపనీ, శాస్త్రీయ శబ్దమును కనిపట్టి, సప్రయోగముగా జిజ్ఞాసులోకమున కందిచ్చిన వా. ని. శ్రద్ధాళుత కనేక ధన్యవాదములు.

సవరణ:—వా. ని. యిచ్చిన ప్రయోగములో ఒక చిన్నపాఠదోషమున్నది. "కావుత మ్మఖండితముగ" అను పాఠము తప్పు. 'కావుతము'నకు 'కావుతమ్ము' - 'కావుతంబు' అనురూపములు పుట్టవు. అట్టి రూపములు, వనము; వృక్షమువంటి శబ్దములట్టి మాత్రమే విహితములు. (బాల. తత్స. ౪౨)

"ఉండుఁ గావుతము అఖండితముగ" అన్నచో విసంధిదోషము పట్టునని, వ్రాతప్రతులలో ఆ విధముగా మార్పబడియున్నది కాబోలు!

శ్రీ వజ్ఝల పండితులు, ఆం. వ్యా. సం. స. (పు. 1389) లో, - "ఉండుగావుతమ యఖండితముగ" అను పాఠమును చూపి, - "ఉండుఁగావుత న్నఖండితముగ - అని కవిప్రయుక్త మనఁదగు" నన్నారు. ఆ సవరణయు సరియైనదికాదు.

"ఉండుఁగావుతమ యఖండితముగ" అనునదే సరియైన పాఠము. (1921. వావిళ్ళప్రతిలో ఆ పాఠమే యున్నది.)—శ్రీ తిరుపతి వేంకటకవులు 'భారత విశేషము' లను విమర్శగ్రంథములో, ఈ పాఠమునే పేర్కొని "అపూర్వ ప్రయోగ" మన్నారు. మరియు, "ఇటకావుతక్ + అని - అని యుండ మకారాదేశము వచ్చుటలోఁ జిక్కులేదుగాని, భారతమునందక్క వేఱొక్కచో నిట్టి ప్రయోగ మిట్టి పట్టున మృగ్యము" అనియు వ్రాసినారు. (అట్లు వ్రాయుట సూరి సూత్రమును బట్టియే

## సారాంశము

ఆశీరాద్యర్థములందగు 'ఎడు' వర్ణము,-'ఎడుము' (=ఎడుమ); 'ఎడును' అని ద్వివిధము.

అట్లే 'త' వర్ణమును, - 'తము' (=తమ); 'తను' అని ద్వివిధము.

ఎడుము + అనియె = ఎడుమనియె;
ఎడుమ + అనియె = ఎడుమనియె;
ఎడును + అనియె = ఎడునసియె;

అని అచ్ సంధిలో రూపములు. ('త' వర్ణమునకును ఇట్లేయని యెరుగునది.)

ప్రాచీనకాలమున - 'మేలయ్యెడుము నీకు' - 'అయ్యెడుమ యెల్లప్పుడు'; 'మేలుగావుతము మాకు' - 'కావుతమ యెపుడు' అను వాడుక యుండెడిది. అది క్రమక్రమముగా తగ్గిపోయినది. ఇప్పుడు బొత్తిగా లేదు. కాని, 'అయ్యెడు మనవరతము' - 'కావుత మనియె' ఇత్యాదిగా వాడుట యిప్పటికిని గలదు. మన మందరమును వాడుచునే యున్నాము. కాని, - అయ్యెడుక్ + అనవరతము; కావుతక్ + అనియె-అని పదవిభాగము తప్పుగాచేసి, సంధి తప్పుగా చెప్పుకొనుచున్నాము. మనల నా తప్పుదారికి లాగుచున్నవి సూరిగారి సూత్రములే.

కావున, "లూట్టు డుజ్ఞున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు"నన్న - 26 వ సూత్రమును,—

'లూట్టు డుజ్ఞున కెడుతవర్ణంబులు మువర్ణాంతంబులు, ద్రుతాంతంబులు నగు'—

అని సవరించి, "ఎడుతల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు"నన్న, 28 వ సూత్రమును తొలగించుట కర్తవ్యము.

అప్పుడు, ఎడుము - ఎడును; తము - తను - అను వానికి అచ్చు పరముగునపు డగునది సామాన్య సంధియే గావున, ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు.

ఇది నాకు తోచినమాట. భాషావేత్తలు విచారించి నిశ్చయింపవలసిన పెద్ద విషయము గావున ప్రచురించినాను. సత్యనిర్ధారణార్థము నే నీ వ్యాసమున, నాకు పరమపూజ్యులైనవారి యభిప్రాయములకు భిన్నముగా కొన్ని సంగతులు చెప్పక తప్పనదిగాదు.

# ఎవరు దోషి?

'సువర్ణశ్రీ'

(గతసంచిక తరువాయి)

పాత్రలు

నరసింహారావు:- నడివయస్సు మనిషి, సైంటిష్టు.

నారాయణరావు:- అతనితమ్ముడు, పడుచువాడు, నాటకాల పిచ్చిరాయుడు.

ముకుందరావు:-నరసింహారావు స్నేహితుడు, సమవయస్కుడు, మరొక సైంటిష్టు.

గోపాలరావు:- నరసింహారావుకు దూరపు బంధువు, సమవయస్కుడు, రాజకీయవేత్త.

ధర్మయ్య:- నరసింహారావు యింటి నౌకరు, ముసలివాడు.

జయరాం:- ఇన్స్పెక్టరు, నడివయస్సువాడు. ఒక కానిస్టేబులు.

నిర్మల:- నరసింహారావు భార్య.

రెండవ రంగం

[అంతా మొదటిరంగంలో మాదిరే వుంటుంది. గోడనువున్న కేలండరులో ఆ మరునాటి తారీఖు కనిపిస్తూవుంటుంది. వాతావరణ మంతా విషాద జనకంగా వుంటుంది. సన్నగా హృదయతంత్రులు కదిలించే వాద్యఘోష. తెర లేచేసరికి పోలీసు ఇన్స్పెక్టరు జయరాం ఒక కానిస్టేబులుతో ప్రవేశిస్తాడు.]

జ : ఏయ్ త్రీనాట్ ఫైవ్?

కా : యస్ సార్.

జ : రాత్రి పహారా జాగ్రత్తగా ఇచ్చారా?

కా : యస్ సార్.

జ : ఎవరైనా బైటకుపోవడానికి ప్రయత్నించారా?

కా : నో సార్.

జ : సరే. నీవు వెళ్ళి నిర్మలాదేవిగారి నిలా పిలు.

కా : యస్ సార్. (అంటూ లోనికివెళ్ళి నిర్మలతో ప్రవేశిస్తాడు. దీనంగా ఉదాసీనంగా ఆమె నడచి వస్తుంది.)

జ : (కానిస్టేబులుతో) సరే. నీవు వెళ్ళి బైటవుండు.

కా : యస్ సార్. (అంటూ బైటకు నిష్క్రమిస్తాడు.)

జ : నిర్మలాదేవిగారూ, మీ ఆవేదనను నేను అర్థం చేసుకొంటున్నాను. నా హృదయపూర్వకమైన సంతాపాన్ని అందజేసుకొంటున్నాను.

ని : (మాట్లాడదు.)

జ : కాని ఉద్యోగిగా నా విధ్యుక్తధర్మాన్ని నేను నిర్వర్తించకతప్పదు. మీరు మన్నించాలి.

ని : (మౌనం.)

జ : అంతులేని దుఃఖంలో మీ ఆత్మ మునిగిఉందని నాకు తెలుసు. అపారమైన ఆవేదన మీ కంఠానికి అడ్డుపడి మిమ్మల్ని మాట్లాడనీయడం లేదని నాకు తెలుసు. అయినా మీరు ధైర్యాన్ని తెచ్చుకోవాలి. మిమ్మల్ని మీరే ఓదార్చుకొని జీవితాన్ని ఎదుర్కోవాలి.

ని : (ఏడుస్తుంది.)

జ : ఏడ్చి మన మీ లోకంలో ఏమీ సాధించలేం. గుండెబలంతో మీ రీ ఏడుపును దిగమ్రింగుకోవాలి.

ని : (వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

జ : మీ రిలా విలపిస్తూవుంటే నా విచారణ సాగదు. మీరు మీ విచారాన్ని కొంచెం కట్టిపెట్టి నా ప్రశ్నలకు జవాబులిస్తే నేను మీకు చాలా కృతజ్ఞుణ్ణి.

ని : (మాట్లాడదు.)

జ : మీరు మౌనాన్ని విడచి దయచేసి మాట్లాడాలి. మీరు ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన భర్త

హత్యచేయబడితే, అపరాధిని కనిపెట్టడంలో మీరు మాతో సహకరించకపోవడం మీకు మీవారిపైగల భక్తివిశ్వాసాల కేమాత్రం నిదర్శనం కాదు.

ని : (బావురుమంటుంది)

జ : నా మాటలు మీకు కష్టం కలిగించాయిలా వుంది. మన్నించండి. మీ మౌనంతో మా కృషిని మరింత జటిలం చేస్తున్నారు. మాట్లాడండి. జరిగిన సంగతి నిర్భయంగా చెప్పండి. మీ భర్తను హత్యచేసిన పాపిని శిక్షించేందుకు తోడ్పడండి. మీ భర్తకు ఆత్మశాంతి కలిగించండి.

ని : (మరింత బిగ్గరగా ఏడుస్తుంది)

జ : మీరిలా ఏడుస్తూవుంటే నేనెలా నా ధర్మాన్ని నిర్వర్తించేది? (అటూ ఇటూ ఆలోచనగా పచార్లు చేస్తాడు.) పోనీలెండి. మీరు కాస్సేపు అటు కూర్చోండి. గుండె కుదుటబడింతర్వాత నే సమాధాన మిద్దురుగాని. ఏయ్ త్రీనాట్ ఫైవ్?

కా : (ప్రవేశించి) యస్ సార్.

జ : నీవు లోనికి వెళ్లి నారాయణరావుగార్ని తీసుకురా. (కానిస్టేబులు లోనికివెళ్ళి నారాయణరావును వెంటబెట్టుకొని వస్తాడు. జయరాంకు సాల్యూట్ చేసి నిష్క్రమిస్తాడు. నారాయణరావు, విచారంతోను, వెరపుతోనూ, వివర్ణమైన ముఖంతో జాలికలిగించేట్టుగా, హాస్యాస్పదంగా వుంటాడు.)

జ : నారాయణరావుగారూ! మీ అన్నగారి హత్య విషయం పోలీసులకు ఫోన్ చేసింది మీరే కదా.

నా : (బెదురుతూ) ఆఁ...అ...వు...ను.

జ : అంటే వారు హత్య చేయబడటం మీరు చూశారన్నమాట.

నా : అబ్బెబ్బే. లేదండీ.

జ : చూడనిదే అది హత్యే అని ఎలా అనుకొన్నారు?

నా : అయితే...అయితే...మా అన్నయ్య చావు... హత్య కాదంటారా?

జ : కాదనడం లేదు.

నా : మరి?

జ : హత్యచేయడం మీరు చూడకపోతే అది హత్యే అని ఎలా అనుకొన్నారు?.

నా : ఏమో సార్ నాకలా అనిపించింది.

జ : అయితే హత్యాసమయంలో మీరిక్కడే వున్నారన్నమాట!

నా : ఇక్కడే వున్నాను సార్.

జ : అప్పుడు మీరేం చేస్తున్నారు?

నా : నేనా? అబ్బెబ్బే! నే నేం చేయలేదండీ.

జ : నారాయణరావుగారూ భయపడకండి. నిజాన్ని చెప్పండి.

నా : నిజమేనండి.

జ : కాదు అని మీ కళ్లే చెపుతున్నాయి. నన్నెలా నమ్మమంటారు?

నా : అయితే...ఇన్స్పెక్టరుగారూ...నన్ను అనుమానిస్తున్నారా?

జ : అపరాధి ఎవరో అంతుచిక్కే వరకూ పోలీసు వారు అందర్నీ అనుమానిస్తూనే వుంటారు.

నా : నేను అపరాధిని కానండీ ఇన్స్పెక్టరుగారూ. నేను నిరపరాధినండీ.

జ : అయితే మీ నిరపరాధిత్వాన్ని రుజువు చేసుకోండి.

నా : ఎలా?

జ : మీరా సమయంలో ఎక్కడ వున్నదీ, ఏం జేసినదీ తెలియజేయండి.

నా : తెలియజేయమంటారా?

జ : ఓ. నిరభ్యంతరంగా.

నా : అంతా తెలియజేస్తే నాపై అనుమానం పోతుందా?

జ : తప్పకుండా; మీరు నేరస్థులు కాకపోతే.

నా : నేను నేరస్థుణ్ణి కానండీ.

జ : కానప్పుడు మీ రెందుకు భయపడాలి చెప్పండి. మీ రా సమయంలో ఏం చేస్తున్నారు?

నా : నేనాండి... నేను....

జ : చెప్పండి.

నా : నిన్న సాయంత్రం మా అన్నయ్యతో ఘర్షణ పడినమాట నిజమేనండీ.

జ : ఎందుకు?

నా : మేం ఢిల్లీలో జరిగే ఆలిండియా డ్రామా కాంపిటేషన్‌లో పాల్గొంటున్నామండీ. అందుకు....

జ : మీకు డబ్బు అవసరమైంది. అవునా?

నా : కరక్ట్ సార్. ఆ డబ్బును...

జ : మీ అన్నగార్నడిగారు.

నా : అవును సార్. ఇదంతా మీకెలా తెలిసింది?

జ : ఆ మాత్రం తెలుసుకోకపోతే ఇక మేమెందుకు? ఊఁ తర్వాత....

నా : ఒక్క అయిదువేలు ఇవ్వవలసిందిగా ప్రాధేయపడ్డాను.

జ : అయినా ఇవ్వలేదు.

నా : అవును సార్.

జ : మీ రిదివరలో ఎంత డబ్బడిగినా ఇచ్చేవారు కదా. ఇప్పుడెందుకీయలేదు?

నా : ఏమో సార్. ఎంత బ్రతిమాలినా ఇవ్వలేదు.

జ : కనుక మీకు కోపం వచ్చింది.

నా : అవును సార్. ఆ కోపంలో అన్నయ్యను హత్య చేయాలన్నంత....

జ : ఆవేశంకూడా వచ్చింది.

నా : అవును సార్. డబ్బీయకపోతే చంపైనా పట్టుకు పోతానన్నాను సార్.

జ : అయితే రాత్రి మీరు అందుకోసం మీ అన్నగారి గదికి వెళ్ళారన్నమాట!

నా : మళ్ళీ ఒకసారి డబ్బు అడిగి చూదామని వెళ్లాను సార్.

జ : అప్పుడుకూడా డబ్బీయకపోతే చంపివేయాలనుకొన్నారు. అవునా?

నా : కాదు సార్. ఏదోవిధంగా డబ్బు పట్టుకుపోదామనుకున్నాను.

జ : అంటే దొంగిలించాలనా?

నా : దొంగిలించో మభ్యపెట్టో పట్టుకుపోవాలనుకొన్నాను సార్.

జ : అంతేకాని చంపే ఉద్దేశం మీకు లేదా?

నా : లేదు సార్. ముమ్మాటికీ లేదు సార్.

జ : అయితే మీ రెన్నిగంటలకు మీ అన్నయ్యగారి గదిలోనికి వెళ్ళారు?

నా : సుమారు 11 గంటల ప్రాంతంలో సార్.

జ : ఏవైపునుండి వెళ్ళారు?

నా : ఈ హాలులోనించే సార్.

జ : మీ అన్నయ్యగారి గదికి వెనుకవైపున మరొక ద్వారం వుందికదా?

నా : ఉంది సార్.

జ : ఆ ద్వారగుండా మీరు వెళ్ళలేదా?

నా : లేదు సార్.

జ : ఎంచేత?

నా : ఆ ద్వారగుండా మా అన్నయ్యా, వదినా మాత్రమే మసలుతారు సార్.

జ : అయితే రాత్రి మీ అన్నగార్ని కలుసుకొన్నారా?

నా : లేదు సార్.

జ : ఎందుచేత?

నా : నే నింకా మా అన్నయ్యగదిలో ప్రవేశించనే లేదు సార్. ఈ హాలుదాటి మా అన్నయ్యగదికి ముందువున్న వసారాలోనికి అడుగుపెట్టాను. లోపల "ఢాం"మని పిస్టలు శబ్దం వినిపించింది. క్షణంసేపు నిస్తబ్ధుణ్ణైపోయాను. లైటువేసి లోనికి చూసేసరికి అన్నయ్యా నేలపై పడి వున్నాడు. ప్రక్కనే పిస్టలు కనిపించింది. హాలులోనికి వచ్చి చూద్దునుకదా వదిన అచేతనంగా పడివుంది. వెంటనే మీకు ఫోను చేశాను. ఇంతే సార్. ఇంతకుమించి నాకేమీ తెలియదు.

జ : అయితే మీరు రాత్రి మీ అన్నగార్ని కలుసుకోకుండానే హత్య జరిగిపోయిందంటారా?

నా : అవును సార్.

జ : అయితే మీ కెవరిపై అనుమానం వుంది?

నా : (మాట్లాడడు.)

జ : భయపడకండి. మీ కెవరిపైవుంది అనుమానం?

నా : నేను నిన్న సాయంత్రం మా అన్నయ్యా గోపాలరావుతో గొడవపడడం చూశానండీ. "నీవంటి దేశద్రోహి ప్రాణాలుతీసినా నేరంకాదు" అని గోపాలరావు అనడం విన్నానండి. అన్నయ్యా వెంటనే బాబాయికి ఒక చెంపపెట్టు కూడా తగిలించారు. నే వెళ్ళి అడ్డుపడగా అన్నయ్యా లోనికి వెళ్ళిపోయారు.

జ : గోపాలరావుగారికీ, మీ అన్నగారికీ వివాదమెందుకు వచ్చిందో మీకు తెలుసా?

నా : తెలియదు సార్.

జ : చెంపపెట్టు తిన్నతరవాత గోపాలరావుగారేమన్నారు?

నా : "దెబ్బ తగిలిందా బాబాయ్. విచారించకు" అన్నాను సార్. అంతే గోపాలరావుగారు "నాకు దెబ్బతగిలిందని నేను విచారించడంలేదు నాయనా. మీ అన్నయ్యగురించే విచారిస్తున్నాను" అన్నాడు సార్. ఆ మాట కప్పుడర్థమే కాలేదు.

జ : అయితే మీరీ హత్యలో గోపాలరావుగార్ని అనుమానిస్తున్నారన్నమాట.

నా : అంతేకాదు సార్.

జ : మరేమిటి?

నా : నేను లైటువేసిన వెంటనే కిటికీద్వారా ఎవరో దూకిన చప్పుడైంది సార్. ఎవరా అని కిటికీ నుండి చూద్దునుగదా ముకుందరావుగారు హడావుడిగా పారిపోతున్నారు సార్.

జ : (కిటికీవద్దకు వెళ్ళి చూస్తాడు) హత్య జరిగిం తర్వాత ముకుందరావుగారు తోటలో పారిపోతూ మీకు కనిపించారా?

నా : ఔను సార్.

జ : మీరు సరిగా చూశారా?

నా : కళ్ళారా చూశాను సార్.

జ : ఎటువైపు పారిపోతుండడం మీరు చూశారు?

నా : గెస్టుహౌజ్ వైపే సార్.

జ : (తల పంకిస్తాడు) ఊఁ! ఇంకా మీరు చెప్పవలసింది ఏమైనా వుందా?

నా : నాకు వాళ్ళిద్దరిపైనే బాగా అనుమానం సార్.

జ : నారాయణరావుగారూ, మీరు నిర్దోషులపై నేరంమోపి తప్పించుకోవడానికి ప్రయత్నించకండి.

నా : అయితే మీ కింతకూ వారిపై అనుమానం కలగడం లేదా?

జ : లేదు.

నా : ఎందుచేత ?

జ : ఈ హత్య మీరే చేశారు కనుక.

నా : అన్యాయం ఇన్స్పెక్టర్. అన్యాయం. నేను నిర్దోషిని సార్. నిర్దోషిని.

జ : నిజం రుజువు కానంతవరకూ అందరూ నిర్దోషులే.

నా : మీరు పొరబడుతున్నారు సార్. నేను మా అన్నయ్యను చంపలేదు సార్.

జ : అయితే వారిద్దరూ మీ అన్నగార్ని చంపారంటారా?

నా : ఏమో సార్. అది నా అనుమానం సార్.

జ : అనుమానమే కాని యదార్థం తెలియదు. మీరు మాత్రం మీ అన్నగార్ని ఎందుకు చంపివుండకూడదు?

నా : ముమ్మాటికి చంపలేదు సార్.

జ : మీరసలే మహానటులు. ఇదికూడా నటన కాదని నేనెలా నమ్మేది?

నా : నాది నటన కాదు సార్. నా మాట నమ్మండి సార్.

జ : నారాయణరావుగారూ ఎందుకండీ అంత బేజారై పోతారు? మీరు చెప్పినవారిని అనుమానించడానికి ఎంత ఆస్కారముందో మిమ్మల్ని అనుమానించడానికి అంతే ఆస్కారముంది. మీరే ఈ హత్యచేసి గోపాలరావు ముకుందరావుల పైకి నేరాన్ని నేర్పుగా నెట్టివేస్తున్నారేమోనని నా అనుమానం.

నా : నన్ను మీరు నమ్మకపోతే నేనేం చెయ్యను సార్? (దీనంగా ముఖం పెడతాడు.)

జ : (నారాయణరావును పరీక్షగా చూస్తాడు. అనునయంగా) విచారించకండి నారాయణరావుగారూ! నా ఉద్యోగరీత్యా మీకు కొంచెం బాధ కలిగించవలసి వచ్చింది. మన్నించండి. ఇక మీరు లోనికి వెళ్ళవచ్చు.

నా : చిత్తం సార్. (నిష్క్రమిస్తాడు)

జ : ఏయ్ త్రీనాట్ ఫైవ్?

కా : (ప్రవేశించి) యస్ సార్.

జ : గెస్టుహౌజ్ లోని ముకుందరావుగార్నిలా తీసుకురా.

కా : (బైటకు వెళ్ళిపోతాడు.)

జ : (నిర్మలతో) విన్నారుకదా మీ మరదిగారి వాఙ్మూలం? ఇప్పుడైనా చెప్పండి ఎవరు హత్య చేశారంటారు?

ని : (మాట్లాడదు)

జ : మీ అనుమానంకూడా వారిపైనే వుందా?

ని : (ఏడుస్తుంది కానిస్టేబిలు ముకుందరావుతో ప్రవేశించి జయరాంకు సాల్యూట్ చేసి వెళ్ళిపోతాడు.)

జ : ముకుందరావుగారూ, మీకీ హత్యగురించి ఏం తెలుసు ?

ము : నా కేమీ తెలియదు.

జ : పోనీ హత్యాసమయంలో మీ రెక్కడున్నదీ ఏం చేసినదీ తెలియజేయండి.

ము : అందువలన మీకు ప్రయోజనం లేదనుకుంటాను.

జ : ప్రయోజన మున్నదీ లేనిదీ నేను నిర్ణయించుకోగలను. మీరా సమయంలో కిటికీనుండి తోటలోనికి దూకి పారిపోవడం చూసినవా రున్నారు. ఇందుకు మీ రేమంటారు?

ము : అంతమాత్రాన హంతకుణ్ని నేనే నంటారా?

జ : అయితే మీ రలా పారిపోయినమాట నిజమేనన్నమాట. నేరం చేయకపోతే మీ రలా ఎందుకు పారిపోవలసివచ్చింది.

ము : ఇన్స్పెక్టరుగారూ, మీరు నన్ను అవమానపరుస్తున్నారు.

జ : మన్నించండి. మిమ్మల్ని అవమానపరచడం నా వుద్దేశం కాదు. నా ప్రశ్నకు జవాబివ్వండి.

ము : నరసింహారావు నా బాల్య స్నేహితుడు. అతన్ని నేనే చంపుకొంటా ననుకొంటున్నారా ?

జ : అయితే మీ రెందు కలా పారిపోవలసివచ్చింది ?

ము : ఏవో కారణాంతరాలచే పారిపోయిన వారందరూ నేరస్థులు కారు ఇన్స్పెక్టర్. ఇది మీరు తెలుసుకోవడం మంచిది.

జ : నేరవిచారణ సమయంలో డొంకతిరుగుడుగా సమాధానాలీయడం శ్రేయస్కరం కాదని మీరు తెలుసుకోవడం మంచిది.

ము : హుఁ! మీరెవరితో మాట్లాడుతున్నారో తెలుసా?

జ : తెలుసు. ప్రఖ్యాత సైంటిస్టు ముకుందరావు గారితో.

ము : మర్యాద హద్దుల్ని మీరి మాట్లాడితే నేను సహించను.

జ : మర్యాద హద్దుల్ని మీరవలసిన అవసరం నాకు లేదు. అయినా మీరు సహించనంతమాత్రాన నా విచారణ విరమించబోను.

ము : విచారణ! హంతకునికోసం విచారించడం మాని అనవసర విషయాలను త్రవ్విపోయడమే విచారణా?

జ : నేను సాగించే విచారణ హంతకునికోసమే.

ము : అయితే మీరు ఎలుకకోసం కొండ త్రవ్వుతున్నారన్నమాట.

జ : కొండ ఎలుకలు కొండల్లోనే వుంటాయనే సంగతి మీకు తెలుసనుకొంటాను.

ము : ఎదుట కనిపించే ఎలుకకోసం ఎక్కడెక్కడో వెదకడం వ్యర్థప్రయాస!

జ : నా ఎదుట వున్నది నాకు కావలిసిన ఎలుకే నన్నమాట.

ము : మీరు నా వ్యంగ్యాన్ని గ్రహించలేదు.

జ : గ్రహించినదీ లేనిదీ మీకనవసరం.

ము : పోనీ సూటిగా హంతకుడెవరో చెప్పమంటారా?

జ : తెలిస్తే చెప్పండి. మీ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోండి.

ము : (జయరాంకు దగ్గరగా జరిగి) హంతకుడు మరెవరో కాదు.

జ : ఎవరు?

ము : నారాయణరావే.

జ : ఎందువల్ల?

ము : నిన్న దురదృష్టవశంగా నా మిత్రుడు నరసింహారావుకీ నారాయణరావుకీ జరిగిన సంఘర్షణ నా కళ్ళబడింది. అప్పుడు నారాయణరావేమన్నాడో తెలుసా?

జ : బహుశా "మీ మిత్రుని చంపివేస్తా" నని వుంటాడు.

ము : యువర్ ప్రెజంప్షన్ ఈజ్ క్వైట్ కరక్ట్. సరిగా అదే అన్నాడు. తనకా రాత్రి డబ్బీయక పోతే అతన్ని చంపి మరీ డబ్బు తీసుకుపోతానన్నాడు. ఆ మాటలు స్వయంగా నేను విన్నాను.

జ : అందువలన నారాయణరావే నరసింహారావును హత్య చేశాడని మీ నమ్మకం.

ము : నమ్మకం కాదు. యదార్థమే.

జ : అని ఎలా చెప్పగలరు?

ము : నిజం చెప్పమంటారా?

జ : చెప్పండి.

ము : నరసింహారావు గడిచిన పదేళ్ళలో చేసిన పరిశోధన ఫార్ములా నాకు రాత్రి చూపిస్తానని వాగ్దానం చేశాడు.

జ : చూపించారా?

ము : లేదు. అతని గదికి ముందుగల వసారాలోకి వెళ్ళే సరికే పిస్టలు పేలిన శబ్దం వినిపించింది.

జ : వెంటనే మీరు తోటలోనికి దూకి పరుగు పెట్టారు. అవునా?

ము : అవును. ఆ పిస్టలు శబ్దం నాకు భయం కలిగించింది. ఆ భయంలో నేనేం చేయవలసినదీ నాకు తెలియలేదు. అందుకే అలా పరుగుపెట్టాను.

జ : ఊఁహు.

ము : కాని తోటలోనికి దూకీదూకగానే లైట్లు వెలిగాయి. ఎవరా అని వెను దిరిగి చూశాను. హాలులో హడావుడిగా తిరిగే నారాయణరావు కనిపించాడు.

జ : మరెవరూ కనిపించలేదా?

ము : ఆఁ కనిపించారు.

జ : ఎవరు?

ము : నేనలా కిటికీనుండి దూకినప్పుడే మరొక కిటికీ నుండి కూడా ఎవరో దూకిన శబ్దం వినిపించింది.

జ : అయితే మీరు తోటలో పరుగెత్తేటప్పుడు మీకా మనిషి కనిపించలేదా?

ము : కనిపించాడు.

జ : ఎవరతను?

ము : ఈ ఇంటి నౌకరు.

జ : ఓహో!

ము : నన్నడిగితే ఇది ఈ యింటి నౌకరూ, నారాయణరావూ కలసి చేసిన హత్యలా కనిపిస్తోంది.

జ : మీరీ ఇంటికి అసలు ఎందుకు వచ్చినట్లు?

ము : చెప్పానుగా. నరసింహారావు ఆ బాల్యమిత్రుడు. అతణ్ణి చూసి పదేళ్ళయింది. అతని యోగక్షేమాలు

చూడడానికి వచ్చిన నాకు అతని చావు చూడవలసి వచ్చింది.

జ : ఈ పదేళ్ళుగా మీ రతన్ని కలుసుకోనేలేదా?

ము : లేదు.

జ : మీ కలహాన్ని మర్చిపోవడానికి మీకు పదేళ్ళు పట్టిందన్నమాట.

ము : మేం కలహించుకోలేదే!

జ : నే నామాత్రం ఊహించలేనా? ఏ కలహం లేనిదే మీ ప్రాణమిత్రుని మీరు పదేళ్లుగా కలుసుకోకుండా వుండగలరా?

ము : మా మధ్య వివాదం లేదు.

జ : నేను నమ్మను.

ము : పదేళ్ళక్రితం అతడూ నావద్ద పనిచేసేవాడు.

జ : అవును. ఆ సమయంలోనే మీరు సూర్యరశ్మిలోని ఉష్ణతను ఎలా భయంకరశక్తిగా మార్చుకోవచ్చునో పరిశోధన జరిపించారు.

ము : అది నేనే జరిపించాను. అందులో నరసింహారావుకు భాగం లేదు.

జ : ఆ తర్వాతనే మీరు విడిపోయివుండాలి.

ము : అవును. అప్పటినుండీ తిరిగి కల్సుకోలేదు.

జ : అప్పటినుండీ నరసింహారావుగారు ఏం చేసినదీ మీకు తెలుసా?

ము : సరిగా తెలియదు. కాని ఏదో తీవ్రపరిశోధనలో మునిగివున్నాడని మాత్రం తెలుసు.

జ : ఆ పరిశోధన ఫార్ములా తెలుసుకోవడంకోసమే మీ రిక్కడకు వచ్చారు. అవునా?

ము : కాదు.

జ : మరి?

ము : కేవలం చూడాలనే వచ్చాను. అతడే నన్నిక్కడే వుండి ఫార్ములాను చూసి వెళ్ళమన్నాడు.

జ : (అతడు మాట్లాడుతూవుండగా పరీక్షగా చూస్తాడు) మీ రబద్ధమాడుతున్నారు.

ము : అబద్ధం చెప్పవలసిన అవసరం నాకు లేదు.

జ : ఎందుకు లేదు?

ము : నే నెందుకబద్ధం చెప్పాలి?

జ : మీరే నరసింహారావుని...

ము : హత్యచేసి అబద్ధమాడుతున్నానంటారు.

జ : ఎందుకు కాకూడదు? నరసింహారావు ఇంత కాలం చేసిన పరిశోధన ఫార్ములాను చేజిక్కించుకోవడం కోసం మీరే అతణ్ని హత్యచేసి వుంటారు.

ము : ఏమన్నారు?

జ : ఏమీ అనలేదు. మీరు చేసిన నేరాన్ని నారాయణరావు ఇంటి నౌకర్ల తలపై వేస్తున్నారంటున్నాను. అంతే.

ము : మర్యాదగా మాట్లాడండి. నే నెవర్నో తెలుసా?

జ : తెలిసే మాట్లాడుతున్నాను.

ము : మీ పోలీసుల నైజమే ఇంత కాబోలు. హత్య చేసిం దొకరైతే అనుమానం మరొకరిపై నేరస్థుడొకడైతే శిక్ష మరొకడికి. మీ బెదిరింపులకు బెదిరిపోవడానికి ఈ ముకుందరావేం మూర్ఖుడు కాదు. జాగ్రత్త.

జ : జాగ్రత్తగా వుండవలసింది నేను కాదు. మీరు. చట్టంముందు నేరస్థులందరూ ఒక్కటే, మీ రెంత సైంటిస్టులయినా నేరస్థులయితే మా సంకెళ్ళనుండి తప్పించుకోలేరు. ఇక మీరు వెళ్ళవచ్చు. (ముకుందరావు జయరాంను కొరకొరా చూస్తూ బైటకు నిష్క్రమిస్తాడు.)

జ : ఏయ్, త్రీనాట్ ఫైవ్, బైట తోటగుడిసెలో వున్న ఇంటి నౌకరును తీసికొని రా. (కానిస్టేబులు ప్రవేశించి "యస్ సార్" అని నిష్క్రమిస్తాడు.)

జ : విన్నారు కదా నిర్మలాదేవిగారూ. మీ అనుమానం ఎవరిపైన?

ని : (మాట్లాడదు.)

జ : ఈ ముకుందరావుగారే హత్య చేసివుంటారంటారా? లేక మీ మరదిగారా?

ని : (మౌనం. కానిస్టేబులు ధర్మయ్యను తీసుకవచ్చి వెళ్ళిపోతాడు.)

జ : నీ పేరేమిటి?

ధ : ధర్మయ్య బాబూ!

జ : నీ వెంతకాలంగా ఈ ఇంట్లో పనిచేస్తున్నావ్

ధ : సుమారు పదేళ్లనుంచి బాబూ.

జ : నీవు నరసింహారావుగారి నమ్మినబంటువన్నమాట!

ధ : చిత్తం బాబూ.

జ : నీకీ హత్యగురించి ఏం తెలుసు?

ధ : నాకేం తెలీదు బాబూ.

జ : పోనీ నరసింహారావుగారి విరోధు లెవరో చెప్పగలవా?

ధ : నాకెట్టా తెలుస్తుంది బాబూ?

జ : పదేళ్ళుగా నరసింహారావుగారు ఈ ఇంట్లో ఎవరితోనూ గొడవ పడడం నీవు చూడలేదా?

# ఎవరు దోషి?

ధ : నూణ్ణేదు బాబూ. ఆరికేం మారాజు! అడిగినోళ్ళకు అడిగినంతా ఇచ్చేడమేగాని లేదనడం ఎరగరు! ఆరి కెవరుంటారు బాబూ ఇరోదులు!

జ : అడిగింది ఇచ్చినంతమాత్రాన అందరూ మిత్రులైపోరు ధర్మయ్యా.

ధ : తస్సాదియ్యా అదేంమాట బాబూ.

జ : అవును ధర్మయ్యా. మంచివారికి శత్రువులు మరీ ఎక్కువగా వుంటారు.

ధ : తస్సాదియ్యా. మాయదారి కాలం బాబూ. మంచోళ్ళకు రోజులు కావు.

జ : అందుకనే నరసింహారావుగారికి కూడా విరోధులుండి తీరాలి. బహుశా వారు నిన్నకూడా, ఎందరితోనో ఘర్షణపడివుంటారు. నీవు గమనించ లేదా ?

ధ : తస్సాదియ్యా మరిసేపోనాను బాబూ. పదేళ్లుగా ఆరు కోపగించుకోడం సూణ్ణేదుకాని బాబూ...

జ : నిన్ననే చూశావు.

ధ : అవును బాబూ.

జ : నిన్న నరసింహారావుగారు ఎవరితో ఘర్షణ పడ్డారు ?

ధ : ముకుందంగోరితో బాబూ.

జ : ఎందుకో తెలుసా ?

ధ : మా బాబుగారు ఇన్నాళ్ళూ కట్టపడి సేసిన పాటునీ ముకుందంగోరీయమన్నారంట బాబూ.

జ : మీ బాబుగారియ్యనన్నాడు, అంతేనా ?

ధ : తస్సాదియ్యా. ఎట్టా ఇత్తారు బాబూ! పాటొకరిదీ ఫలిత మొకరిదీనా ?

జ : ఆ పాటు ఏఁవిటో నీకు తెలుసా ?

ధ : తస్సాదియ్యా. అది నా కెట్టా తెలుత్తుంది బాబూ. ఏదో పరిశోధనంటారు బాబూ అది.

జ : సరే. అది మీ బాబుగారియ్యనంటే ముకుందరావుగారేం చేశారు ?

ధ : ఇవ్వకపోతే ఈ రాత్రే నిన్ను సంపేత్తాను. జాగర్త సూస్కో అని బెదరించేడటండీ.

జ : అయితే అతనే చంపాడంటావా?

ధ : అట్టానే అయ్యుండాలి బాబూ. లేకపోతే రాత్రి ముకుందంగోరు బాబుగారి గది కెందుకెళ్ళాడంట!

జ: (తల పంకిస్తాడు) నీవుకూడా ఆ గదికి వెళ్ళావన్నమాట.

ధ ! (కంగారుపడి) లేదు బాబూ.

జ : (తీక్ష్ణంగా చూస్తూ) ధర్మయ్యా అబద్ధం చెప్పకు.

ధ : చి...చి...చిత్తంబాబూ.

జ : నీవు వారిగది కెందుకు వెళ్ళావు?

ధ : ఆరి గదిలో కెళ్ళలేదు బాబూ.

జ : మరెక్కడకు వెళ్ళావు ?

ధ : ఆరి గదిముందు వసారాలోనికి ఎళ్ళేసరికి డామ్మని పిత్తోలు మోగింది బాబూ. దాంతో ఒకటే లగెత్తుకుపోనాను.

జ : ఆ సమయంలో నీ కెవరూ కనిపించలేదా ధర్మయ్యా.

ధ : ఆఁ కనిపించారు బాబూ. తోటలో ముకుందం గారూ నా లాగే లగడుతున్నారు. లైట్లు వెలగానే తిరిగి సూశాను. గోపాలరావుగారు లోనికి లగడుతున్నారు.

జ : గోపాలరావుగారు లోనికి పారిపోతున్నారా ?

ధ : అవును బాబూ.

జ : అసలు నీవెందుకు అక్కడికి వెళ్లావు ధర్మయ్యా?

ధ : (బెదురుతూవుంటాడు. మాటాడడు.)

జ : నిజంచెప్పు. ఎందుకెళ్ళావు?

ధ : బాబుగారు ఓమాట అన్నారు బాబూ, మీతో సెప్పకూడదు.

జ : నేను ముందే అనుకొన్నాను. అందుకే నీవు వారితో పోట్లాడేవు.

ధ : నిజం బాబూ. తస్సాదియ్యా. ఎంతనౌకరునుండా వోణ్ణి అయితేమాత్రం నాకు మానాబిమానాలు నేవంటారా ?

జ : ఎందుకు లేవు? నౌకరీ చేసినంత మాత్రాన లోకువమాటలు పడతామా?

ధ : పట్టిలోకువమాట లేకాదు బాబూ. తస్సాదియ్యా. తస్సాదియ్యా నాకూతురు సీతిని అయ్యగారి కమ్ముకోవాలంట!

జ : ఎందుకో తెలుసుకొన్నావా?

ధ : ఆయన ఏడకో పరదేశానికి పోతారంట. ఆడకు తీసుకుపోతారంట!

జ : అందుకు నీ వూరుకున్నావా ధర్మయ్యా?

ధ : ఎట్టా వూరుకొంటాను బాబూ! మా సీతిపై సేయి వేసేరా పేణాలు దక్కవన్నాను.

జ : మంచిమాటన్నావు ధర్మయ్యా. (అధికారంగా) ఇప్పుడు చెప్పు, నీవతని ప్రాణంతీయడం కోసమే కదా అక్కడకు వెళ్లింది?

ధ : లేదు బాబూ. (వణుకుతాడు)

జ : మరెందుకు?

ధ : నేనొగ్గక పోయినా మా సీతిని మాయందరికన్నూ గప్పి శేత్రి తీసుకుపోతా నన్నారు బాబూ! అట్టాంటప్పుడని ఏది సేత్తారో అని అర్కి కనిపెట్ట డానికెళ్ళాను బాబూ.

జ : వారిని చంపడానికి వెళ్ళలేదా ?

ధ : నేదు బాబూ, మీతోడు. నేను నిన్నే ఈ నౌకరీ ఒగ్గేసి పోతానన్నాను బాబూ, నన్ను పోనిచ్చారు కాదు.

జ : నిన్ను పోనివ్వనిది ఎవరు ?

ధ : గోపాలరావుగోరూ నిర్మలమ్మగోరూ బాబూ.

జ : ఎందుకు పోనివ్వలేదు ?

ధ : "సానావిళ్ళనుండి ఈడనే వున్నావు. అయ్యగా రెదో అన్నారని ఇప్పుడందర్నీ ఒదిలిపోతావా" అని ఆపుసేశారు బాబూ.

జ : లేకపోతే నిన్న ఈ ఇల్లువదలి పోదల్చుకొన్న వాడివే నన్నమాట.

ధ : ఔను బాబూ.

జ : నీకూతుర్ని అంతమాటన్నందుకు వారిపై నీకు పగలేదా ధర్మయ్యా ?

ధ : అరిమాట అరికేవుంటుంది బాబూ. నాదారి నేను. అరిజోలి నాకెందుకు ?

జ : నీవు కాబట్టి ఆ మాటలకు వూరుకున్నావు కానీ ధర్మయ్యా మరొకడైతే వారి రక్తం త్రాగి వుండును.

ధ : నాకూ పౌరుసం వుండాది బాబూ. అయినా ఇంతకాలం అరి ఉప్పూ పులుసూతో బతికేను బాబూ. అమాత్తరం ఇస్వాసం నేకపోతే ఎట్టా బాబూ.

జ : (అధికారంగా) ధర్మయ్యా!

ధ : ఏం బాబూ?

జ : నీవీ హత్య చేయలేదా?

ధ : నేదు బాబూ.

జ : నీవే ఈ హత్యచేసి ముకుందరావుగారిపై నేరం వేయడంలేదా?

ధ : నేదు బాబూ. సత్తెప్రమాణంగా నేదు.

జ : (పరీక్షగా చూస్తాడు) అయితే నీవు వెళ్ళవచ్చు. (ధర్మయ్య లోనికి నిష్క్రమిస్తాడు)

జ : ఏయ్ త్రినాట్ఫైవ్, లోపలికి వెళ్ళి గోపాలరావుగార్ని తీసుకురా.

కా : (ప్రవేశించి, లోనికి నిష్క్రమిస్తాడు)

జ : (నిర్మలతో) ఏమండీ నిర్మలాదేవి గారూ అంతా వింటూ మాట్లాడరేమండీ. దోషి ఎవరంటారు?

ని : (మాట్లాడదు)

జ : తెలిసి వూరుకొంటే మంచిదికాదు

ని : (మౌనం. కానిస్టేబిలు గోపాలరావును తీసికొని వచ్చి నిష్క్రమిస్తాడు)

జ : గోపాలరావుగారూ. మీరు నరసింహారావు గార్ని ఆఖరుసారిగా ఎప్పుడు కలుసుకొన్నారు?

గో : నిన్న సాయంత్రం.

జ : తిరిగి రాత్రి మీరు వారిని కలుసుకోలేదా?

గో : లేదు.

జ : మీ రబద్ధం చెప్తున్నారు.

గో : లేదు.

జ : (నవ్వుతూ) హహ్హహ! అందరూ ఒకేమాట!

గో : పుట్టెడు దుఃఖంలో మునిగివున్న మమ్మల్ని చూస్తే మీకు నవ్వు వస్తోందా?

జ : క్షమించండి. మిమ్మల్ని చూసి నాకు నవ్వు రాలేదు.

గో : మరెవర్ని చూసి?

జ : మానవస్వభావాన్ని చూసి.

గో : నాలో మీకు వింతగా కనిపించిన స్వభావ మేమిటి?

జ : మీలోనే కాదు. అందరిలోనూ ఒకే ధోరణి. నేరస్థులూ, నిర్దోషులూ కూడా ఒకే మాట అంటారు.

గో : ఏమిటది?

జ : నేరంసంగతి తమకు తెలియదని?

గో : అయితే నేనే ఈ నేరం చేశానని మీ అనుమానం?

జ : కావచ్చు. పోలీసుల అనుమానాలకు అంతెక్కడ?

గో : ఇన్స్పెక్టర్ నేనెవర్నో తెలుసా?

జ : తెలియకేం తెలుసు. మరి నేనెవర్నో తెలుసా?

గో : తెలుసు.

జ : తెలిస్తే మంచిదే. మీరసలీ యింటికి ఎందుకు వచ్చారు ?

గో : బంధువులయింటికి ఎందుకు వస్తారు? చూడాలని.

జ : ఎప్పుడు వచ్చారు ?

గో : రెండురోజులైంది.

జ : నిన్న మీరు నరసింహారావుగారితో మాట్లాడారా ?

గో : మాట్లాడాను.

జ : ఏం మాట్లాడేరు?

గో : అది మీ కనవసరం.

జ : పోనీలెండి. మీ రిద్దరూ నిన్న ఘర్షణపడినమాట నిజమేనా?

గో : అలాఅని ఎవరన్నారు?

జ : ఎవరంటే మీ కెందుకు? నిజమేనా?

గో : ఏదో మాటపైమాట పెరిగింది. అంతే.

జ : ఏ ఘర్షణైనా అంతే. మీ ఘర్షణకు కారణం?

గో : కాకతాళీయంగా ఏర్పడినదానికి కారణమేముంటుంది?

జ : మీ ఘర్షణ కాకతాళీయమైనది కాదు.

గో : మరి?

జ : ఉద్దేశపూర్వకమైనదే.

గో : అని మీ నమ్మకం.

జ : నమ్మకమే కాదు. యదార్థంకూడా. సామాన్య ఘర్షణకు చెంపపెట్టు లభించడం అరుదు.

గో : (దెబ్బతిన్నట్టు ఫీలవుతాడు)

జ : ఆ సమయంలో మీ రతనితో 'నీ వంటి దేశద్రోహిని చంపినా నేరంకాదని' అన్నారు. అవునా?

గో : ఈ సంగతి మీకు నారాయణరావు చెప్పాడా?

జ : ఎవరు చెపితేనేం మీరన్నమాట నిజమేనా?

గో : నిజమే.

జ : అయితే నరసింహారావుగారు చేసే దేశద్రోహం మీకు తెలుసన్నమాట.

గో : (మాట్లాడడు)

జ : ఆ విషయంపైనే మీరు వారితో ఘర్షణ పడ్డారు. మిమ్మల్ని సహించలేక వారు మిమ్మల్ని అవమానపరచారు. ఏమంటారు?

గో : నే నేమీ అనను.

జ : మీ దేశాభిమానాన్ని నేను అభినందిస్తున్నాను.

గో : మీ అభినందనతో నాకు నిమిత్తం లేదు.

జ : అయినా మీ కృషికి దేశం మిమ్మల్ని అభినందించక మానదు.

గో : ఎందుకు?

జ : బంధుత్వంకంటె, వ్యక్తిగతాభిమానాల కంటె దేశభక్తి గొప్పదని మీరు నిరూపించారు.

గో : నన్ను పొగడ నారంభించి మీరువచ్చినపని మర్చిపోతున్నారు.

జ : లేదు. పూర్తిచేసుకొంటూనే వున్నాను. ఇప్పుడు చెప్పండి. మీరు వార్ని దేశంకోసం హత్య చేయడానికి వెళ్ళారు. అవునా?

గో : అబద్ధం.

జ : అయితే మీరు రాత్రి నరసింహారావు గదికి ఎందుకు వెళ్ళారు.

గో : వెళ్ళలేదు.

జ : వెళ్ళారు. అక్కడనుండి పారిపోతూ మీరు ఈ హాలుగుండా లోనికి పోవడం చూసిన సాక్షులున్నారు.

గో : (మౌనం)

జ : మాట్లాడరేం. మీరతన్ని హత్యచేయడానికి బైలుదేరారు. హత్యచేశారు. కంగారుగా పరుగెత్తారు.

గో : లేదు. నేను హత్య చేయలేదు.

జ : మరెందుకు వారి గదికి వెళ్ళారు?

గో : రాత్రి అతన్ని మళ్లీ ఒకసారి కలుసుకోవాలనుకొన్నాను.

జ : కలుసుకొన్నారా?

గో : లేదు. వారి గదిలోనికే వెళ్ళలేదు.

జ : మరెక్కడకు వెళ్ళారు?

గో : వారి గదికి ముందున్న వసారాలోనికి వెళ్ళగానే పిస్టలు పేలిన శబ్దం వినిపించి వెనుదిరిగాను.

జ : మీరు వారి గదిలోనికి ప్రవేశించనే లేదా?

గో : లేదు.

జ : నిజం చెప్పండి.

గో : నిజమే.

జ : నాకు నమ్మకంలేదు.

గో : అయితే హత్యచేసింది నేనేనంటారా?

జ : కాదని ఋజువుచేసుకోవలసింది మీరు.

గో : పోలీసుల కర్తవ్యం నేరస్తుల్ని పట్టి ఇవ్వడం కాని ఎవరో ఒకర్ని పట్టిఇవ్వడం కాదని గుర్తుంచుకోండి.

జ : అది మాకు తెలుసు.

గో : తెలిస్తే నన్ను మీరు అనుమానించరు.

జ : నేరస్థులు నిర్ధారితులయ్యేంతవరకూ అందర్నీ అనుమానించడం మా అలవాటు.

గో : మీ అలవాటులో వచ్చే పొరబాటుల్ని సవరించుకోవడం మీ ధర్మం.

జ : తుది క్షణంవరకూ పోలీసులు తమ పొరబాట్లను సరిదిద్దుకోవడానికి వెనుదీయరు. మా పొరబాట్లను మీరు వివరించవచ్చు.

గో : మీ కింతవరకూ నేరస్థులెవరో అంతు చిక్క లేదా?

జ : నా విచారణ పూర్తికానిదే నేనీ ప్రశ్నకు జవాబు చెప్పలేను.

గో : పోనీ నేను చెప్తున్నాను వినండి.

జ : చెప్పండి.

గో : నిన్న రాత్రి నరసింహారావు విదేశాలకు ప్రయాణం పెట్టుకొన్నాడు. అందుకు ధర్మయ్యను...

జ : అతని సీతను తన కప్పగించవలసిందిగా బలవంత పెట్టాడు.

గో : ఎందుకో తెలుసా?

జ : బహుశా సీత చాలా అందకత్తె అయి వుండ వచ్చు.

గో : ఆ అందాన్ని ఎరగా చూపి విదేశీయులను ఆక ర్షించాలనుకొన్నాడు. అందుకు...

జ : ధర్మయ్య నిరాకరించాడు.

గో : అంతేకాదు. నరసింహారావు మాటలకు అతనికి పౌరుషం వచ్చింది.

జ : ఆ పౌరుషంలో సీతపై చేయివేస్తే చంపివేస్తా నన్నాడు.

గో : అవును. అయినా నరసింహారావు సీతను ఎవరడ్డు వచ్చినా బలవంతంగానైనాసరే తీసుకు పోతా నన్నాడు.

జ : అందుకై ధర్మయ్య వారిని చంపివేయాలను కున్నాడా?

గో : నేనూ నిర్మలా మాట్లాడుతూవుండగా వచ్చి మాకీ సంగతి చెప్పాడు. నరసింహారావుగారు సీత జోలికి వెళితే ఊరుకోననీ, తనకీ నౌకరీ అక్కర్లే దనీ అన్నాడు.

జ : అప్పుడు మీ రతన్ని సముదాయించారు.

గో : ఏదో ఆవేశంలో నరసింహారావు అల్లా అని వుంటాడనీ, అంత మాత్రాన నౌకరీ వదలు కోవడం మంచిదికాదని, నిర్మలా, నేనూ అత నికి నచ్చచెప్పాం.

జ : అయినా అతనికి తృప్తి కలిగివుండదు.

గో : కనుక రాత్రి నరసింహారావు హత్యకు పాల్పడి వుండవచ్చు.

జ : అని మీ అనుమానం.

గో : అనుమానంకాదు నమ్మకమే.

జ : ఎందువల్ల ?

గో : హత్యాసమయంలో ధర్మయ్య కటికీనుండి పారి పోవడం నేను చూశాను.

జ : మీరుకూడా లోనికి పారిపోయారు కదా.

గో : అంతమాత్రాన నేను హంతకుణ్ణవుతానా ?

జ : నే నిప్పు డేంచెప్పగలను? ఇంకా మీ కెవరిపై అనుమానం వుంది ?

గో : మరొకటి. నేనూ నరసింహారావు ఘర్షణ పడు తూండగా నారాయణరావు వచ్చాడు "విచా రించకు బాబాయి. ఈ వేళ అన్నయ్య అంతు ఏదిటో నేను చూస్తాను" అన్నాడు.

జ : అతడుకూడా ఈహత్యలో భాగస్థుడేనంటారా?

గో : నన్నడిగితే నారాయణరావుకూడా తన అన్న గారిపై ఏదో కోపంలో వున్నట్టు కనిపించాడు అందుకు...

జ : నారాయణరావూ, ధర్మయ్యా కలిసి ఈ హత్య చేశారంటారా ?

గో : నాకలానే అనిపిస్తోంది.

జ : నాకు మరోలా అనిపిస్తోంది.

గో : ఏమని ?

జ : మీరే ఈ హత్యచేసి వారిద్దరిపై నేరం మోపు తున్నారని.

గో : ఏమన్నారు ?

జ : మీరే హంతకులని.

గో : జాగ్రత్త. మర్యాదగా మాట్లాడండి.

జ : గోపాలరావుగారూ మీ రెంత రాజకీయవాదు లైనాసరే మీకు జడియవలసిన పని నాకులేదు. ఇక మీరు వెళ్ళవచ్చు. (గోపాలరావు లోపలకు నిష్క్రమిస్తాడు.)

జ : (నిర్మలను ఉద్దేశించి) నిర్మలా దేవి గారూ. విన్నారుకదా విచారణను.

ని : (ఔను అన్నట్లు తలపంకిస్తుంది)

జ : ఇకనైనా చెప్పండి. మీరా సమయంలో ఏం చేస్తున్నారు ?

ని : (నన్నేమీ అడగవద్దు అన్నట్లుగా వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

జ : మీరలా ఉంటే మేమేంచేసేది ? దోషిని పట్టు కోవడం కేవలం మా కర్తవ్యమే కాదు. మీ భర్తపై మీకుండే నిష్కళంక ప్రేమదృష్ట్యా మీకు కూడా కర్తవ్యమే. మీ కర్తవ్యాన్ని మీరు నెరవేర్చకపోవడం మీ భర్తగారిపట్ల తీరని అపచారమవుతుంది. (కొంచెంఆగి) అంతే కాదు. అసలు దోషిఎవరో మీకు తెలిసివుంటే మేము ఎవరో ఒకనిర్దోషిని దోషిగా బంధిస్తే— ఆపాపం కూడా మీకు తగులుతుంది. అనవస

రంగా ఒకనిర్దోషి నూరేళ్ళ జీవితాన్ని మానంతో నిష్ఫలపాలు చేసినట్లవుతుంది. ఆలోచించుకోండి.

ని : (వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

జ : "ఎవరు దోషి" అంటారు? మీమరిది నారాయణరావా? ముకుందరావా? ధర్మయ్యా? గోపాలరావా?

ని : (ఏడుపు.)

జ : (సాలోచనగా అటూ ఇటూ తిరుగుతాడు. వివరాలు సమీక్షించుకొని సంఘటనను అర్థం చేసుకొంటాడు. ఏదో స్ఫురించినట్లుగా తల పంకిస్తాడు) ఏయ్ త్రీనాట్‌ఫైవ్?

కా : (ప్రవేశించి) యస్ సార్.

జ : ఆ టేబిలు నిటు మధ్యగా వేయి. (కానిస్టేబిలు రంగంలో ఒకమూలవున్న టేబిలును రంగం మధ్యగా వేస్తాడు.)

జ : నీవు లోనికివెళ్ళి నారాయణరావు గారినీ, గోపాలరావు గారినీ, ధర్మయ్యానూ తీసికొనిరా. (కానిస్టేబిలు వెళ్ళి వారిని తీసుకువస్తాడు)

జ : ముకుందరావుగార్ని కూడా తీసుకురా. గోపాలరావుగారూ. మీరిటు రండి. నారాయణరావు గారూ, ధర్మయ్యా మీరటు నిలవండి. నిర్మలాదేవిగారూ మీరు కూడా ఇటు రండి. (అంటూ జయరాం ధర్మయ్యా, నారాయణరావుల నొకవైపున వారితరువాత నిర్మలనూ, నిర్మల తరువాత గోపాలరావును వరుసగా నిలిచేటట్లు చేస్తాడు. ఇంతలో కానిస్టేబులు ముకుందరావును వెంటబెట్టుకువచ్చి బైటకు నిష్క్రమిస్తాడు. జయరాం ముకుందరావును గోపాలరావు ప్రక్కగా నిలుచుండ జేస్తాడు. రంగం ఒకవైపు వెళ్లి తన పిస్టలును పరీక్షించుకువచ్చి దానిని టేబిలుపై ఉంచుతాడు.) చూడండి. కొద్దిసేపు మీరందరూ నేనే నరసింహారావునని భావించుకోండి. మీ అందరి ఆశలకు అంతరాయం కలిగిస్తున్న నరసింహారావును నేనే. నాపై మీ కందరకూ వివిధకారణాలతో కక్ష ఏర్పడింది. నా జీవితాన్ని నాశనం చేస్తే తప్ప, మీ ఆశయాలు సిద్ధించని విషమపరిసితిని నేను కల్పించాను. ముకుందరావుగారూ నేనొక మహత్తర శక్తిపరిశోధనలను జరిపించాను. ఆ పరిశోధనల ఫార్ములా మీకు కావాలి. నే నీయడానికి నిరాకరించాను. మీ రేం చేస్తారు?

ము : ఈయకపోతే నేనేం చేస్తాను?

జ : మీకది ముఖ్యంగా కావాలి. నానావిధాలుగా నన్ను బ్రతిమాలారు. కాని ఫలించలేదు. బలవంతంగానైనా దానిని తీసుకుపోవాలనుకున్నారు.

ము : అబద్దం.

జ : బుకాయించకండి. మీరు నన్ను భయపెట్టారు. అయినా నేను చలించలేదు. మీ కా ఫార్ములా కావాలి. ముఖ్యంగా కావాలి ఏంజేస్తారు?

ము : నేనేం చేస్తానండీ.

జ : నన్ను చంపితేతప్ప మీకు నా ఫార్ములాలు దక్కవు. అదిగో పిస్టలు. చూస్తారేం. చంపండి.

ము : నావల్ల కాదండీ.

జ : నన్ను ఇన్స్పెక్టరుగా భావించుకోకండి. నేను కేవలం మీ మిత్రుడు నరసింహారావుగానే భావించుకోండి. ఇప్పుడు పేల్చండి. ఊఁ!

ము : నావల్ల కాదు. నేను మిత్రద్రోహినే కావచ్చు. కాని మిత్రహంతకుణ్ణిమాత్రం కానండీ. ఆ పని నావల్ల కాదు.

జ : పోనీలెండి. ఇలా చూడు ధర్మయ్యా. నేనే నీయజమానిని. నీ కూతురు సీతను నాకప్పగించవలసిందిగా నిన్నడిగాను. నీవు నిరాకరించావు. అయినా బలవంతంగానైనా సరే రాత్రికి రాత్రే సీతను నేను తీసుకు పోతానన్నాను. నీకు కోపం వచ్చింది. నీ కూతుర్ని రక్షించుకొనేందుకు నీవేం చేస్తావు ధర్మయ్యా?

ధ : నా నేవిఁటి సేత్తాను బాబూ?

జ : నీ కూతుర్ని నేను బలవంతంగా తీసుకుపోతూంటే నీవు చూస్తూ వూరుకొంటావా? నీకు పౌరుషంలేదా? నీవేమీ చెయ్యవా ధర్మయ్యా?

ధ : నౌకరు ముండావోణ్ణి నే నేం సెయ్యను బాబూ?

జ : నీవు సీత తండ్రివి. నీ వామెను రక్షించుకోవాలి. ఆమెను రక్షించేందుకు నన్ను చంపడం తప్ప మరొక గత్యంతరం లేదు. చంపు ధర్మయ్యా నన్ను చంపు.

ధ : (జయరాం భావం అర్థంకాక తెల్లబోతాడు)

జ : అదిగో పిస్టలు. తీసికో ధర్మయ్యా. నీ సీతను రక్షించుకో. నన్ను చంపు.

ధ : నావల్ల కాదు బాబూ.

జ : సందేహించకు ధర్మయ్యా నీ కూతుర్ని నీనుండి వేరు చేయదల్చుకొన్న నీచునిగా, నరసింహారావుగా నన్ను ఊహించుకో. పేల్చు ధర్మయ్యా.

ధ : నాకు తెల్దు బాబూ. నాకు సేతకాదు.

జ : పోనీలే. గోపాలరావుగారూ, ఇలా చూడండి. నేను మన మాతృదేశానికి తీరని ద్రోహం చేస్తున్నాను. ఒక భయంకర మారణాయుధాన్ని సృష్టించి అది మన శత్రురాజ్యానికి అందజేసే ప్రయత్నంలో వున్నాను. మీరు నిష్కళంక దేశభక్తులు. మీరు నాకెంత ఆప్తులయినా మీ దేశాభిమానం నా యీ అక్రమచర్యను సహించలేదు. మీరు నన్ను నా ప్రయత్నంనుండి వారించారు. అయినా నేను వినలేదు. అప్పుడు మీరేం చేస్తారు?

గో : మీరు వినకపోతే నేనేం చేయగలనండీ.

జ : నేను వినకపోతే మరేమీ చేయరా? నాకోసం దేశమెలా నాశనమైనా మీకు బాధలేదా? నా ఒక్కడికోసం దేశం సర్వనాశనమవుతూ వుంటే మీరు సహించగలరా?

గో : సహించలేను. కాని ఏంచేయను?

జ : దేశాన్ని రక్షించాలి. నా మరణంతో తప్ప మన మాతృదేశానికి రక్షణ లేదు. నన్ను చంపండి. దేశాన్ని రక్షించండి.

గో : చంపలేను.

జ : ఎందుచేత?

గో : మీరు నరసింహారావుగారైనందున.

జ : అయితే మీకు దేశంకంటే నేనే ఎక్కువా?

గో : కాదు.

జ : మరెందుకు చంపరు?

గో : నా చేయి ఆడదు. నావల్ల కాదు.

జ : పోనీలెండి. నారాయణరావుగారూ మీరిది తీసికోండి. నేను మీ అన్నను. మీరడిగిన డబ్బును నే నివ్వ నిరాకరించాను. మీ కిప్పుడు డబ్బు చాలా అవసరం. ఎలాగైనా మీకు డబ్బు కావాలి. ఏం చేస్తారు?

నా : నేనేమీ చెయ్యనండీ.

జ : నన్ను ఇన్స్పెక్టరుగా చూసి భయపడుతున్నారేమో. నన్ను కేవలం మీ అన్నగార్ననుకోండి. ఇప్పుడు చెప్పండి. మీరు డబ్బును దక్కించుకోడానికి ప్రయత్నించరా?

నా : ప్రయత్నిస్తాను.

జ : భేష్. నేను జీవించి వున్నంతవరకూ అది మీకు దక్కదు. ఇప్పుడు మీరేం చేస్తారు? మాట్లాడరేం? నా అడ్డం తొలగించుకోరా? నన్ను హత మార్చరా? పేల్చండి. తీయండి పిస్టలు.

నా : నేను తీయను. నాకు తెలుసు. నిజంగా పేలిస్తే నన్ను అరస్టుచేసి తీసుకుపోదామని మీ రీ ఎత్తు వేశారు.

జ : నన్ను ఇన్స్పెక్టరుగా భావించుకోకండి. నేను మీ అన్నగార్ని.

నా : అయితే అసలు పేల్చను. నావల్ల కాదు.

జ : పోనీలెండి. నిర్మలాదేవిగారూ. ఇటు చూడండి. మీరు మాట్లాడకపోయినా పరవాలేదు. ఒక క్షణం నావైపు చూడండి. నేనే నరసింహారావుని. మీరు మనసారా ప్రేమించి మమతతో పెండ్లాడిన మధురమూర్తిని. మీ హృదయంలో నిరంతరమూ దైవంగా ఆరాధించుకొనే ప్రణయైక జీవనుణ్ణికాని మన మాతృదేశ విద్రోహచర్యలో పాల్గొంటున్నాను. దేశాన్ని నాశనంచేసే మారణాస్త్రాన్ని నిర్మించి మన శత్రురాజ్యానికి చేరవేయదలచుకొన్నాను. నన్ను మీరు వారించలేరు. నాపైన మీకుగల భక్తి విశ్వాసాలు అందుకు అడ్డు వస్తాయి. (నిర్మలముఖం వివర్ణమవుతూ వుంటుంది) అయినా దేశం! నాకోసం దేశం-దేశం నాశనమవుతూవుంటే మీరు చూస్తూ వూరుకొంటారా? మీకు దేశాభిమానం లేదా? ఉంది. అందు కేం చేయాలి? రాత్రి మీరు వెనుక తలుపు తెరచుకొని నా గదికి వచ్చారు. (రంగంపై చీకటి. పురుష పాత్రలన్నీ మాయమై పోతాయి. రంగంపై పడే స్వల్పాతి స్వల్పమైన కాంతిలో నిర్మల, నరసింహారావు మిగులుతారు.)

న : వచ్చావా. నిర్మలా రా. నాకు దిగ్విజయాన్ని కోరుతూ నన్ను సాగనంపు.

ని : నే నెప్పుడూ మీ దిగ్విజయాన్నే కోరతాను. అది మీకు తెలియదా?

న : తెలుసు నిర్మలా. కనుకనే, నీ చిరునవ్వు వెలుగులతో జీవితంలో పేరుకొన్న చీకట్లను చీల్చుకొంటూ ప్రయాణిస్తాను.

ని : ఒక్కమాట చెప్తాను వింటారా?

న : ఏమిటది?

ని : జీవితంలో ఎన్నడూ, యాచించని మీ నిర్మల మిమ్మల్ని నేడొకటి యాచిస్తోంది. మీరు త్రోసిపుచ్చుతారా ?

న : నీ మాట కాదంటానా నిర్మలా ?

ని : అదే ధైర్యంతో, అదే ఆశతో, నేను మీ ముందుకు వచ్చాను. నాకు ఆశాభంగాన్ని కలిగించరు కదా !

న : చెప్పు నిర్మలా. ఏమిటది ?

ని : చెప్పమంటారా ?

న : సందేహిస్తావేం నిర్మలా. చెప్పు.

ని : మీ రీ ప్రయాణం మానుకోవాలి. ఇదే నా కోరిక.

న : ఏమన్నావ్ ?

ని : మీరు చేస్తున్నదంతా నాకు తెలిసింది. నామాట వినండి. మన మాతృదేశానికి ద్రోహం చేయకండి.

న : నిర్మలా?

ని : మీకు కోపం వస్తోందా? నన్ను కొట్టండి. చంపండి. అయినా నాకు సంతోషమే. మీ రీ ప్రయాణంమాత్రం మాని వేయండి.

న : గోపాలరావు పిచ్చి నీకూ పట్టిందా నిర్మలా?

ని : మీరే మన్నా సరే. మీ రీ ప్రయాణం మాని వేయండి.

న : నీ మాట కాదంటున్నందుకు మన్నించు నిర్మలా. ఈ ముహూర్తం కోసమే నే నిన్నాళ్ళూ అహోరాత్రం కృషి చేశాను. నా కృషి ఫలించి, నా చిరకాలస్వప్నం నిజమవుతున్న సమయంలో చేజేతులా నా అదృష్టాన్ని వదులుకోలేను నిర్మలా. వదులుకోలేను.

ని : నా కోసం, మీ నిర్మలకోసం మీ రీ ప్రయాణాన్ని మానుకోలేరా ?

న : మానుకోగలను నిర్మలా. కాని....

ని : ఊఁ కాని...?

న : సమయం మించిపోయింది నిర్మలా. ఇప్పుడు నేనీ ప్రయాణం మానుకొంటే ఎన్నో ప్రమాద పరిస్థితు లేర్పడుతాయి. నేను వెళ్ళకతప్పదు. నిర్మలా. వెళ్ళకతప్పదు.

ని : మీరు వెళ్ళకూడదు. వెళ్ళనివ్వను.

న : (నవ్వి) అహ్హాహ ! పిచ్చినిర్మలా.

ని : నేను మిమ్మల్ని నా ప్రాణంకంటె అధికంగా ప్రేమించాను. అది మీకు తెలుసు. అయినా మీ కోసం మన మాతృదేశం నాశనమైపోవడం నేను సహించలేను.

న : అందుకేం చేస్తావు ?

ని : మీ ప్రయాణాన్ని అడ్డగిస్తాను.

న : నీవు కాదు సరికదా కేవలం ఆ నిటలాక్షుడే ఇపు డెత్తి వచ్చినా నా ప్రయాణం ఆగదు.

ని : ఆగాలి. ఆగితీరాలి. (అంటూ అతని కడ్డుపడుతుంది. అతను ప్రక్కకు నెట్టివేస్తాడు. ఫార్ములాలు తన సంచిలో పెట్టుకొంటూ వుంటాడు. నిర్మల ఒక క్షణం యోచిస్తుంది. సత్వరన ఆ ఫార్ములాలు లాక్కుంటుంది. అక్కడనే వున్న ఒక ద్రావకపు సీసాలో అవి పారవేస్తుంది. అవి కాలిపోతాయి.)

న : నిర్మలా. నిర్మలా. నా ఫార్ములాలు దగ్ధం చేస్తావా ? ఇన్నేళ్ల నా ప్రయత్నాన్ని బుగ్గిపాలు చేస్తావా ? ఇదిగో దానిఫలం అనుభవించు (అంటూ పిస్టలు గురిపెడతాడు.)

ని : చంపండి. మీ నిర్మలను మీరే మీ చేతుల్తో చంపివేయండి. నన్ను లాలించి పాలించిన చేతుల్తోనే నన్ను సమాధి చెయ్యండి.

న : (నిర్మలను నఖశిఖపర్యంతం ఒకసారి చూస్తాడు. పేల్చలేకపోతాడు. పిస్టలు టేబిలుపై పారవేస్తాడు) పోనీలే. నీవు ఫార్ములాలు కాల్చివేసినంతమాత్రాన నా ప్రయాణం ఆగిపోదులే. నా మెదడులో బద్రపరచుకొన్న జ్ఞాపకాలే చాలు. నా కార్యసిద్ధికి నేను వెళుతున్నాను.

ని : మీరు వెళ్ళడానికి వీల్లేదు.

న : ఏం చేస్తావు నిర్మలా.

ని : ఏదైనా చేస్తాను. మీరు వెళ్ళవద్దు. నా మాంగల్యమూ, నామాతృదేశమూకూడా నాకు కావాలి.

న : పిచ్చి నిర్మలా ప్రపంచంలో నేను నన్ను ఏశక్తీ అడ్డగించలేదని తెలుసుకో. నేను వెళ్తున్నాను.

ని : ఆగండి. మీరు వెళ్ళడానికి వీల్లేదు. ఆగండి.

న : (వెనుదిరిగి ఒక నవ్వు నవ్వుతాడు. "ఆగను" అని మెల్లిగా నడుస్తుంటాడు.)

ని : (యాంత్రికంగా బల్లపైని పిస్టలు తీస్తుంది. గురి పెడుతుంది.)

న : (ఆమెనుచూసి మరింత బిగ్గరగా, హేళనగా నవ్వుతాడు.)

నేపథ్యంలో

నీ మాంగల్యంకోసం దేశాన్ని మారణహోమం చేస్తావా ? నిర్మలా అతన్ని చంపు. దేశాన్ని రక్షించు, దేశాన్ని రక్షించు, రక్షించు.

ని : (పై మాటలకు ఆమె ఆవేశితురాలవుతుంది. వివశురాలవుతుంది. నిర్మల పిస్టలును పేల్చి వేస్తుంది. కెవ్వున కేకతో సోఫాపై పడిపోతుంది. చీకటి తొలగి లైట్లు వెలిగేసరికి రంగం యథాప్రకారంగా వుంటుంది. నరసింహారావు మాయమైపోతాడు. ధర్మయ్య, నారాయణరావు, గోపాలరావు, ముకుందరావులు ముందు ఏయే చోటుల్లో వుండేవారో ఆయా చోటుల్లోనే వుంటారు. నిర్మలమాత్రం సోఫాపై పడి వుంటుంది.)

నా : వదినా! వదినా! (అంటూ ఆమెవద్దకు వెళతాడు)

జ : కొంచెం చన్నీళ్లు తీసుకురండి. (నారాయణరావు వెళ్ళి చన్నీళ్ళు తెచ్చి ఆమెపై చిలకరిస్తాడు. ఒక్క జయరాంతప్ప మిగిలిన అన్నిపాత్రలూ విహ్వల భావాలను ప్రదర్శిస్తూ వుంటారు. ఆమెకు కొంచెం స్పృహవస్తుంది.)

జ : నిర్మలాదేవిగారూ నా ఊహ నిజమేనంటారా?

ని : నిజమే. నేనే హత్యచేశాను. నా మాతృదేశం కోసం నేనే వారిని హత్యచేశాను. వారి ఫార్ములాలు దగ్ధంచేశాను. మాతృదేశంకోసం నా మాంగల్యాన్ని కోల్పోయాను. నేను హంతకురాల్ని. నేను రాక్షసిని. పిశాచిని. నన్ను అరెస్టు చేయండి. నాకు శిక్ష విధించండి. నాకు ఉరిశిక్ష విధించండి. (అంటూ ఆవేశితురాలై మరల స్పృహతప్పి పడిపోతుంది.)

జ : నారాయణరావుగారూ, ఇక్కడి ఫోనును ఉపయోగిస్తున్నందుకు మన్నించండి (అంటూ ఫోను వద్దకువెళ్ళి, రింగ్ చేసి) హల్లో, హల్లో ఇన్స్పెక్టర్ జయరాం స్పీకింగ్. అంబులెన్స్ ప్లీజ్. సెండ్ హియర్ అర్జంట్లీ ఎన్ అంబులెన్స్. యస్. టుది నిర్మలా భవన్. థేంక్యూ.

నా : వదినా! వదినా!

ధ : అమ్మగారూ! అమ్మగారూ!

గో : నిర్మలా! నిర్మలా!

ము : నిర్మలాదేవిగారే ఈ హత్యచేశారని మీ రెలా నిర్ణయించారు?

జ : మీ కింకా నమ్మకం కలగడంలేదా ముకుందరావుగారూ?

ము : లేదు.

జ : రాత్రి మేము నరసింహారావుగారి గదిని పరిశీలించినపుడే మాకు కొన్ని అనుమానాలకు ఆధారాలు కనిపించాయి: ద్రావకపుసీసాలో దగ్ధమైపోయిన కాగితాలు, స్త్రీ అడుగుజాడలు మొదలైనవి. అంతమాత్రాన మేము నిర్మలాదేవిగారిని దోషిగా తీర్మానించడానికి వీలులేదు. అందువల్లనే మిమ్మల్నందర్నీ రకరకాలుగా పరీక్షించాను. కాని నిర్మలాదేవిగారి మౌనం నాకు ఛేదించరాని సమస్యగా తయారయ్యింది. వారు మాటలాడలేని ఒకానొక విచిత్ర మానసికావస్థకు లోనయిపోయారు. వారిని ఆ స్థితినుండి ఉద్రేకపరిస్తే తప్ప మాటలు వెలువడవని భావించాను. నేను ఊహించిన విషయాలతో మిమ్మల్నందర్నీ ఒక ఉద్రేకానికి లోనుజేసి మిమ్మల్ని పిస్టలు పేల్చమన్నాను. మీరు పేల్చలేకపోయారు. కాని నిర్మలాదేవిగారికి గతరాత్రి అనుభవం జ్ఞప్తికి వచ్చి యాంత్రికంగా దానిని పేల్చివేయగలిగారు. ఇప్పుడు మీ సందేహం తీరిందా ముకుందరావుగారూ.

ము : మీరింతకూ ఆమె "దోషి" అంటారు?

నా : మా వదిన దోషికాదండీ. అన్నయ్యను నేనే చంపాను.

ధ : అట్టా అనకు బాబూ కోపం వచ్చి అయ్యగార్ని నానే సంపేసేను. నన్ను తీసుకుపోండి బాబూ. అమ్మగార్ని ఒగ్గేయండి.

జ : మీ ఇరువురకూ ఆమెపై గల ప్రేమవిశ్వాసాలకు ఆనందపడుతున్నాను. కాని ఆమెకిప్పుడెంతమాత్రం అవి ఉపయోగపడవు. ఆమె దోషి.

గో : కాదు. ఆమె దోషికాదు. దేశమాతదివ్య చరణారవిందాలపై తన పసుపు కుంకుమనే పారాణిగా సమర్పించుకొన్న త్యాగమూర్తి.

ము : ఆమె స్త్రీజాతికే గర్వకారణమైన ఆదర్శ మహిళ. (ఇంతలో అంబులెన్సు హారను వినిపిస్తుంది.)

జ : అదిగో అంబులెన్సు వచ్చింది. నిర్మలాదేవిగారిని అందులో తీసుకు వెళ్దాం పదండి.

నా : మా వదిన ఎంతమాత్రం దోషికాదండి.

గో : అమె ముమ్మాటికీ దోషికాదు.

ము : అవును ఆమె దోషికాదు.

ధ : అమ్మగారు అసలు "దోసే" కాదు బాబూ.

జ : (నవ్వుతూ) అయితే మరి "ఎవరు దోషి?" (రంగం చీకటిఅవుతుంది. ఆ చీకటిని చీల్చుకొని గోడకువున్న నరసింహారావు పటంపై వెలుతురు పడుతుంది. చురుకుగా తెర.)

# కుమారసంభవ కృతిపతి-సప్తసంతానములు

## శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

ఆంధ్ర వాఙ్మయమునందు "అంకితము చేయుట" యనున దొక విశిష్టసంప్రదాయము. ఈ యంకితము చేయుట యనగా నేమో విచారించి యందుకు హేతువుల నరయుటకు బ్రయత్నించి కుమారసంభవమును నన్నెచోడమహాకవి జంగమ మల్లికార్జునున కంకితము గావించినాడా? లేదా? అని పరిశీలించుట యీ వ్యాసవిషయము.

"అంకితము" అనునది "అకి" ధాతువునకు నిష్ఠాంత రూపము. అకిధాతువునకు లక్షణమర్థము (అకి లక్షణే). ఇక్కడ లక్షణ మనగా చిహ్నము. "కళంకాంకౌ లాంఛనంచ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్" అని నామలింగానుశాసనము. దీనిని బట్టి "అంకితము" అనగా 'చిహ్నముగా చేయబడినది' యనునర్థమని తేలినది. కృతి నంకితము చేయుట యనగా కృతిని చిహ్నముగా చేయుట యన్నమాట. కాని కృతిని దేనికి చిహ్నముగా జేయుట? యను ప్రశ్నము దీనిపై నిలిచియే యున్నది. ఈ ప్రశ్నమునకు సమాధానము నరయుటకు ముందు కృతి నంకితముగా జేయుటకుగాని, కృతి నంకితముగా గొనుటకుగాని దేనిని ప్రయోజనముగా ప్రాచీనులు తలంచినారో పరిశీలించుట యవసరము.

నన్నయ భారతమునందు 'అంకిత' ప్రసక్తి లేదు. రెండవది కుమారసంభవము. దీనియందు 'అంకితము' అనుమాట వాడబడకపోయినను తత్కర్తయగు నన్నెచోడమహాకవి యీకృతిని తన గురువగు జంగమ మల్లికార్జునుని పేర నిలిపినట్లు వచించియున్నాడు. ఇట్లు చేయవలసినదిగా దనకు గుర్వాజ్ఞ యున్నట్లు నాతడు చెప్పియున్నాడు.

"పూని మహాగ్రహార వర
 పుత్ర సమున్నతి దేవతాలయో
ద్యాన తటాక సత్కృతి ని
 ధానము లాశశితారకంబు సు
స్థానములై మహిం బరగ
 జంగమమల్లయ పేర సప్త సం
తానము లొప్ప నల్పుదు ము
 దంబునఁ దత్ప్రభు నాజ్ఞ పెంపునన్." (1-46)

కృతి సప్తసంతానములలో నొక్కటి. అగ్రహారము, దేవాలయము, ఉద్యానవనము, తటాకము, నిధి, పుత్రుడు అనునవి కడమ యారుసంతానములు. వీని నన్నింటిని నన్నెచోడుడు తన గురువుపేర ఆచంద్రార్కము స్థిరములై యుండునట్లుగా నిల్పినాడట. కడమ వానివిషయమున పరిశోధన యింకను జరుగవలసి యున్నది కాని కవిరాజు కుమారసంభవకృతి జంగమ మల్లయ పేర సుస్థిరముగా నిలిచియున్నదనుట మాత్రము సుస్పష్టము. కృతి సప్తసంతానములం దొక్కటి కనుక వీని నన్నింటిని నిల్పుటకు ప్రయోజనము నొక్కటియే కావలయును. కుమారసంభవకర్త యాప్రయోజన మెట్టిదియో "ఆశశితారకంబు సుస్థానములై మహిం బరగ" నని కొంత చెప్పియున్నను దేని కివి "స్థానములై మహిం బరగవలె"నో స్పష్టముగా వచింపలేదు. దానిని స్పష్టముగా దెలిసికొనుట కీక్రింది మంచన పద్యము మన కుపయోగించును.

"నందనుండు వనమ్ము నల్లిల్లు నిధి సుర
 గృహము చెఱువు పెలికృతి యనంగ
జగతి నెలయు సప్తసంతానములు వీనఁ
 బుణ్యమును యశంబుఁ బొందవచ్చు"

సప్తసంతానములవలన బుణ్యమును గీర్తియును గలుగునని పైపద్యము చెప్పుచున్నది. ఇప్పుడు దీనిని దృష్టియం దుంచుకొని కుమారసంభవపద్యమును జదివితిమేని సప్తసంతానములను, అందును బ్రధానముగా గృతిని నన్నెచోడ మహాకవి జంగమమల్లయ పేర కీర్తికిని పుణ్యమునకు సుస్థానముగా నాచంద్రార్కము నిలుచునట్లు కావించె నని గ్రహింపగలము.

కీర్తి యనగా పదికాలములపాటు పదిమంది యావ్యక్తిని గుఱించి మంచివాఁడనియో గొప్పవాడనియో చెప్పుకొనుట. ఇది పుణ్యము వలన లభించును (పుణ్యైర్యశో లభ్యతే). కనుక సప్తసంతానములు పుణ్యమునకును, బుణ్యము కీర్తికిని కారణములు.

లోకమునందు "నా పేరు నిలుపుట కొక్క కుమారుఁడు లేకపోయె నే" యను వ్యవహారము వినుచుం

డుము. కుమారుఁడు పేరు నిలుపుట యేమి? పరిశీలింపగా నా కుమారునిగూర్చి పలుకునప్పుడు "ఈతఁడు ఫలానావారి పుత్రుఁ" డని తండ్రిపేరుకూడ స్మరింపబడుచుండుననియు, నాస్మరణమున్నంతకాలము నా తండ్రి కీర్తి యీ లోకమునం దుండుననియు, నాకీర్తి నీతండ్రి కోరియే తనకు పుత్రప్రాప్తిని కాంక్షించె ననియు తేలును గదా! ఇది పేరునిలుపుటలోని యాంతర్యము. దీనినిబట్టి పేరునిలుచుట యన్నను కీర్తియన్నను నొక్కటే యని తేలినది. ఇట్లు పేరు నిల్పుకొనుటకు నిల్పదగినవి సప్తసంతానములు. వానిలో నొక్కటి కృతి. దీనినే చిన్నకోటపెద్దన యీ క్రిందిపద్యము చక్కగా వివరించుచున్నది:

"వినుత యశంబునం గలుగు
విశ్రుతనాకనివాస మయ్యశో
జననము శ్రవ్యకావ్యముల
సంగతి నొప్పను శ్రవ్యకావ్యమున్
దనరుఁ గవిప్రభావమునఁ
దత్కవిసమ్మతి లేని రాజు లే
పున విహరింప రవ్విభులు
పోయిన జాడ తెలుంగఁ బోలునే?"

(కావ్యా-చూడా. ఆ. 3. ప. 90)

కృతి సప్తసంతతులలో నొక్కటి మాత్రమే కాదు; ఉత్తమ మయినది కూడ:

"ఆదట సప్తసంతతుల
యందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ
జెప్ప విపర్యయ మే యుగంబునన్
లేదు కవిత్వసంతతికి......"

అని భావించినాఁడు జైమినిభారత కృతిపతి సాళువ నరసింహరాయలు. నన్నెచోడ మహాకవియు "అందు నుత్కృష్టసంతానమ్ము కృతియ కా నిశ్చయించి"నాఁడు. కనుకనే తన కుమారసంభవకృతిని జంగమ మల్లికార్జునుని పేర నిలిపినాడు.

కావ్యప్రయోజనములలో కీర్తి మొదటిది (కావ్యం యశసే...). కనుకే కావ్యనిర్మాణము లేదా కావ్యమును నిలుపుట సప్తసంతానములలో నుత్తమ మయినది. వీనిలో కావ్యనిర్మాణము కవికర్తృకము. కావ్యమును నిల్పుట కవికర్తృకము గాని, యన్యకర్తృకము గాని కావచ్చును.

ఒకఁడు తనపుణ్యమునకయి దేవాలయమును కట్టించవచ్చును. అట్లుకాక కొందఱు మఱియొకరిపుణ్యమునకయి వారిపేర దేవాలయముల నిలుపవచ్చును. ఇది యొకనిపేర నింకొకఁడు బేంకులో ధనము వేయుటవంటిది. ఆధనము ఎవరిపేర నున్నదో దానిస్వత్వము వారిదికాని వేసినవారిది కాదు. అట్లే యొకరిపేరు స్థిరముగా నిలుచుటకయి మఱియొకరు సప్తసంతానముల నిలుపవచ్చుననుట. పూర్వము సామంతులో లేక రాజకీయోద్యోగులో రాజులపేర దేవాలయములు నిర్మించుటయు నగ్రహారములొసంగుటయు దానధర్మము లాచరించుటగను శాసనములతో పరిచయమున్నవారి కందఱకు బాగుగాఁ దెలిసినదే. ఇప్పుడు నిట్టిపుణ్యకార్యములు లేకపోలేదు గదా!

కావ్యమును రచియించి కీర్తిని పొందవచ్చును. కాని యందఱకు నది సాధ్యము కాదు. అట్టివారు సప్తసంతతులఁ బూర్తిగాఁ బొందుటెట్లు? వారు కవి నాశ్రయించి యాతని కావ్యము తనకీర్తికి చిహ్నముగా నుండునట్లు చేయించుకొనవలెను. అప్పుడు తనపేర నున్న యాకావ్యము తనపేరు లోకమున స్థిరముగా నుండునట్లు చేసి, కీర్తిని, కీర్తివలనఁ గలుగు స్వర్గలోకనివాసమును దనకుఁ గలిగించును. లోకమున దమకీర్తి యెంతకాలమున్న నంతకాలము తమకు స్వర్గలోకనివాసము కలుగునని మనప్రాచీనుల విశ్వాసము. కనుక కవి నాశ్రయించి తమపేర గ్రంథముల నిల్పుకొనుటకు యత్నించుట కృతిపతుల వాంఛ యయినది. దీనికే యంకితము చేయించుకొనుట యని వ్యవహారము.

దీనివలన నంకితము చేయుట యన్నను పేరనిలుపుట యన్నను నొక్కటే యనుట తేలిన సారాంశము. పింగళిసూరన యీ క్రిందిపద్య మీ యభిప్రాయమునే మఱింత సుగమముగా దెలియఁ జేయుచున్నది:

"ఏనును బిత్రుపూజన నా
చే నైన ట్లిద్ధియొనఁ జేయఁగ వలయున్
గానఁ గృతియిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్"

(ప్రభా. ఆ. 1. ప. 9)

ఈ విధముగా కవి తనకృతి నితరుల కిచ్చుట కొడుకులు లేనివారికి పుత్రవంతులయినవారు తమ కొడుకుల దత్తిచ్చుట వంటిది. కాని కొందఱు దీనికి భిన్నముగా కావ్యకన్యకను బరిణయమునవలె స్వీకరించిన కృతి

పతులు నున్నారు. అప్పు డావిధానమును సమన్వయింప వలసిన పద్ధతులు వేరు. ఈ విధానమునకు మనుమసిద్ధ్యాదు లుదాహరణము.

ఏమయినను కుమారసంభవకర్త కృతిని సప్తసంతానములలో నొక్కదానినిగా భావించి తన కృతిని జంగమ మల్లయ పేర నిలిపె ననుట కాతని పైపద్యమే ప్రబలప్రమాణము. పేరనిలుపుట సంకితమొనర్చుట ఒక్కటే కాని భిన్నములు కావు. ఇం దెవ్వరికిని సందేహ ముండదు. ఉన్నవా రెవరయిన నున్నచో "ప్రభావతీ ప్రద్యుమ్నంబు మద్గురుం డైన యమరామాత్యుని పేర నంకితంబుగ రచియింపంగడంగి" యన్న పింగళిసూరన పలుకు వారి సందేహమును దొలగింపఁ గలదు.

"అంకితము" అనుమాట లేనంతమాత్రమున నది యంకితము కాదని భావించుటయు భావ్యము కాదు. రంగనాథ రామాయణ కృతిపతియగు విఠలభూపతి బుద్ధభూవిభునికి రామాయణమును "తప్పక నా పేరఁ దగ సంగ్రహభాషఁ జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు మర్వి" యని యాజ్ఞ యిడినాఁడట. ఇది యాతఁడు తనకు అంకితముగా రామాయణమును రచింపుమని యాజ్ఞాపించిన విధము. కుమారుఁడు

"పనివూని యరిగండభైరవు పేర
ఘను పేర మీసరగండాంకు పేర
లలితసద్గుణగణాలంకారు పేర
నలఘునిశ్చలదయాయత బుద్ధ పేర
నాతతకృతి పేర నతిపుణ్యు పేర
మాతండ్రి విఠలక్ష్మానాథు పేరఁ
.......................
.......................
చెప్పిన తెలుఁగున శ్రీరామచరిత
మొప్పఁ జెప్పెద..."

నని తనతండ్రి పేర రామాయణమును రచించినాఁడు. ఇక్కడ "పేరరచించుట" యనఁగా నంకితముగా రచించుట యనియే కాని యన్యము కాదు గదా! ఇట్లే రంగనాథరామాయణోత్తరకాండను బుద్ధభూవిభుని పేర రచించినట్లు తత్కర్తలు చెప్పినారు. అక్కడను నిట్లే గ్రహింపవలయునుగదా!

"అంకితము" అనుమాటను వాడకపోవుట కుమారసంభవ కర్త ప్రాచీనతను సూచించవచ్చును గాని యాతఁడు తనకృతిని గురువున కీయలేదనుటను సాధింపదు. కుమారసంభవ కృత్యాదియందే నన్నెచోడుఁడు తనకృతిని గురువున కొసంగుటనుగూర్చి చెప్పిన పద్యము నరయుఁడు :

" శరధినీగులు పయోధరములు కొనివచ్చి
కురిసి వారిధియందుఁ గూర్చినట్లు
చేనఁ బండిన విత్తు చేనిక ఫలకాంక్షఁ
జేర్మిఁ గ్రమ్మర వెదవెట్టు నట్లు
రోహిణాచలపతి కూహించి వరరత్న
సంచయంబున విభూషించునట్లు
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకమ్ముల
నెసకమ్ముగా నర్ఘ్య మిచ్చినట్లు
నింగిముట్టియున్న జంగమ మల్లయ
వరమునందుఁ గనిన వస్తుకవితఁ
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చు పగిదివోలె. "(కుమా. 1-49)

పై పద్యములోని యుపమానపరంపరలు సక్రముగా నర్థము చేసికొన్నయెడల "వారియంద నెగడింతు" నన్నదానికి "వారికే సమర్పింతు" నని యర్థమని సహృదయుల కెవ్వరికయినను స్ఫురింపక పోదు. ఇంతేగాదు, ఈభావమునే తరువాత

" గురువున కిష్టదైవమున
కుం బతికిం గృతి చెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయ
వచ్చు జగంబుల నిశ్చయంబు. "

అను పద్యముచేత గూడ వచించినాడు. ఇక్కడ "కృతి చెప్పుట" యనగా "కృతి రచించుట" యని యర్థము. (మా. సూ. రా. ఆం. నిఘంటువులో "చెప్పు" శబ్దపు 6 వ యర్థము.) గురువునకు గృతి చెప్పుట యనగా గురువునకయి (యాతని కంకితముగా) కావ్యమును రచించుట యని యర్థము.

"రవికులశేఖరుండు కవి
రాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడుఁ డటె
కావ్యము దివ్యకథం గుమారసం
భవమటె సత్కథాధిపతి
భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థయోగధరు
డట్టె వినం గొనియాడఁ జాలదే!" (1-57)

పై పద్యమునందలి కవిరాజు తన కావ్యప్రశస్తిని వివరించినాడు. తాను కవి. కావ్యము కుమారసంభవము. కథాధిపతి జంగమమల్లికార్జునుడు. వీని సమావేశము నిజముగా గొనియాడ దగినది. ఇది కవి భావము.

"కథాధిపతి జంగమ మల్లికార్జునుడు" అనగా నేమో కొంచెము పరిశీలింతము. కథాధిపతి యనగా కుమారసంభవములోని కథానాయకుడు అని యనుకొందమనుకొనుట కుదురదు. కథయందు నాయకుడు జంగమ మల్లయ కాదు గదా! పోనీ మల్లికార్జునుడు శివు డని భావించినచో నప్పుడు జంగమ శబ్దము నిరర్థకము. అంతేగాక కథ కుమారసంభవ మన్నప్పుడే దీనిలో నాయకుడు శివు డనువిషయము చెప్పబడినట్లయినది. కనుక మఱల చెప్పవలసినపనిలేదు. పోనీ యేదో చెప్పినాడంద మన్నచో నింత ముఖ్యమయిన పద్యమునందు దనగురుప్రశంసను కవిరాజు వదలివేసినా డనుటను కవిరాజశిఖామణి సంప్రదాయముల నెఱిగిన సహృదయు లెవ్వరును సమ్మతింపరు. కనుక కుమారసంభవకర్త "కథాధిపతి" శబ్దమును "కృతిపతి కథానాయకు" లను రెండర్థములు వచ్చునట్లు శ్లేషగా వాడి తాను గ్రంథమునందంతటను జూపినట్లు శివునకును దనగురువయిన జంగమ మల్లికార్జునునకు నభేదమును వచించి శివుడు కథానాయకుడనియు జంగమమల్లయ కృతిపతియనియు వచించినాడు. అంతేగాదు జంగమమల్లికార్జును నే ప్రత్యేకించి పేర్కొనుటచేత "కథాధిపతి" యనుదానికి ముఖ్యార్థము "కృతపతి" యనియు తరువాత శ్లేషచే సాధింపదగినది కథానాయకు డను నర్థమనియు నూహింప వీలగుచున్నది.

ఈక్రిందివచనము నరసినచో నన్నెచోడమహాకవి తన కావ్యము నెంతటి భక్త్యావేశముతో తనగురువగు జంగమ మల్లికార్జునునకు సమర్పించినది స్పష్టముగ గ్రహింప వీలగును.

"అస్మదీయ ప్రతిభార్ణవోదీర్ణరుచిరవస్తు విస్తారితోత్తమ కావ్యరత్న విభూషణంబు...జంగమ మల్లికార్జునదేవు...శ్రీపాదంబులు...విభూషించుట అశేష జగజ్జేగీయమానంబు" (1-56)

కవి తన కావ్యమును గురుపాదసన్నిధిని సమర్పింతునను భావమును గదా పైవచనముచేత జెప్పినాడు?

కావ్యాంతమునందు సైతము "ధ్రువమై జంగమ మల్లికార్జునమునీంద్రుం బేర్మి బేర్కొన్న సత్కవిరాజోక్త కుమారసంభవ మహాకావ్యమ్ము" చిరకాలము వర్ధిలవలెనని యాకాంక్షించి కవిరాజు తనకావ్యము తనగురుపాదుల కీర్తిమూర్తి కంకితముగా రచితమయినట్లు చెప్పి తన గురుభక్తిని చాటినాడు.

# గాలిబ్ గీతాలు

## శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు

శ్రీ
స్వయలోపమ్ము లెరుగుట పెద్ద విద్దె
స్వలోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు.

సంతసంబింక నెట్టుల సాధ్యపడును?
మెదడునను పూలతోటలు, మది నెడారి.

ఆమె తోటకు వాహ్యాళి కరిగెనంట
ఇంక తోటలో పూలు వాంఛించు నెవడు!

ఎవతె అధరచక్రమును భావించినానో
రేయి మదినెల్ల చుంబన శ్రేణి వెలసె.

కుసుమములు విచ్చె, మొగ్గలుగూడ విచ్చె
తెల్లవారె, నాయమ కన్ను తెరువలేదు.

ఈ యెడారి ముండ్ల కెడద ముక్కలు చెక్కి
పూలవోలె నిలుపజాలినాడ.

నరములందందరికి రక్త మురుకుగాని
కంట జారని దెట్లు రక్త మగునోయి?

మెరపులో, అగ్నికీలలో దొరుకబోని
అందచందాలుగల యా యొయ్యారి యెవతె?

వత్తునని రాక, నా యింటి వాకిటికిని
నన్నె కాపలాగా పెట్టినా వదేమె?

భ్రుకుటి క్రిందుగ నయనమ్ము పోల్కిగానె
ఆలయము పంచలనె పానశాల వలయు.

అవల వెడలక లోనున్న అశ్రుకణము
పెను తుఫానుగా పైకివచ్చినది నేడు.

గుండెలో నఖిపైనున్న కోర్కె చచ్చె
కారు చిచ్చంటి సకలమ్ము కాలిపోయె.

ఎడదనాడి లోలోన దహించిపోయె
గుప్పుమననట్టి బూదిలో నిప్పువోలె.

చల్లె వ్రణముపై నుప్పు, పూజారి కేక:
వాని కద్దాన నేమి లాభమ్ము కలిగె?

నాయెడందగూర్చి నాకేమి తెలియదు
నేను వెదకుచుండ నీకు దొరకె.

ఏ యలంకరణములేని నేయకగూడ
ప్రియుని నంతగ వలపింతువేమె!

మచ్చలను మృత్యువే కప్పిపుచ్చకున్న
అంబరము లెన్నియున్న దిగంబరుడనె.

మరల పూవుమొగ్గ విరియసాగె: నెడంద
గాయపడియు పిదప కానరాదు.

పేరెడారిని మజ్నుగా కేర్పు పోరు
సంకుచితు చూపువలె నది చాల ఇరుకు.

ఇంట నుండంగ ననుమతి నిచ్చి తీవు-
చుట్టియుండిన నా పక్క నట్టె విడ్చి
పఱచితినో లేదో శయనించుకొనుటకు నేను,
అంతలో "వద్దు, వద్దు పో"మ్మందు వేమె!

స్వాస్థ్య మొసగిన మందిచ్చువారు వలదు
ప్రాణమే పోవ నేడ్చెడివారు వలదు.

ద్వారబంధములును తలుపుతాళము లేని,
ఇరుగు పొరుగు లేని ఇల్లు వలయు:
మాటలాడు వాడు, మందలించెడు వాడు
నెవడు లేని యెడ వసింపవలయు.

# ఏకవీర: కాకతమ్మ

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

పోయిన డిసెంబరు నెల భారతిలో నేను వ్రాసిన 'కాకతి శక్తి ఎవరు?' అన్న వ్యాసమును పుచ్చుకొని శ్రీ గజపతిరాయవర్మగారు మొన్న జూను నెల భారతిలో చాలా చాలా చర్చించారు. వారి చర్చవల్ల కలిగిన ప్రశ్నలు నాలుగు: (1) కాకతమ్మా ఏకవీరా రెండూ ఒకే దేవత పేళ్ళా? (2) చతుర్భుజాలతో వున్న చాముండీ, శిరస్సుమాత్రమే వున్న ఎల్లమ్మా ఇద్దరూ ఎల్లమ్మలేనా? (3) చాముండికి నక్క చిహ్నము సిద్ధమా? (4) ఈ విషయములలో జానపద గాథలు ఏమంటున్నాయి?

నా వ్యాసములో కాకతమ్మ అంటే, చతుర్భుజాలతో, నక్కచిహ్నముతో వున్న చాముండియే ననిన్నీ, ఏకవీర అన్నది పరశురాముని తల్లి రేణుకాదేవి అనిన్నీ వ్రాసినాను. క్రీడాభిరామపద్యములో కాకతమ్మ పేరూ, ఏకవీర పేరూ కలిపి చెప్పడమువల్ల ఇద్దరూ ఒక్కరే అయివుంటారేమోనంటారు వర్మగారు. కలిపి చెపినప్పటికీ 'సైదోడు' అన్న పదము వాడి ఇద్దరూ వేర్వేరన్నట్టుగానే చెప్పినాడు శ్రీనాథుడు. శ్రీనాథుని స్థల, దేవాలయ, క్షేత్ర, వర్ణనలు కచ్చితములూ సర్వవిషయ సంగ్రహములూ అని శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిలుగారు పలుసార్లు చక్కగా నిరూపించారు. శ్రీనాథుడు యదాలాభముగా ఏమాటా విసరడు. లింగాకృతిని 'అర్ధేందుధరుడు' అని వర్ణించాడంటే ఆ లింగముమీద అర్ధచంద్రచిత్రము ఉన్నదన్నమాటే! క్రీడాభిరామములో 'కాకతమ్మకు సైదోడు ఏకవీర' అని అన్నాడంటే ఆయననాడు వారిద్దరూ వేర్వేరు అన్నమాటే.

శ్రీనాథుడు ఏకవీరమ్మను చక్కగా వర్ణించినాడు. నేను 'కాకతమ్మ అనగా ఈమెయే' అని చెప్పిన చాముండి వర్ణనలూ శిల్పాలూ పెక్కులున్నాయి. ఈ రెండు మూర్తులకూ పోలికలు కలవు. ఏకవీర 'సోమసూర్యానలనేత్ర; చాముండికి (బగళ యన్నది ఇంకొక పేరు. బగళాధ్యానములో) 'త్రినయనాం' అని త్రినేత్రాలు చెప్పబడ్డాయి. గోపీనాథరావుగారూ చాముండకు త్రినేత్రములున్నట్లు చెప్పినారు. ఏకవీర ఫణిరాజమండన; (బిక్కవోలు) చాముండి ఒక ఎడమచేతిలో పామును ధరించినది (పూర్వకారణాగమమూ చాముండిచేతి పాముని చెపుతుంది). కాశ్యపీయ శిల్పము ఆమెను 'నాగేంద్రాచ్ఛాదిత స్తన' అన్నది. ఏకవీర 'అఖిల జనని'; చాముండి సప్తమాతృకలలో ఒక్కతె. ఏకవీరాగారము 'నింబపల్లవ నికురుంబ సంధానిత వందన మాలికాలంకృతద్వార'ము. ఈ నాడు నూకాలమ్మ, తలుపులమ్మ, ముత్యాలమ్మ అన్న పలుపేరులతో కొలవబడుతూన్న చాముండికి వేపమండలే చామరాలు. ఏకవీర 'హైహయ రాజ దంతాస్థిపటలమును గవడ పేరుగ జేసి' అలుత గట్టినది. చాముండి 'శిరోమాలాపరీతా' (కాశ్యపీయం), శిల్పాలలో కపాలమాల కనబడుతుంది చాముండికి. ఇన్ని పోలికలుండుటచేతనే కాబోలు కాశ్యపీయ శిల్పము చాముండి లక్షణాలు చెపుతూ "చాముండీ లక్షణం హ్యేవ మేకబేరే చ తత్సమం" అంటున్నది. దీనిలో స్త్రీలింగ సూచన లేకపోయినా 'ఏకబేర' అన్నపదము ఏకవీరనే సూచిస్తూన్నదనిపిస్తోంది. (ఏకబేర అంటే ఒకే విగ్రహము కలది అని అర్థము.)

అయితే చాముండికీ ఏకవీరకూ భేదాలున్నాయి. ఏకవీర 'క్రీశాశూన్యకటీరమండల;' చాముండి వ్యాఘ్రచర్మాంబర. చాముండి కపాల శూలహస్త; ఏకవీర కాదు. చాముండి సంహారకర్త్రి; ఏకవీర కాదు. ఏకవీర జమదగ్ని గారాపు సతి; చాముండి కాదు.

చాముండీ ఏకవీరా సఖులని క్రీడాభిరామములో మాత్రమే కాదు, గజపతి రాయవర్మగారు చెప్పిన కర్ణాట కురుబల గాథలోకూడా ఏకవీర (రేణుక)కు 'సఖిగా చెప్పబడింది చాముండి." కామేశ్వరి పాటలో పార్వతీదేవి భోగావతి కన్యలను ఇద్దర్ని చూచి వారి సైదోడుతనానికి మెచ్చి తనకుకూడా కన్యాసంతానము కావలెనని కోరుకుంటుంది. ఆ కన్యలు 'మాంకాళి వొక్కర్తె మాధవొక్కర్తె' మాంకాళి, కాళిరూప

సాదృశ్యాన్నీ ప్రేతాధిష్ఠానతనీ పురస్కరించుకుని ఈమెను 'చాముండి' అంటే మాధవి ఏకవీర కావలసి వస్తుంది. మాహురమ్మ (రేణుక) కథ అన్న జానపద గేయ కథలో భోగావతి ఏలినరాజు గిరిరాజట. అతని భార్య ఆడసంతానంలేక అనేక నోములు నోమిందట. ఆదిమహాశక్తి (అఖిల జనని ఏకవీర) భోగావతి రాజును పరీక్షించిందట. ఆమె వరమువల్ల ఏకవీర, చాముండి అతనికి కలిగినారని కాబోలు తక్కిన కథ (అంతము వరకూ నేను చూడలేదు). శ్రీనాథుడీ కథ నెరుగును కనుకనే ఏకవీరను "గిరిరాజనందన"గా వర్ణించాడు. జానపద గాథలకూ పౌరాణిక గాథలకూ విరోధము లేదు. "కాకతమ్మకు సైదోడు ఏకవీర" అన్నది జానపదగాథయే, పౌరాణికము కాదు. దేవీ మాహాత్మ్యములో "సృష్టికాలములో దేవి ఉజ్వల నీలదేహముతో మహామాయ, మహాకాళి, మహామారి, క్షుధా, త్రిశ, నిద్ర, తృష్ణ, ఏకవీర, కాళరాత్రి, దురత్యయ అన్నరూపాలతో విలసిల్లునని" ఉన్నదట. కర్ణాటకురుబలగాధా, కామేశ్వరి పాటా, మాహురమ్మ కథా క్రీడాభిరామమూ మరో కథ గ్రహించాయి. మల్లీమాతపురాణము అన్న జానపద గేయకథలో ఏకవీర సృష్ట్యారంభంలో కదలాడిన పరాశక్తియే. ఏకవీర ఆమెయే, కథలుమాత్రమే వేరు.

చతుర్భుజాలతోవున్న చాముండీ శిరస్సుతో మాత్రమేవున్న యెల్లమ్మా ఇద్దరూ ఎల్లమ్మలనే తమవారు వ్యవహరిస్తున్నట్లు గజపతిరాయవర్మగారు చెపుతున్నారు. (చతుర్భుజాలతో వున్న దేవి చాముండి అని వారు ఒప్పుకోలేదనుకోండి. అది ముందు ముందు చర్చిస్తాను) వెల్దుర్తికి ఉత్తరాన 'ఎల్లమ్మగుడి'లో చతుర్భుజశక్తి విగ్రహమున్నది. మండపాక ఎల్లారమ్మ గుడిలోని మూర్తి చతుర్భుజాదేవిది. కనుక ఎల్లమ్మది చతుర్భుజ విగ్రహమేననీ, శిరస్సుమాత్రమేవున్న ఎల్లమ్మ ఈమె రూపాంతరమేననీ గజపతిరాయవర్మగారు అంటున్నారు. శిరస్సుతోమాత్రమే వున్నదేవి ఎల్లమ్మ (రేణుక) అనీ, చతుర్భుజాదేవి ఎల్లమ్మకు సైదోడైన చాముండియేగాని ఎల్లమ్మ రూపాంతరము కాదనీ నేనంటున్నాను. మండపాకలో నేడు పూజలో వున్న చతుర్భుజమూర్తితో డు శిరస్సుమాత్రమేకలదేవికూడా గర్భాలయములోనే కలదు. వెల్దుర్తిలోనూ ఒకప్పుడు ఉండే ఉండాలి, ఎట్లో తిరోహితమైనది అంటున్నాను. గుడిమల్లములో శిరస్సుమాత్రమేకల ఏకారమ్మ, చతుర్భుజశక్తీ (ఈమెయే చాముండి అంటున్నాను నేను) ఇద్దరూ వేరు పేరులతో వున్నారంటున్నాను. కనుక ఇద్దరూ ఎల్లమ్మలే అనడము వారు సైదోడులని తెలియక రూపాంతరములే అని అనుకోడమువల్ల వచ్చిన పొరపాటంటున్నాను.

శిరస్సుమాత్రమున్న దేవి రేణుకయే. వెల్లూరు సమీపము పలకొండలో శిరస్సుమాత్రమేకల దేవతయూ పక్కన పరశురాముడూ ఉన్నారు. క్రీడాభిరామపు బవినీళ్లు ఏకవీరామహాదేవి ఎట్టఎదుట పరశురాముని కథలెల్ల ప్రౌఢితో పాడినారు. యుక్తమే. ఏకవీర జమదగ్ని గారాపు సతి, మున్నేడుమారు లరులజంపిన కొడుకుగాంచిన కోపగత్తె. ఆమెను పితాజ్ఞచే పరశురాముడు నరికెననీ, ఆ శిరము మాలవాడలోపడుటచేత పునరుజ్జీవితము కాలేదనీ, అయిననూ ఆ శిరము పూజించబడుననీ అలంపుర క్షేత్ర మాహాత్మ్యము చెపుతోందట. (గడియారము రామకృష్ణశర్మగారి 'అలంపూరు శిథిలములు') ఆ శిరమునకే యెల్లమ్మ అనిపేరట. శిరముమాత్రమే కల యెల్లమ్మ అలంపూరు తాలూకాలో పలుచోట్లలోను, మహారాష్ట్రదేశపు చిపళూణలో, కర్ణాటక సవరత్తిలో, రేణుకా నామముతో పూజించబడుతున్నదట. వుంపవల్లిలో ఈ ఎల్లమ్మయే హేమలానామముతో పూజించబడుతూన్నదట.

అలంపురములోని బ్రహ్మేశ్వరాలయము ఆదిలో జోగుళాంబ, యోగేశ్వరి అనే పేరులతో ప్రసిద్ధికెక్కిన చాముండిదేవిఆలయమని నాకు తోచుచున్నది. ఇప్పటికీ ఆలయ ద్వారబంధములపైన లంబస్తనులూ ఘోరరూపులూ అయిన చండికా ముండికా స్త్రీ మూర్తులే ద్వారపాలికలుగా వున్నారు. సైదోడైన రేణుకకూడ వున్నది. అలంపురపు జోగుళాంబ 'లంబస్తని, ఘోరరూపి, మహాబల, ప్రేతాసనసమాయుక్త'. జాజ్‌పూరు (విరజాక్షేత్రపు) చాముండ ఇదే రూపము కలది. బిక్కవోలు చాముండరూపమూ ఇట్టిదే. హనుమకొండ గార్గశక్తిదీ ఇదే రూపము. శివుని కంఠపుసెగనుండి యోగేశ్వరి (జోగుళాంబ) జన్మించినదట. ఈమే, సప్తమాతృకలూ అంధకాసుర సంహారకాలములో ఆతని నెత్తురు క్రిందపడకుండాచేసి సహాయపడ్డారట (గోపీనాథరావు). చాముండి చండముండులను చంపి వారి శిరస్సులను అంబికాదేవి కడకు తెచ్చినదని మార్కండేయ పురాణము. శిల్పములను

పరిశీలిస్తే చాముండికీ, యోగేశ్వరికీ ఒకే రూపమూ, చాముండికి, వేరెచోట్ల సుందరరూపమూ కానవస్తున్నాయి. భారతదేశము యూరోపు ఖండమంత విస్తృతికలదేశము. అందు అనేక స్వతంత్ర, పరస్పర శత్రు, రాజ్యములు వెలసినవి. సంప్రదాయాలు అన్నిటా అవేకావు. కనుక యోగేశ్వరీ – చాముండా– లక్షణాలు కలసిపోయి కానవస్తున్నాయి. (అలంపురపు జోగుళాంబకు రేణుకా సాహచర్యమూ ఉన్నది.) జాజ్‌పూరు చాముండికి, కలకత్తా మ్యూజియము చాముండికి వలెనే బిక్కవోలు (బాదామి చాళుక్య సంప్రదాయపు) చాముండికి ఘోరరూపమూ లంబస్తనములూ, కృశోదరమూ, ప్రేతాసనమూ, శూల ఖడ్గ కపాలహస్తములూ కలవు. బిక్కవోలు చాముండకు నక్క-చిహ్నమూ ప్రేతచిహ్నమూ రెండూ ఉన్నాయి. (ఆమెపక్కన కౌమారి విగ్రహమూ, ఆలయ ఆవరణలో వీరభద్రుడూ కలరు. కనుక ఈమె చాముండియే కావలయును.) గోల్కొండ చాముండీ, వెల్దుర్తి (వీరభద్రాలయ) చాముండీ, దోరణాల చాముండీ నక్క-చిహ్నముతో కానవస్తున్నారు. సప్తమాతృకల వరుసలో శూలఖడ్గ, కపాల, డమరుకహస్తములతో నక్క-చిహ్నముతో కనబడుతోంది చాముండ. దొండపాటి కాకతమ్మ బీసుమీద శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు గుర్తించిన కాకతమ్మవి చాముండకు కనపడే ఆయుధాలే. మండపాక (ఎల్లారమ్మ అనుకునే) కాకతమ్మకు ఇవే ఆయుధాలు! చిహ్నలూ నక్కలే కావాలి. గజపతిరాయవర్మగారు అనుమానించినట్లు పందికొక్కులెలాగౌతాయి? పందికొక్కు ఈ చివరి రెండుచోట్ల విగ్రహాల చిహ్నలవలె కాళ్ళమీద నిలబడ జాలదు, కూర్చుంటుంది. పందికొక్కు వీపు తల కంటె ఎత్తుగా గుట్టలాగ వుంటుంది. వీటి రెంటికీ వీపు తల కంటె ఎత్తుగా లేదు. మీదు మిక్కిలి దొండపాటి చిహ్ననికి తోక బరువు నక్కకువలెనే. మండపాక చిహ్నపుతోక పందికొక్కు తోకవలె పొడూగ్గా లేదు. మరి వారి మైక్రోస్కోపుకి ఈ చిహ్నల 'నక్కత్వము' అందలేదంటే నేనేం చెయ్యను? "సప్తమాతృకల వరుసలలోని చాముండ చిహ్నమును పరిశీలించుకోండి" అంటాను. హైదరాబాదులో సప్తమాతృకా శిల్పంలో వుంది నక్క.

కాకతీయ సామ్రాజ్యమందంతటా, మదనపల్లి నుంచి మంథెనవరకూవున్నాయి ఖడ్గ శూల కపాలశూల హస్త దేవి విగ్రహాలు. ఈ ఆయుధాలు చాముండికే కానవస్తున్నాయి, సప్తమాతృకాశిల్పంలో. కనక ఈ దేవి చాముండి అన్నాను. హనుమకొండకోటలోని 'గార్గశక్తి' కాకతిశక్తియొక్క సంస్కృతరూపముఅని అనుమానించాను. ఆమెయే కాకతియొక్క నిండురూపమని, రాజ్యమందంతటా కానవచ్చే చాముండి విగ్రహాలు ఆమె సౌమ్యరూపములు కాబోలనీ అనుకున్నాను. ఇంతల్లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారి వ్యాసము దొరికింది. నేను శిల్పం వైపునుంచి వెతుక్కుంటూ వచ్చిన కాకతిదేవి దొండపాటి సంప్రదాయాన్ని బట్టికూడా కాకతిదేవే అని తెలిసింది. గజపతి రాయవర్మగారు మండపాక విగ్రహాన్ని ప్రచురించారు. ఆమెకూ చాముండికుండే ఆయుధాలే కానవచ్చాయి. క్రింద నక్కబొమ్మ! ఆమె ఎల్లారమ్మ కాదు, కాకతమ్మయేనంటిని. ఈ చతుర్భుజదేవి చాముండియే. ఎల్లారమ్మకాదు. ఎల్లారమ్మకు ఈ ఆయుధాలూ, చిహ్నలూ లేవు. నేను చూచిన చేరి కలకుతోడు గజపతిరాయవర్మగారిచ్చిన ఓరుగల్లుకోట కాకతమ్మ ఎల్లమ్మల సైదోడుతనపు ఫోటో అదనపు సాక్ష్యము కాకతమ్మకు సైదోడు 'ఏకవీర' అనడానికి.

ఈ దృష్టిలో ఇంతవరకూ లభించిన సాక్ష్యము– సారస్వత, జానపదగాథా, శిల్పసాక్ష్యమంతా– చక్కగా అమరిపోతోంది. అమరనిది ఒక్కటే ఒక్కసంగతి. క్రీడాభిరామములో ఏకవీరమ్మకు నిండు రూపమే వున్నదిగదా, మరి ఎల్లమ్మకు 'అలికులనీల వేణీ, పూర్ణరాకేందు ముఖమూ, సోమసూర్యానల నేత్రములూ, హైహయరాజదంతాస్థిపటల మాలికా, ఫణిరాజమండనమూ, ప్రీశాశూన్యకటీర మండలమూతో నిండువిగ్రహము నేడేలకానరాదు? ఈ ప్రశ్నకు జవాబు ప్రభాకరశాస్త్రిలుగారి పరిశోధనల నెరిగిన వారి పుత్రులో, శిష్యులో చెప్పగలుగుతారు. ప్రభాకరశాశాస్త్రిలుగారు "ముక్త్యాలప్రాంతములలో ఏకవీర, మాహురమ్మ...లుగా గుర్తింపదగిన విగ్రహములు నే సేకరించిన వానిలో నున్నవి" అని వ్రాశారు. నా యాత్రలలో నాకునూ 'ఈమె ఏకవీరమ్మా?' అని సందేహము కలిగించిన బొమ్మలున్నాయికాని వేటూరి వార్ల సేకరణలూ 'మాహురమ్మకథా' పూర్తిగా తెలియకుండా నిర్ధారించలేను. నేను ముక్త్యాల మ్యూజియమును చూడలేదు.

# సముద్రపు అంచులు

శ్రీ బాలగంగాధర తిలక్

మసక మసక చీకట్లో పల్లెవాళ్ల గుడిసెలన్నీ చిన్ని చిన్ని పడవల్లా వున్నాయి. ఇక్కడా అక్కడా యిసుక నేలమీద కూర్చుని పొడుగాటిచుట్టలు కాల్చుకుంటూ పల్లెవాళ్లందరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. దూరంగా సముద్రపు హోరు వినబడుతోంది. సముద్రం మీదనుంచి వచ్చే చల్లని ఉప్పనిగాలికి గుడిసెలమీద ఆకులు కదలి చప్పుడు చేస్తున్నాయి. చూరుల్లోంచి నల్లనల్లని పొగా, చేపలకూరవాసనా రుచి రుచిగా వెగటువెగటుగా వస్తున్నాయి.

ఈ మధ్య వీరయ్య వాళ్లందరితోనూ కలవడం లేదు. తన గుడిసెముందు ఒక పెద్ద బండరాయిమీద కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. తమ్ముడు నూకయ్య అరేసిన చేపలన్నిటినీ యీతాకుబుట్టలలోకి ఎత్తుతున్నాడు. అక్కడికి కొంచెం దూరంలో మీసాల వెంకన్న నవ్వు బొంగురుగా బోదురుకప్ప అరచినట్లుగా వినవస్తోంది.

'ఓ మావా. నా వొల్లు నీవొల్లుకు తగిల్తే నీ జబ్బు ఒదల్తది' అన్న నరసమ్మ ఆడగొంతు సన్నగా విభిన్నంగా వినపడుతోంది. ఆ గుంపుకాని, వాళ్ల కులాసాగాని వీరయ్యని ఆకర్షించలేదు.

'అన్ని సేపలూ లోపలెట్టాను. మరేంటి సేసేది?' అన్నాడు నూకయ్య చేతులు దులుపుకుంటూ.

'ఏంటీ లేదు.' వీరా తమ్ముడికేసి చూసి అన్నాడు. 'ఎల్లి గంజార్చు. నా కాకలేత్తంది.'

నూకయ్య గుడిసెలోకి వెళ్లిపోయాడు. వీరయ్య తన ఆలోచనలో అగినచోటు కనుక్కుని ముందుకు సాగాడు.

వీరయ్య అదృష్టం యీవాళ పండింది. తన జీవితంలో అన్ని చేపలు ఎప్పుడూ తను చూడలేదు. పెద్దవీ చిన్నవీ రంగురంగులవీ బలిష్ఠమైనవీ-తన గుడిసె పట్టనన్ని చేపలు దొరికాయి. రోజూ ఏకాపుగా వెళ్లిపోయే తన బ్రతుకులో ఏదో ఆశ కదలి మిలమిల లాడింది. పెద్ద చేపకి రెండు రూపాయలు తక్కువ గావు. తనకున్న చిల్లర అప్పులూ బాకీలూ అన్నీ తీర్చుకోవచ్చును. పైగా పొరుగూళ్లో దగ్గుతో బాధపడే ముసలి తండ్రికి ఓ దుప్పటీ, తమ్ముడికి రెండు యిజార్లూ కొంటాడు. చంద్రికి - తక్కువలో వస్తే ఎర్రంచుల ఆకుపచ్చ చీర ఒకటి కొంటాడు.

ఈ వేళ బాబు దగ్గరుంటే ఎంత సంతోషించును! పుట్టినప్పట్నుంచీ యిక్కడేవుండి ఈ చేపల నమ్ముకుంటూ తింటానికి తిండలేక—పాపం, చివరికి కీళ్ల జబ్బు వచ్చి ఊరుకోని వూళ్లో ఒక్కడూ ఉంటున్నాడు. సత్తెమ్మ మాత్రం ఏదో యింత కాచి పోస్తోంది.

ఊరువిడిచి వెళ్లిపోతూ యిలా అన్నాడు బాబు: 'అబ్బీ! ఈ సముద్రం నా పానాలు మింగేసింది. ఈ పూమ్మారిని వదలి కూలిపని చేసుకో కుర్రాడా.'

నిజంగా యీ సముద్రం అంటే తనకీ ఎంతో భయం. చిన్నప్పట్నుంచీ యీ సముద్రాన్ని తా నెరుగును—ఆ యిసుకవొడ్డునీ, బలంగా కోపంగా వస్తూ తక్కున విరిగిపోయే కెరటాల్నీ, లోతులకి చొచ్చుకుపోయే నీలాల్నీ, లోతు లోతుల్నీ మెరకల్నీ అతనెరుగును. ఇంకా సూరీడు దూరంగా సముద్రంలోంచి ఎర్రగా పైకి లేవకముందే పడవచెక్క లమర్చుకుని, నూకయ్యని కూర్చోపెట్టుకుని నీళ్లల్లోకి వెళ్లిపోతాడు. కొండ అంచులు తడిసిపోయే చివరికంటా వెళతాడు వల వేస్తూ తీస్తూ. సంజెవేళకి ఒళ్లంతా నొప్పులతో కొత్తగా భయంగా భూమ్మీద అడుగు పెడతాడు. శ్రమతప్ప ఏమీ లాభం కనపడదు. ఏమైనా ఉన్నట్టయితే పన్నులు వసూలుచేసే చౌదరి ఆ కాస్తా కాజేస్తాడు.

అటువైపంతా భూమి! అంతులేని భూమి. పచ్చగా నల్లగా గట్టిగా ఎక్కడికో ఎక్కడికో పరచుకుని కోట్లకోలది జనానికి తల్లిలాగా ఆధారంగా వుంది. ఆ భూమ్మీద వుండేవాళ్లకి ఎందుకో బలమూ నవ్వూ కులాసా వుంటాయి. అక్కడ భూమ్మీద తనూ చంద్రీ యిటికలతో కట్టుకున్న ఓ చిన్న యింట్లో వుంటే—

మరి తను ఎందుకు భూమి అంతమయిందని తెలిపే యిక్కడ—యీ జాలిలేని సుఖంలేని సము

ద్రపు ఉప్పుని నీళ్ళల్లో తన తిండిని వెతుక్కుంటున్నాడు ఆ సముద్రంలో వుండే చేపలలాగా? తాను కూడా భూమ్మీదకి వెళ్ళి బ్రతకలేడా? ఇలాగ శ్రమపడి తనూ బాబులాగ అయిపోతాడా? మొన్న మొన్న రంగణ్ని చూశాడు! తనలాగే మాంచి వయస్సులో ఉన్నవాడైనా, పెదవులదగ్గర యేడుపులాంటి నవ్వూ, కళ్ళచుట్టూ నల్ల నల్లని ముసలితనం వేలాడుతూండడం చూస్తే తనకి బెంగా దిగులూ కలిగాయి. చౌదరి మొన్న పెళ్ళంతో పిల్లలతో షికారువచ్చాడు. నిండుగా పచ్చగా గుమ్మడితీగలాగా ఉన్నారు. దేబరితనం విసుగూ రోతా వాళ్ళ మొహాల్లో లేవు. తనకీ అలా ఉండాలనిపిస్తుంది. మీసాల వెంకన్నలాగ పెళ్ళి చేసుకోక ఒళ్ళుపాడైపోయిన నీతిలేని నరసమ్మచుట్టూ తిరుగుతూ అసహ్యంగా మోటుగా అయిపోతే! ఛీ-ఆ నరసమ్మలో ఏముంది? పెద్దపెద్ద రొమ్ములేసుకు తిరిగితే తను లొంబడతాననుకుంది కాబోలు, చంద్రి తనకి వుండగా యిలాంటి ముండెల్ని తనదగ్గరకి రానిస్తాడా? సత్తెమ్మని చూస్తే తెలియడంలేదూ, బాబు పెద్దపెద్ద కండల్నీ గుండెల్నీ తినేసింది!

వీరయ్య గుండెల్లో రూపాయలు చప్పుడయ్యాయి. గట్టిగా నవ్వాడు. నవ్వు గాలిహోరులో ముడతలుపడిపోయింది. గుడిసెల్లోంచి చేపలకూరవాసన వస్తోంది. ఇంతలో వెంకన్న వీరాయింటివైపు వస్తున్నాడు. వెనకాల ముగ్గురు నలుగురు బెస్తవాళ్ళున్నారు. నరసమ్మ ముందుగా నడుస్తూ ఏదో పదం పాడుతోంది—చేతులు తిప్పుతూ.

'ఇయ్యాల రేతిరికొత్తాను యీరయ్యమావా' అంది నరసమ్మ. అందరూ నవ్వారు. వీరయ్య యేవగింపుతో 'పోయే ముండా' అన్నాడు. వెంకన్న ముందుకొచ్చి 'ఏం, నీసెందిరికన్న బాగూనేదూ?' అన్నాడు.

'దానితోసాటేంటి థూ!' అన్నాడు దూరంగా జరిగి వీరయ్య.

'యీపు సెక్కగుర్తది జాగత్త' అన్నాడు వెంకన్న.

'ముందు నీయీపు సూసుకో.' నిర్లక్ష్యంగా అన్నాడు వీరయ్య. నరసమ్మ కొప్పు సవరించుకుంది. గాజులు గలగలలాడేటట్టు చెయ్యివూపుతూ 'సూత్తాంగా నీ సెంద్రమ్మగుణం. నీకు తెలీకుండా అది...' అంటూ ముందుకు సాగిపోయింది.

వెంకన్న భళ్ళున నవ్వుతూ ఆమెవెనకాలే వెళ్ళాడు. 'అబ్బో? మాలావు పెద్దమడిసే యీడు' అన్నాడు. అందరూ మరింత పెద్దగా నవ్వి అక్కణ్ణుంచి కదలిపోయారు.

కొంచెంకొంచెం వెన్నెల వస్తోంది. వెళ్ళిపోయే నరసమ్మనీ వెంకన్ననీ చూస్తూ ఉండిపోయాడు వీరయ్య. తమ్ముడు గుడిసెలోంచి పిల్చాడు. వొళ్ళు విరుచుకుని నిర్లక్ష్యంగా నవ్వుకుంటూ లోపలికి వెళ్ళాడు.

వీరయ్యకి వడ్డించి నూకయ్య కుండపెంకులో తనకి అన్నం పెట్టుకున్నాడు. బుడ్డిదీపపు వెలుగులో యిద్దరూ వికృతంగా ఉన్నారు.

'ఎన్నిరూపాయ లొత్తయ్ నిజం సెప్పు.' అన్నాడు నూకయ్య.

'యాభై.'

'అమ్మో అమ్మో!' నూకయ్యనోట్లో ముద్ద ముద్దలాగే వుండిపోయింది.

'ఆడు—ఆయెంకన్న కళ్ళోడోసుకుంటన్నాడు' అన్నాడు వీరయ్య.

'ఏంసేత్తవ్ అంత డబ్బూ?' అన్నాడు నూకయ్య. వాడిదృష్టి డబ్బుమీదే వుంది.

'నీకోలాగూ సాక్కు కుట్టిత్తాలే.'

నూకయ్య గబుక్కున చప్పట్లు కొట్టాడు. ఎడం చెయ్యికూడా పులుసుతో తడిఅయింది. తొందరగా కాళ్ళకి రాసేశాడు. ఇంక తన్ని పంచభూతాలూ చులాగ్గా స్వంతంలాగ స్పృశించలేవు. తను వాటిని తొడుక్కుని తిరణాల కెళ్తే...!

'సెందిరికో సీర కొంటాను' అన్నాడు వీరయ్య.

'అమ్మో అమ్మో!'

'బాబుకో దుప్పటీ కొంటాను.'

'అమ్మో అమ్మో!'

'పాపం బాబు ఏంసేత్తుండాడో ముసిలోడు.'

నూకయ్య దిగులుపడ్డాడు. బాబుని చూడాలనే కోరిక వాడిలో చాలాకాలంనుంచి గూడుకట్టుకుని వుంది.

'మరి డబ్బంతా అయిపోనాక ఏంటి సేసేది?' అన్నాడు నూకయ్య కాస్సేపు ఆలోచించి.

వీరా మొహం నల్లపడింది. డబ్బుతో యిదీ అదీ కొంటే యింక మిగిలేది ఏమీ ఉండదనే జ్ఞానం చురుక్కున గుండెకి తగిలింది. తిరిగి డబ్బులేక ఆ సముద్రపు

నీళ్ళల్లో గెడవేసుకుంటూ పోవాలి. అలాగే బతికి నన్నాళ్లూ పోతూవుండాలి. వీరయ్యకి కోపం వచ్చింది. కంచం ఓపక్కకు విసురుగా తోసి యిలా అన్నాడు:

'ఏంట్రా నూకా, నీ కూడెట్టాలి. ముసిలోడికి డబ్బివ్వాలి. ఎవడు సేత్తా డిదంతా. తెచ్చిన కూంతా మీకే అయిపోతది. పో, నువ్వు వేరేపోయి నీ బతుకు నువ్వు చూసుకో. నాకెందుకు మీ అందరి పూనూ.'

అన్న హఠాత్ కోపం నూకయ్యకి అర్థంకాలేదు. ఏడుపు వచ్చింది. వీరయ్య యివతలకి వచ్చి బండమీద కూర్చుని చుట్ట ముట్టించాడు. తిన్న అన్నమంతా కడుపులో విరిగిపోయినట్టయింది. ఆ చౌదరిలాగా ఖర్చుపెట్టినా తరగని డబ్బు ఎలాగ సంపాదించడం? తన సెందిరిని మనువుసేసుకుని ఒక చిన్న యిల్లు కట్టుకోవడం ఎలాగ? ఈ సమస్యకి తుది మొదలూ తేల్చుకోలేక వీరయ్య నిస్సహాయంగా ఆకాశంలోకి చూస్తూ కూర్చున్నాడు.

గుడ్డివెన్నెల అంతటా ఆవరించుకుంది. పల్లె వాళ్ళ గుడిసెల నీడలు పొడుగ్గా సాచుకుని వున్నాయి. ఇసుక నేల తరంగాలులేని సముద్రంలాగ వుంది. ఓ ముసిలివాడు కర్రని చప్పుడుచేస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ వీరయ్య దగ్గరకే వచ్చాడు.

'ఓస్. గవరయ్యమాఁవా. రారా' అంటూ లేచి వీరయ్య ముసలాణ్ణి జాగ్రత్తగా బండమీద కూర్చోపెట్టాడు. గవరయ్యకి కళ్ళు కనపడవు. బాగా వంగిపోయాడు. ముసలివాడైపోయాడు. 'వీరా యీరా. బాగా సేపలుపడ్డయిటగా' అన్నాడు.

'ఏదోలే మాఁవా.'

'సరిసర్లే. అందరూ యిదేమాట. జాగత్తరో అబ్బి. పదిలంగావుండు. అందరికీ శానాకష్టంగా వుంది.'

'బ్లొదేం తిన్నానా ?'

'ఈమాట సొప్పటానికే వొచ్చాన్రా. పోతా పోతా' అంటూ ముసలాడు లేచాడు.

'మళ్లీ అంతదూరం యెల్లలేవు. ఇక్కడే తొంగో మాఁవా' అన్నాడు వీరయ్య.

'రోజూ మీఅత్త కల్లోకివత్తందిరా. నన్నుకూడా రమ్మంటందిరా' అని ఆగి గవరయ్య 'బాబూ యిలారా' అన్నాడు. వీరయ్య దగ్గర కెళ్ళాడు. వీరయ్య వొళ్ళు నిమురుతూ 'ఇంక ఎప్పుడో జీవుడు లేచిపోతాడ్రా అబ్బి. సత్తే నా గుమ్మం దగ్గరే సత్తాను. అక్కడే మీ అత్తా పానం వదలింది. ఓమారు నిన్ను సూద్దామని బుద్దయింది. మనోళ్లల్లో మీరే గదరా మిగిలిందీ. ఏడీ నూకడు నిదరోనియ్యి. లేపమాకు' అంటూ వణకుతూ కర్రతో దారి చూసుకుంటూ గవరయ్య వెళ్లిపోయాడు. వీరయ్య గుండెల్లో తెలీని బాధ కలిగింది. గవరయ్య చెల్లెలే తన తల్లి. మామ చెప్పినట్టు మూడు నాలుగు కుటుంబాలు బందరు వదిలి ఎప్పుడో యీ వూరు వచ్చేశారు. ఇక్కడ ఒక్కొక్కళ్ళే సముద్రానికి ఆకలికీ రోగాలకీ ఆహుతి అయిపోయారు. తనే మిగిలాడు. గవరయ్య మామ కూడా చచ్చిపోతాడు. బాబుకూడా చచ్చిపోతాడు. గవరయ్యమామకి అత్తంటే ప్రాణంలో ప్రాణం. ఆమె పోవడంతో మతిలేనివాడైపోయాడు. అత్త తనకి చేగోడీలు చేసిపెట్టేది. అత్త చచ్చిపోయింది. అందరూ చచ్చిపోయారు. తన కెవరున్నారు? బారుమని ఏడవాలనిపించింది. కాని చంద్రి జ్ఞాపకం వచ్చింది. తమ్ముడు నూకడు జ్ఞాపకం వచ్చాడు. గబగబా గుడిసెలోకి వెళ్ళాడు. నూకడు నేలమీద పడుకుని నిద్రపోతున్నాడు. వాడి కళ్ళమ్మట కారిన నీటిచార బుడ్డిదీపపు వెలుగులో నల్లగా కనపడుతోంది: వీరయ్య పరీక్షగా చూశాడు. వాడి వళ్ళంతా ప్రేమగా తడిమాడు. అక్కడున్న నులకమంచం వాల్చి, తమ్ముణ్ణి రెండుచేతులతో ఎత్తి దానిమీద పడుకోబెట్టాను. తానోక చదర తీసుకుని బయటికివచ్చి, యిసుకమీద పరచాడు.

'చెంద్రి రాలేదేం, యియ్యాల' అనుకున్నాడు గట్టిగా. ఇంకా ఆశతో ఆమెకోసమే అన్నట్టు చూస్తూ చదరమీద కూర్చున్నాడు.

## 2

వెన్నెల మరికొంత వచ్చింది. నీడలు చిన్నవయాయి. పల్లె అంతా నిశ్శబ్దంగా ఉంది. కొందరు మాత్రం యిళ్ళ కివతల యిసుకలో పడుకున్నారు. అర్థంలేకండా అంతటా వ్యాపించిన ఆకాశాన్నీ చుక్కల్నీ చూస్తో పడుకున్న వీరయ్యకి క్రమంగా నిద్ర పట్టింది.

నిద్రామాయ మసక మసక మడతల్లో జడమైన వీరామనస్సుకి ఏదో తగిలినట్టయింది: కళ్ళు తెరిచాడు.

'అస్సె—ఏంటదీ' అన్నాడు బధకంగా. కిలకిల నవ్వింది నరసమ్మ. 'అప్పుడే నిదరేంటి?' అంది.

వీరా దూరంగా ఒత్తిగిల్లాడు. చెవులు దాటి జుట్టుపడుతూంటే, వెనకాల ముడిచుట్టుకుని రవిక

లేకండా పైటకప్పకున్న నరసమ్మని మాశాడు. తన కోసమని ఒక్కతే యిలా రావడం కొంచెం గర్వం కలిగించింది వీరయ్యకి.

'ఏం యిలాగొచ్చినావ్?'

'రాకూడదేంటీ!'

'పైట సరీగ్గా యేసుకో, సిగ్గులేదూ.'

'నీ దగ్గరేనా యీరయ్య మాఁవా.'

నరసమ్మ దగ్గరగా జరిగింది. ఆమె చనువు వీరాని కంగారుపెట్టింది. కాని అతనికి మీసాల వెంకన్న జ్ఞాపకం వచ్చాడు. ఏదో చీదరగా అనిపించింది.

'ఇయ్యాళ్ల మాంచి లాబం వత్తదేంటే' అంది నరసమ్మ గోముగా.

'ఎంతలే - ఓ యాభైరూపాయలు' గర్వంగా అన్నాడు వీరయ్య.

'యెన్నెల బాగుం దీరయ్య మాఁవా.'

వీరా మాట్లాడలేదు.

'ఇక్కడ నీపక్కనే కూంతసేపు నడుం వాలుత్తా-ఏం?'

వీరా తటపటాయించాడు. నరసమ్మ నవ్వింది. దగ్గరగా వెల్లకిత్తలా పడుకుంది.

వీరా తన చిక్కని నల్లని మీసం సవరించుకున్నాడు. బిగువైన ఆమె రొమ్ములు గుండ్రని పిక్కలూ వీరా మనస్సుని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. వెన్నెలరాత్రీ, స్త్రీసామీప్యమూ, దృఢమైన అతని ఆరోగ్యమూ మనిషి హేతువును మించిన హేతువుకి ఉద్దీపకాలుగా వున్నాయి. ఇటూ అటూ చూశాడు. నిద్రలో నిశ్శబ్దంలో మునిగివుంది పల్లె అంతా. దూరాన గుడిసెలోంచి ఏదో సన్నని ఏడుపు వినవస్తోంది.

'కిందనే తొంగున్నావు నరసమ్మా. నా సదర తీసుకో' అన్నాడు వీరయ్య.

'ఒద్దులే.'

వీరయ్య అతిప్రయత్నంమీద మరొక పక్కకు తిరిగి 'సాల్లే నీ యేసాలు. నాను లొంగేవాణ్ని కాను' అన్నాడు. నరసమ్మ ఫక్కున నవ్వింది. ఆ నవ్వులో గొప్ప నైర్భా ధీమా వున్నాయి. అతనిమీద వొరిగి కావలించుకుంది. 'ఎంత కమ్మగున్న వీరయ్య మాఁవా' అంది.

'లేకపోతే యెదవ యెంకన్న నేంటే' అన్నాడు వీరయ్య. ఆమెను పొదివి పట్టుకుని గుండెలకు హత్తుకున్నాడు.

'ఈ మద్దె మహాసిక్కయింది' అంది నరసమ్మ.

'ఏంటే...'

'నానున్న గుడిసె అద్దెకి నిక్కచ్చి సేత్తన్నాడు సిల్లిగవ్వ నేదు.'

'ఎంకన్న వున్నాడుగా.'

'రోజూ కల్లోయిత్తాడుగా. ఇంకేం మిగులుద్ద ఆడిదగ్గర?'

నరసమ్మ కౌగిలి విడిపించుకుని పక్కకి జరిగింది. వీరయ్య రమ్మంటూ చేతులు చాశాడు.

'అద్దెనూట ఏం సాహ్వావు మాఁవా?' అంది నరసమ్మ.

'రారా' అన్నాడు వీరయ్య.

'అయిదు రూపాయ లిప్పిత్తావా?'

'నాదగ్గర నేదు.'

'అదేంటి మాఁవా, నీదాన్ని కాదా?'

'నాదగ్గర నేదు.'

'పోనీ మూడు రూపాయలియ్యి. కట్టం గడుపు.'

'నాదగ్గర నేదు.'

నరసమ్మ చివాలున లేచింది. 'అయితే నేంను' అంది విసురుగా. వీరాకి కోపం వచ్చింది. సిగ్గు వేసింది, అసహ్యం వేసింది. వెన్నెలలాంటి చంద్రి నవ్వూ స్నేహమూ కళ్ళముందు నిలిచాయి. 'పోపో ముండా. డబ్బుకోసం వొచ్చినావ్ పింజారిముండా. ఛీ! ఛీ!' అని అరిచాడు.

'ఉత్తినే అన్నాను మాఁవా' అంది నరసమ్మ పరిస్థితి చెయ్యి దాటుతోందని గ్రహించి.

వీరా లేచి చదర తీసుకుని 'ఛీ! ఛీ! నా గుమ్మం కాడనుంచి పో. నిన్ను సూత్తేనే పాపం' అంటూ గబగబా గుడిసెలోకి వెళ్లి తలుపులు వేసుకున్నాడు.

బిత్తరపోయిన నరసమ్మ. దగ్గరకి యెంకన్న చాటునుంచి వొచ్చాడు.

'ఏంటన్నాడూ?' అని అడిగాడు.

'ఇయ్య నేదు దొంగనాకొడుకు. కాని ఆడివొళ్లు బలేగావుంది.'

## 3

తెల్లవారగానే పట్నంనుంచి వర్తకులు వచ్చారు. వీళ్లు సేపన్ని బేరంచేసి కొనుక్కుపోయి లాభాని కమ్ముకుంటారు. పెద్దసంత నరసింహులు వీరయ్య గుడిసె దగ్గరకి వచ్చాడు. అతనితోపాటు వెంకన్నా యింకా

కొందరూ కూడా వున్నారు. వర్తకులకి దగ్గరుండి బేరంలో సహాయంచేసి పెద్దరికం వెలిగించి పావలా అర్థా సంపాదించుకుంటాడు వెంకన్న - అసలు వెంకన్న ఏ గొడవొచ్చినా అక్కడుండి పూనుకుంటాడు. పూనుకుంటాడు. పన్నుల చౌదరితో మంతనాలు సాగిస్తాడు. అందుకే వెంకన్న అంటే అందరికీ కొంచెం భయంకూడా వుంది.

నూకయ్య గుడిసె యివతలే కూర్చొని పద్దోము కుంటున్నాడు. తెల్లని సూర్యకాంతి యిసుకమీద వెండి రేకులా మెరుస్తూవుంది. పల్లెవాళ్ల నల్లని శరీరాలు మరికొంత నల్లగా నిగనిగలాడుతున్నాయి.

నరసింహులు వెంకన్నవైపు రెండు పొగాకు కాడలు విసిరాడు.

'తీసుకోరా యెంకా. ఈ వీరన్న ఏదైనా సబబుగా యిస్తాడా?' అన్నాడు.

'మా లోబం మడిసండి బాబూ. ఆడికి డబ్బు పోగుసేసి పోగుసేసి మీలాగ అయిపోవాలని వుందండి' అన్నాడు వెంకన్న పుగాకు పాయ తుంపుతూ.

'నీకుమాత్రం లేదట్రా?'

వెంకన్న గర్వంగా అందరికేసీ చూసి యిలాగ అన్నాడు: 'మనకెందుకురా పోగుసేసుకోవడం. ఏరోజు కారోజుదే. యెదవడబ్బు, మనదగ్గరుండదు- అలాటి పెబువులకి కాని.'

నరసింహం వెంకన్నని దగ్గరగా పిల్చి చెవిలో ఏదో చెప్పాడు.

వెంకన్న వికటంగా నవ్వి గుడిసెలోకి వెళ్లాడు. కాస్సేపట్లో వీరాతో యివతలకి వచ్చాడు.

'దండం బాబూ' అన్నాడు వీరయ్య. నూకయ్య చేపలబుట్టలు ఒక్కొక్కటే యివతల పెట్టాడు. పాతిక రూపాయల్నుంచి బేరం సాగింది. వీరయ్య ఆఖరుకి యాభై కావాలన్నాడు. దమ్మిడీ తగ్గితే యివ్వనన్నాడు. యాభై అంటే నూర్లో సగం. ఇంకో యాభై సంపాదిస్తే నూరవుతుంది. అదీ వీరయ్యలెక్క. మొదట డెబ్బై చెప్పినా వీరయ్యకెందుకో యాభై అన్న అంకెమీదనే మోజువుంది. ఆ అంకెనుంచి ఎంతచెప్పినా దిగలేదు. ఇక లాబంలేదని నరహసింహం సొమ్మిచ్చి బుట్టలు పట్టించుకు వెళ్ళాడు. వీరా మెరిసే కళ్ళతో అయిదు పదినోట్లనీ మొలకి కట్టాడు. రెండు మూడురోజుల శ్రమకి ఏపల్లెవాడూ ఈమధ్య యింత సంపాదించలేదు. వీరయ్యలాగ పట్టుదలగా వాళ్ళు సముద్రాన్ని గాలించనూ లేదు. ఆపూటగడిస్తే చాలను కుంటారు. మిగిలితే తాగుతారు. వాళ్లల్లో కష్టపడే బలమూ ఓపికా ఇచ్చా ఏనాడో లుప్తమైపోయాయి.

'ఓ రెండురూపాయలు నాకియ్యి. మళ్ళీ ఇచ్చేత్తా' అన్నాడు వెంకన్న చెయ్యిజాపుతూ.

'నీకెందుకివ్వాలి?'

'నాను బేరంచేసి పెట్టాను' అన్నాడు వెంకన్న.

'ఆడితో వొచ్చినావు. ఆడిదగ్గరే పోయి పుచ్చుకో.'

వెంకన్న కోపంగా చూశాడు. వీరా లక్ష్యం చెయ్యక నూకయ్యని పడవచెక్క లమర్చమని పంపించాడు. వెంకన్న వీరాదగ్గరగా వెళ్ళాడు.

'మద్దెవరికి మామూలుంది తెల్సా?' అని కోపంగా అడిగాడు.

'అవసరమైనోడు నాదగ్గరికి ఒత్తాడు. మద్దె నీ ఊసేంటి?'

'నూసుకో నీపని సెప్తా' మీసం దువ్వాడు వెంకన్న.

'పోరా తాగుమోతుకొడకా.'

వెంకన్న కళ్లు ఎర్రపడ్డాయి. హుంకరించాడు. 'మామూలిత్తావా, సెంపదరగొట్టనా' అంటూ మీదకు వెళ్ళాడు. వీరయ్య కలియబడ్డాడు. కుస్తీ ప్రారంభమయింది. తక్కినజనం అందరూ వింతగా సరదాగా చూస్తున్నారు. చప్పట్లు కొడుతున్నారు. చుట్టుపక్కల గుడిసెల్లోంచి ఆడవాళ్లుకూడా - కొందరు పిల్లల్ని చంకనవేసుకుని మరీవచ్చారు. ఈ కలహానికి కారణమేమిటో ఆతురతతో వాకబుచేస్తున్నారు.

వీరా బలంగా వెంకన్నని తన్నాడు. వెంకన్న గిర్రునతిరిగి యిసుకలో పడ్డాడు. మళ్లీ లేవలేక పోయాడు. నోట్లోంచి నురగవస్తోంటే తుడుచుకుంటూ బూతులు తిడుతున్నాడు. జుట్టునెరిసిన ఒకముసిలాడు యింకా మీదకి ఝంఘించే వీరయ్యని ఆపి 'ఇంక సాల్లే. నువ్వెళ్లు యీరయ్యా' అన్నాడు. వీరయ్య వొళ్లు దులుపుకొని సముద్రంవైపు వెళ్ళిపోయాడు. వెంకన్న లేచి గాలిలో పిడికిలికొట్టుతూ బూతులు తిడుతూ తూలుతూ వెళ్లాడు. నల్లగా మాసిన గుడ్డలతో చింపిరి తలలతో కళలేని కళ్లతో నీరసంగా వెకిలిగా నవ్వుకుంటూ తక్కినవాళ్ళు విడిపోయారు.

వీరయ్య సముద్రం దగ్గరకి వెళ్లాడు. నూకయ్య పడవని సిద్ధం చేస్తున్నాడు. పక్కనే ఆకుపచ్చ చీర

కొంగు గాలికి ఎగురుతూంటే నవ్వుతూన్న చంద్రి కనపడింది. వీరా 'ఓహోయ్' అని పిలిచాడు. ఆమె కువకువలాడే గొంతుతో 'ఓహోయ్' అని పలికింది.

చంద్రి నలుపైనా అందంగా వుంది. పెద్దకళ్ళూ, కోటేరేసిన ముక్కూ, బలంగా వంపులుతీరిన దేహమూ— అన్నిటికన్నా ఆమె స్వచ్ఛమైన నవ్వు, సముద్రపు కెరటాల నురుగు సూర్యకాంతిలో మెరసినట్టుగా అకల్మషంగా హాయిగా నిండుగా ఉంటుంది. చంద్రి పరుగున వెళ్ళి వీరా వొళ్ళో వాలింది. వీరయ్య రెండు చేతులతోనూ చంద్రిని పైకెత్తి గిర్రున తిప్పి మెల్లగా యిసుకమీద పడుకోబెట్టాడు. ఎండలో ఆమె చెక్కిన రాతి శిల్పంలా నిగనిగలాడింది. ఈమె తనదే నన్న గర్వమూ తృప్తీ అవ్యక్తంగా వీరయ్యలో కలిగాయి. నవ్వుతూ అడిగాడు. 'నిన్న రాలేదేం పిల్లా?'

'నిన్న సేతినిండా పనివుంది బావా.'

'మరి యియ్యాల ఎలా గొచ్చినావ్ సిలకా?'

'నాకు కడుపునొప్పి అని యేడ్చాను.'

వీరయ్య గుండెనిండా నవ్వాడు. తన చేపల్ని గురించీ వచ్చిన సొమ్మును గురించీ చెప్పాడు. చంద్రి కళ్ళు పెద్దవి చేసుకు వింది. వాళ్ళల్లో సుప్తమైన కలలూ ఆశలూ రేగాయి. ఇద్దరూ దూరంగా భూమ్మీద యిల్లు కట్టుకుని కులాసాగా ఆ చౌదరిలాగా...

వీరయ్య పట్టుదలతో అన్నాడు. 'సెంద్రీ సూడు. సెలతిరిగే టప్పటికి మూడొందలు సంపాదిత్తాను. ఇంకా ఇంకా సంపాదిస్తాను. ఈ యెదవపల్లి వొదిలి పోదాం.'

'నాకు సొక్కాలూ' సాగదీశాడు నూకయ్య.

'సర్లే యెదవా. కుట్టిత్తాలే.' వీరయ్య చంద్రి చెయ్యి పట్టి లేవదీశాడు. 'నీకు ఓసీర కొంటాను.'

'నా కెందుకు బావా యిపుడూ.'

'మనువు సేసుకోవద్దూ పిల్లా.'

చంద్రి ఆనందంగా అతనికేసి చూసింది. గబుక్కున సిగ్గుతో తలదించి 'సాలాఖరుకు నాజీతం వత్తది కదా. అది కూడా నువ్వే తీసుకో' అంది.

'నీ డబ్బెందుకు నాకు పిల్లా. యీరయ్యంటే ఏంటనుకున్నావ్!'

'మరి యిల్లు కట్టుకోవద్దా ఏంటి పిల్లోడా. ఇల్లు కడితే శానా డబ్బవుద్ది.'

వీరయ్య మౌనంగా అంచనా వేస్తున్నాడు. ఆకలీ - రేపటిని గూర్చిన భయమూ లేకుండా గౌరవంగా బతకాలని కోరనివా రుండరు. కాని ఆ పేదరికం పొలిమేర దాటడం కష్టం అని వీరయ్యకి తెలియదు. ఆ పొలిమేర దగ్గర నీచత్వమూ నిరాశా రోగమూలాంటి పెద్ద పెద్ద అగడ్త లుంటాయి. పై అంతస్తులోనికి ఎగరడానికి చేసే ప్రయత్నం అతికష్టమైనదీ అపాయకరమైనదీ కూడా. కాని వీరయ్య ధనం దేనికైనా మూలం అని గుర్తించాడు. కేవలం తన కష్టంవల్లనే తప్ప మరోమార్గం సంపాదనకి లేదనీ తెలుసుకున్నాడు. ఆ వచ్చిన ధనం తన్ని అంటి పెట్టుకుని ఉండాలి. కాని యీచంచల పదార్థం ఉన్న చోటికే వెళ్ళే దుర్గుణం కలిగి వుందని అతనికి తెలియదు. ఏమైనా దారిపొడుగునా జయించుకుపోవాలనే పట్టుదల అతనిలో వుంది. అందుకోసమే తక్కిన తన వాళ్ళల్లో ఉన్న అలసటనీ అవినీతినీ తనలోంచి తుడిచిపెట్టి నియమబద్ధంగా బతకాలనుకున్నాడు. అందుకోసమే నరసమ్మ సెత్తుగులేని వలపుకి దూరంగా తొలగాడు.

పడవ సముద్రంలో వూగింది. రెండు కుండలలో గంజీ కూడూ పెట్టి పడవలో ఉంచారు. తెరచాప గాలికి వయ్యారంగా ఆడింది. ఎండముదిరిన వేడికిరణాలు చల్లని సముద్రాన్ని తాకుతున్నాయి. 'నాను కూడు వొండి ఎదురు సూపులు సూత్తాంటాను.' అంది చంద్రి.

'ఇయ్యాల నాసామిరంగా యింకా ఎక్కువ సేపలు పట్టుతౌను'అన్నాడు వీరయ్య.

'తొరగారా యేం!' అంది చంద్రి.

పడవ పడుచుపిల్లలాగా కెరటాలమీద సాగింది. చంద్రి చూసి చూసి వెనక్కి తిరిగింది.

## 4

చంద్రి కేమీ తోచలేదు. ఒకర్తె వీరయ్య గుడిసెలో కూర్చుంది. తన కాముందుల యింట్లో అయితే యిటువంటప్పుడు విధవకూతురు సుబ్బమ్మ గచ్చనకాయలాడడానికి పిల్చేది. పాపం ఆవిడ చాలా మంచిది. ఏం చేసుకున్నా తీసుకొచ్చి తనకి పెడుతుంది. తనతో ఎన్నో చెపుతుంది. సుబ్బమ్మ మొగుడితో కొన్నాళ్ళు కాపరం చేసింది. ఎప్పుడూ ఆ కాపరం గొడవలే చెప్పేది. ఇప్పటికి తాను అయిదేళ్ళనుంచీ అక్కడే

పనిచేస్తోంది. ఏడాదికి యిన్ని బస్తాలని ఒకేసారి కొలుస్తారు. ఇదివరకు తన తల్లి బతికి ఉన్నప్పుడు ఆమె జీతం తెచ్చుకునేది. అన్నగారిని కూడా యింట్లో పెట్టుకుని పోషిస్తూ వుండేది. కాని తల్లి ఏడాది క్రితమే మారకంవచ్చి చచ్చిపోయింది. తల్లి పోవడంతో చంద్రికి సర్వం శూన్య మనిపించింది. మేనమామ వేళకి తిని తత్వాలు పాడుతూ కూర్చుంటాడు. ఇంటిగొడవ పట్టించుకోడు. తనకీ చచ్చిపోవా లనిపించింది. కాని వీరయ్య తనకోసం పల్లెనుంచి మూడుమైళ్ళు నడిచి వచ్చేవాడు. ధైర్యం చెప్పేవాడు. నవ్వించేవాడు. అల్లరిచేసేవాడు చీకటి పడగానే వెళ్ళిపోయేవాడు. వీరయ్యనీ, వీరయ్య కబుర్లనీ తలచుకుంటూనే నిద్ర పోయేది. చంద్రి మామూలు మనిషైంది. ఉత్సాహంతో ఆశతో భవిష్యత్తులోకి చూసింది.

చంద్రి గుడిసె తలుపు గొళ్ళెంపెట్టి అప్పలమ్మ గుడిసె దగ్గరకు వెళ్ళింది. అక్కడ చౌదరి అప్పలమ్మతో ఏదో గుసగుసలాడుతున్నాడు చంద్రిని చూసి 'ఈ పిల్ల వీరయ్యకోసం వస్తూంటుంది కదూ!' అని పరీక్షగా చూశాడు. చంద్రికి ఏదో సిగ్గువేసి కుంచించుకు పోయింది. పన్నులు వసూలుచేసే చౌదరి యిక్కడేందుకున్నాడా అనుకుంది. అప్పలమ్మ ఆప్యాయంగా చంద్రిని పిలిచి కూర్చోబెట్టుకుంది. చౌదరి వెళ్ళిపోయాడు.

'లచ్చిమిలాంటి పిల్లవు. నీరేక మంచిదిలే' అంది అప్పలమ్మ సన్నని వంకర చేతులతో చంద్రి చుబుకాన్ని పుణుకుతూ. 'మరి మా యీరయ్యని పెళ్ళెప్పుడు సేసుకుంటావో కోడలా?' అంది.

చంద్రి సిగ్గుగా అంది. 'నాకేం తెలుస్తది.'

'యీరయ్య సెప్పకోదగ్గ మడిసి. అందరిలాంటోడూ కాడు' అంది అప్పలమ్మ.

'ఇక్కణ్ణుంచి యెల్లిపోదాం. ఊళ్ళో యిల్లు కట్టుకుందామంటాడు. నా జీతంకూడా ఆడికే యిచ్చేస్తాను' అంది చంద్రి.

'ఏమాత్రం నిలవ్వేశాడు నీవోడు' అడిగింది అప్పలమ్మ.

'నాకు తెల్దు.'

'ముసిల్దాన్ని. నాతో ఆమాత్రం సెప్పకూడదేంటే?'

'నాకు తెల్దు. నిజంగా నీమీద వొట్టు.'

'అది సర్లేగాని నువ్వుకూడా యీడకే వచ్చి ఉండరాదూ పిలదానా. ఒకత్తెవి నువ్వుదూరంగా ఎందుకూ?'

'కామందుల దగ్గర పనికి కుదిరానుగా.'

'ఆఁ పని! పని! ఇక్కడుంటే ఆమాత్రం సొమ్ము సెయ్యమా ఏంటే.'

'నా కెవరిత్తారిక్కడ?'

'నా దగ్గరుందువుగాని. నా యాపారం చూసి పెడుతూందువుగాని.'

'నా కిటుంటివి సేతగాదప్పలమ్మత్తా.' అంది మాయకంగా చంద్రి.

అప్పలమ్మ చాలా చిత్రమైన మనిషి. దగ్గరగా ఏ భైయేళ్ళుంటాయి, చాటుకుండా కల్లునీ ముండల్నీ సప్లై చేసే పెద్ద వర్తకురాలు. కాని ఆమె బహిరంగంగా మాత్రం పుణుకులూ మామిడి తాండ్రా బెల్లపుసెనగచ్చులూ అమ్ముతూంటుంది. పొరుగూళ్ళనుంచి చాటుగా ఎవరికీ తెలియకుండా ఒక్కొక్క రసికుడు ఒక్కొక్క పిల్లని ఎగరేసుకొస్తూంటాడు. వాళ్ళకి గదు లద్దెకిస్తుంది అప్పలమ్మ. ఈ వ్యవహారంలో చౌదరికికూడా వాటావుంది. పోలీసుల చెడుదృష్టి ఇటు పడకుండా చౌదరి చూసుకుంటూ వుంటాడు. కాని చంద్రికి పాపం యివేవీ తెలియవు. అప్పలమ్మ పెద్దకొలపుదనీ సత్తెకాలపుదనీ ఆమె నమ్మకం.

'పోనీ మా సౌదరిబాబు దగ్గరపనికి కుదరరాదూ పిల్లా. నీకోబస్తా ఎక్కువ ముట్టచెపుతాడు. యీరయ్యకి దగ్గరగా వుంటావు. రోజూ కోశెడుదూరం నడిచివస్తుండావాయె' అంది అప్పలమ్మ.

'మూడు నాలుగు నెలల్లో యీయేడయిపోతదిగా అప్పుడు సూద్దాంలే' అంది చంద్రి, అప్పలమ్మ సలహా కూడా బాగానే వుందనుకుంటూ.

ఇంతలో ఒకగదిలోంచి పెద్ద అరపులూ కేకలూ వినపడ్డాయి. ఒక ఆడగొంతు 'అమ్మో అమ్మో' అంటోంది. దబదబా గుద్దులు వినిపించాయి. చంద్రి భయంతో 'ఏంటదీ?' అంది.

గది తలుపులు తెరచుకున్నాయి. ఒక ఆడదాన్ని జుట్టుపట్టుకుని ఒకడు వూడిన గోచితో తూలుతూ లాక్కువస్తున్నాడు. మధ్యమధ్య కోపంగా విలాసంగా డొక్కలో తన్నుతున్నాడు. ఆమె తిడుతోంది. 'సచ్చినోడు. నీజిమ్మడిపోనూ. నీశార్ధంపెట్ట...'

అప్పలమ్మ ఏమీ ఎరగనట్టు చేపల్ని తరుగుతోంది. చంద్రి సహించలేకపోయింది. 'ఏంట్రా సచ్చినోడ. ఆడమనిసి నట్టాకొడతావ్?' అంది.

'నా యిష్టం.' అన్నాడువాడు.

'అయ్యో అదేం తప్పు చేసింది?' అంది చంద్రి.

'నాకు కొట్టాలని సరదా. నీకెందుకే నాపూసు.' ఇంతలోకే ఆడమనిషి జుట్టు విడిపించుకుని అతని చెయ్యి కరవబోయింది. అతను తప్పించుకుని ఆమెని ఎడా పెడా తన్నాడు. చంద్రి అప్రయత్నంగా అంది 'అలా కొడత వేంటి పోగరుపోతుకొడుకా.'

'నీకెందుకే ముండా. నీక్కూడా రెండు తగ లాలా.' అన్నాడు ఆవీరుడు. ఆడమనిషి విదలించుకుని పారిపోయింది. అతడూ తూలుతూ ఆమెని వెంబడించాడు. చంద్రికి వికారం పెట్టినట్టయింది. కంగారుగా 'ఇదంతా యేంటిఅప్పలమ్మా?' అంది. అప్పలమ్మ నవ్వింది. ఆ నవ్వు తాపీగా చిత్రంగా వుంది. అమాయకంగా పరచుకున్న ఎండుటాకుల్ని కాల్చివేసే మంటలోని నిర్దయా, నీచత్వమూ ఆ నవ్వులో ఉన్నాయి. నైతిక పు విలువలూ, అంతరాత్మ, జాలీ మొదలైనవన్నీ ఎప్పుడో వదిలేసి అవసరంయొక్క ప్రాముఖ్యానికి లొంగిన మనుష్యులలోని ఒక స్వార్థం, గారపట్టి నల్లపడిన ఆమె పళ్ళసందులలోంచి పొడుచుకు వచ్చిన నవ్వులో అసహ్యంగా పేరుకునివుంది. చంద్రికి ఆ నవ్వు భయంకరంగా తోచింది. ఎందుకో అక్కడ ఉంటే ప్రమాదం అనుకుంది. 'నే వెళ్ళొస్తాను. యీరయ్యబావకి కూడు వండాలి' అంటూ అప్పలమ్మ పిలుస్తున్నా వినక చరచరా వెళ్ళిపోయింది.

చంద్రి కూడువండి చీకటిపడే వేళకి బండమీద కూర్చుని పాటలు పాడుతూ వీరాకోసం నిరీక్షిస్తోంది. అటూయిటూ వెళ్ళేవాళ్ళూ పలకరించిపోతున్నారు. కొందరు పరాచికాలాడుతున్నారు. మీసాల వెంకన్న కన్నుగీటాడు. 'పోరా యెదవకొడక. కళ్ళల్లో యిసు కొత్తాను' అంది. మరికొందరు కవ్వించి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

వీరయ్య నూకయ్యతో తిరిగివచ్చాడు. ఈ వేళ కూడా చేపలు బాగానే పడ్డాయి. చంద్రి వేణ్ణీళ్ళు కాచిపెట్టింది. ఇద్దరూ స్నానంచేశారు. చంద్రి నవ్వుతూ కబుర్లు చెబుతూ వేడి వేడికూడు పెడుతూంటే వీరయ్యకి మగతలాంటి ఆనందం ఏదో కలిగింది. తను రోజంతా పడిన శ్రమని ఎవరో మంత్రం వేసి తీసేసినట్ట యింది. చంద్రి యింక యింటికి వెళ్ళనంది. ఇక్కడ యీ పల్లెలో సంబరం జరుగుతుంది. చూస్తానంది. సరేనన్నాడు వీరయ్య.

మూతి తుడుచుకుంటూ వీరయ్య యివతలికి రాగానే ఎవరో వచ్చి 'మీ మావకి పానంమీద కొచ్చింది' అని చెప్పాడు. వీరయ్యకి వొళ్ళు జలదరించి నట్టయింది. సరాసరి మేనమామయింటికి వెళ్ళాడు. గుడిసె గుమ్మంమీద సీతాలు ఏడుస్తూ కూర్చుంది. మేనమామ గవరయ్య పిల్లలు లేరని దీన్ని చేరదీసి పెంచాడు. పన్నెండు పదమూడేళ్ళుంటాయి. 'ఏఁవే సీతీ! ఏడుత్తా వేం. ఎట్టాగున్నాడు మావ?' అన్నాడు వీరయ్య.

'ఆకలేత్తంది' అంటూ బావురుమంది సీత.

గవరయ్యకి జబ్బు చెయ్యడంతో సీతాలికీ రోజంతా ఉపవాసమైంది. ఇంట్లో బియ్యం గింజకూడా లేకుండా చూసి యిదే సమయం అన్నట్టు మంచం పట్టాడు ముసలాడు. వీరయ్యలోపలికి వెళ్ళాడు. గవరయ్య ఒక కుక్కి మంచంలో స్పృహ లేకండా పడి ఉన్నాడు. ఆయాసంతో గుండె లెగిరిఎగిరి పడు తున్నాయి. బలవంతంగా తీసివిడిచే శ్వాస. గురక బరుకు బరుకు మంటోంది. నెరసిన కనుబొమ్మలకింద రెప్పలు సగం మూసుకునిఉన్నాయి. వీరయ్యకి బాధ కలిగింది. జాలివేసింది. ఓపిక ఉన్నన్నాళ్ళూ సముద్రంలో గెడ వేసి బతికాడు. చివరరోజుల్లో యిక్కడా అక్కడా అడుక్కు తీసుకువస్తున్నాడు. ఇప్పుడింక యీ ప్రాణావశిష్టుణ్ణి ఎవరు చూస్తారు? కొన్నిరోజులక్రితం అత్త పిలుస్తోందని చెప్పాడు. ఇప్పుడు వెళ్ళిపోతున్నాడా? అక్కడ ఆలోకంలో అత్త యితనికోసం కనిపెట్టుకుని వుంటుందా? అక్కడ తిండిఉంటుందా? అక్కడ సముద్రం వుంటదా? ఇలాగ అయోమయంగా ఆలోచిస్తూ పరుగెత్తుకువెళ్ళి మంగలిస్వామిని తీసుకొచ్చాడు. స్వామి మంచి వైద్యుడని ప్రతీతి. గవరయ్యని పరీక్షించి నోట్లో ఏదో రసం పిండాడు. ఉదయానికల్లా తెలివొస్తుందని నయమౌతుందనీ ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

'నీకు నేను కూడు పంపిత్తాను. ఏడవ మాకు సీఁతీ. మావని జాగత్తగా నూత్తూ వుండు.' అని చెప్పి వీరయ్య యింటికి వచ్చేశాడు. చంద్రి అన్నం ముంతలో పెట్టుకుని సీతాలు దగ్గరికి వెళ్ళింది.

వీరయ్య గుండెలో బాధ ఎక్కువయింది.

ఈ పల్లె వదిలితే గాని తనబాధ తగ్గదనుకున్నాడు. ఎన్నాళ్ళయినా తాను కష్టపడి డబ్బు కూడబెడతాడు. అవసరమైతే చంద్రి జీతం కూడా తనే తీసుకుంటాడు. దూరంగా అక్కడ ఒక యిల్లు కట్టుకుని చిన్న వర్తకమో మరొకటో చేసుకుంటాడు. తను చొక్కాలు కూడా తొడుగుతాడు. కాళ్ళకి జోడులేకండా నడ

వడు. చంద్రీ నూకయ్యా తనతో వుంటారు. చంద్రికి తనకీ పిల్లలు పుడతారు. వాళ్ళకి చంద్రిలాగ పెద్ద కళ్ళూ, తనలాగ బలమైన దేహమూ ఉంటాయి. వాళ్లు పలకా పుస్తకా లుచ్చుకుని బడికివెళ్ళి చదువుకుంటారు. తన పెద్దమనిషి అవుతాడు. గౌరవంగా హాయిగా బతుకుతాడు. కొందరేనా తన్ని వీరయ్యగా రంటారు.

ఈ దరిద్రపు నీచపు మోసపు సముద్రంలో తను కింక పనిలేదు. మీసాల వెంకన్న తిండిలేక దిక్కులేక పడఉంటాడు. నరసమ్మ కల్లుతో జబ్బులతో ముసలిదై వంగిపోతుంది. ఈ పల్లెవాళ్ళందరూ ఆకలితో, రేపటిని గూర్చిన భయంతో క్రమంగా కృశించి నశించిపోతారు. అప్పలమ్మని షైగులో పెడతారు. తనుమాత్రం దూరంగా సుఖంగా...

అంత కసిలోనూ ఏడుపు వచ్చింది వీరయ్యకి. ఆ పల్లెనీ అందులో ప్రతీ మనిషినీ తా నెరుగును. తరతరాలుగా వీళ్ళందరూ యిక్కడ పుట్టారు. పెరిగారు. తనవంటి వీళ్ళందరూ నశించిపోతారు. ఈ వందల కొలదీ జనానికి ఏ ఆశా సౌఖ్యమూ యింక జీవితంలో కలగవా? బాబు కూడా యిలాగే చెప్పాడు. 'నాను యీ సముద్రం దేవు డనుకున్నానురా అబ్బీ! మన తాత ముత్తలు యిక్కడే పుట్టారు. పెద్దోళ్లయారు. కాని గుడిసె ఏనాడూ కాస్త పెద్దది అవలేదురా బుల్లోడా! ఈ సముద్రం మనకి కూంత తిండిపెట్టి మనసత్తువ నంతా –మనపానాల్నే బలికోరుద్ది'

అక్కడే యిసుకమీద పడుకున్నాడు వీరయ్య. మాగన్నుగా నిద్రపట్టేవేళకి చంద్రి తిరిగి వచ్చింది.

## 5

దూరంగా డప్పులు మోగాయి. కాగడాల కాంతి ఎర్రగా కనిపిస్తోంది. జనం కలకలం వినవస్తోంది. చంద్రి వీరాన్ని తట్టిలేపింది. 'నువ్వెళ్లు. నేను ఎనకాల వొత్తాను' అన్నాడు వీరయ్య బద్ధకంతో. చంద్రి నూకయ్యని తీసుకుని వెళ్లింది. ఇదివర కెప్పుడో చౌదరి కొనియిచ్చిన చమ్కీచీర కట్టుకుని వచ్చింది నరసమ్మ. వెంకన్న ఒక చేతిలో కల్లుముంతతోనూ మరో చేతిలో కొరడాతోనూ తిరుగుతూ జనాన్ని అదలిస్తున్నాడు. గంగడు తుప్పుపట్టిన కత్తినొకదాన్ని తిప్పుతూ ఖడ్గవిద్యని ప్రదర్శిస్తున్నాడు. ఒక ఆడది మొహం అంతా పసుపు రాసుకుని చేత్తో ఆకులు పట్టుకుని జుట్టు విరబోసుకుని గుడ్లు తేలేసి యిటూ అటూ వూగుతోంది. ఇద్దరు వొంటికి రంగులు పూసుకుని పెద్దపులి ఆట ఆడుతున్నారు. కాగడాల కదిలే వెలుతురులో అందరూ తెరమీద బొమ్మల్లా మిథ్యగా వింతగా వికృతంగా ఉన్నారు. చంద్రి ఉత్సాహంతో గుంపులో చేరి ఒకటైపోయింది.

క్రమంగా సంబరం మజా ఎక్కువయింది. ముంతలతో కల్లుని కాళీచేస్తున్నారు. పైటజారిన నరసమ్మ కేకలు వేస్తోంది. పసుపు రాసుకున్న ఆడమనిషి వీరాంగం తొక్కుతోంది. ముత్యాలు మొగ్గలు వేస్తున్నాడు. వెంకన్న కొరడా ఝుళిపిస్తూ హెచ్చరిస్తూ గుడివైపు దారితీశాడు.

చంద్రి ఒకపదం అందుకుంది. చంద్రి గొంతు కీచుగా రేగి డప్పులమోతని దాటి ఎర్రని వెల్తురులో కలసిపోతోంది. పదిమంది ఆమె చుట్టూ మూగి వంత పాడుతున్నారు. వెంకన్న వచ్చి చంద్రికి ఎదురుగా నిలబడి 'వహంవ్వా సక్కని సుక్కా మరో పదం పాడు' అన్నాడు. ఒకడొక చచ్చిన పాముని తీసుకు వచ్చి విసిరాడు. జనం 'బాబోయ్' అంటూ చెదరైపోయారు. వెంకన్న వాణ్ణి పట్టుకొని చావగొట్టాడు. చంద్రి పక్కనే చేరి ముత్యాలుకూడా పాడుతున్నాడు. ఇద్దరూ చేతులు కలిపి ఊపుతూ పాడుతున్నారు. వెంకన్న దగ్గరికెళ్ళి 'సెంద్రీ మరోటి పాడు' అంటున్నాడు. ఎవడో వెనకనుంచి చంద్రి పైటలాగాడు. గంగడు కత్తి తిప్పుతూ నాట్యంచేస్తూ ఆమెమీద తూలిపడ్డాడు. ఇద్దరూ నేలమీద ఒకరిమీద ఒకరు పడ్డారు. జనం యీలలతో చప్పట్లతో తమ ఆనందాన్ని తెలిపారు.

అంతకుముందే వచ్చిన వీరయ్య యిదంతా చూశాడు. అసలు చంద్రి సంబరానికి వెళ్లడమే వీరయ్యకి యిష్టంలేదు. అందుకే నిద్రలో ఉలిక్కిపడి లేచి యిలాగ వచ్చాడు. ఈ దృశ్యం అతనికి బాధనీ అసహ్యాన్నీ కలిగించింది. తనకీ తనవాళ్లకీ ఏదో ప్రత్యేకత కల్పించుకోవాలని అతని ఆశ. తనదైన చంద్రి వీళ్లల్లో గంతులు వేయడం సహించలేకపోయాడు. చౌదరిభార్య యిలా ప్రవర్తించదని అతనికి దృఢంగా తెలుసును.

'సెంద్రీ ఇలాగరాయే' అని గట్టిగా కంఠమెత్తి పిలిచాడు.

'నాను రాను' అంది చంద్రి ఉత్సవపు ఉత్సాహంలో.

'సంపేత్తా రాకపోతే' అంటూ ఆమె చెయ్యి పట్టుకు లాగాడు.

'ఒగులాదులు యీరయ్యా బావా నొప్పి పెడుద్ది' అంది చంద్రి. అందరూ చప్పట్లు కొట్టారు.

చంద్రికి అభిమానం వేసింది. కదలనంది. మొరాయించింది. వీరయ్య ఆమెను జుట్టుపట్టుకుని బరబర లాక్కుపోయాడు 'జ్ఞానం లేదూ నీకు? జాత్తువోదులు' అంది కోపంతో చంద్రి. వీరా వళ్ళు కోపంతో మండుతున్నాయి. 'నామాటవినకపోతే జాగర్త! ఎద వ్వేసా లెయ్యాక' అన్నాడు.

'నే యినను' అంది చంద్రి.

'హో—ఆ వెంకన్నతోపో' అన్నాడు వీరయ్య కోపంగా.

'ఆడికేం, ఎంకన్న మంచివాడు' అంది చంద్రి కొంటెగా.

వీరయ్య ఆమెమీదకి దుమికాడు. చంద్రి పరుగెత్తింది. వీరయ్య వెంబడించాడు. సముద్రం వొడ్డుకి వచ్చారు. చంద్రి ఫక్కున నవ్వింది.

'ఏంటే నవ్వుతావ్?' అన్నాడు వీరయ్య.

చంద్రి యిసుకమీద కూర్చుని పాదాల్ని కెరటాలలో పెట్టింది. ఓరగా వీరయ్య కేసిచూసి 'వెంకన్న పెద్దమడిసి. అందమైనోడు' అంది. ఆమె పిక్కలు నురుగుతో నవ్వుతూన్నట్టున్నాయి. వీరయ్య ఆమెని నీళ్లల్లోకి తోశాడు. చంద్రి గల్లున నవ్వుతూ నీళ్లల్లో పడింది.

'రా పైకిరాయే పిల్లా' అన్నాడు వీరా.

తడిసినచీరతో పైకి వచ్చింది చంద్రి. స్ఫుటంగా ఉన్న అవయవాల పొంకంచూసి ఆమెను కౌగలించుకోబోయాడు వీరయ్య. ఆమె తప్పించుకుని మళ్లీ నీళ్లల్లోకి దుమికింది. నీరు గలగలమంది. వీరా గొంతునిండా నవ్వాడు. చంద్రి తిరిగీ ఒడ్డుమీదకు వచ్చింది.

'ఒళ్లు గడ్డైపోతుంది. ఊహు చలి చలి' అంది వణుకుతూ. వీరయ్య తలగుడ్డతీసి ఆమెమీదను విసిరాడు. 'కట్టుకో' అన్నాడు.

'మరునేది యీరయ్య బావా?. నాను సిగ్గులేని నర్సమ్మ నేంటి' అంది చంద్రి. వీరా పక్కకితిరిగి కళ్లు మూసుకున్నారు. చంద్రి ఆగుడ్డని చుట్టబెట్టుకుని సరీసరిపడని పైట వేసుకుంది. తడిసిన జుట్టు చివరల్ని సాచి ఆరబెట్టుకుంటోంది.

వెన్నెలలో అర్థనగ్నంగా ఉన్న ఆమె దేహమూ రూపమూ మోహనంగా ఉన్నాయి. వీరయ్య రెప్ప వెయ్యకుండా ఆమెకేసి చూశాడు. ఆమెని పట్టుకోబోయాడు. ఆమె పరుగెత్తింది. అలసిపోయి యిసుకలో వాలింది. వీరయ్య ఆమెని రెండు చేతుల్లోకి తీసుకుంటూ 'నువ్వు నాదేవతవు సెందిరీ' అన్నాడు.

సముద్రపు కెరటాలహోరు చిత్రంగా మిస్టిక్ గా వుంది. దూరంగా సంబరం డప్పుల మోత వినబడుతోంది.

## 6

పల్లెపల్లె అంతా వీరాకి వ్యతిరేకంగా వుంది: వీరాదగ్గర సొమ్ము నిలవవున్నట్టు అందరికీ తెలిసింది. చౌదరి జనాన్ని వెంటబెట్టుకుని నూకాలమ్మ గుడి కట్టించడానికి యిరవై రూపాయలు చందా యిమ్మన్నాడు. ఇవ్వనన్నాడు వీరయ్య. ఎన్నో విధాల చెప్పిచూశారు చౌదరీ, తక్కిన వాళ్లూ. చచ్చినా యివ్వనన్నాడు వీరయ్య. 'నువ్వు దేవతని కాదంటున్నావు. నాశన మైపోతావ్' అన్నా డొక భక్తుడు. వీరయ్య చలించలేదు. చౌదరి ఎర్రగా ముఖాన గంటు పెట్టుకుని వెళ్లిపోయాడు. ఊరంతా అనేకవిధాల చెప్పుకున్నారు. వీరయ్యని తిట్టుకున్నారు. దరిద్రం తనపక్కన – తనలో – ధనచిహ్నాల్ని ఉండనివ్వదు. బానిసలైన అమాయకులైన అవిద్యాపరులైన ప్రజలు తమ దరిద్రాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూవుంటారు.

చీకటిరాత్రులు కాబట్టి చంద్రి రోజూ రావడం లేదు. ఎప్పుడేనా వచ్చినా చీకటిపడకుండా వెళ్లిపోతోంది. అప్పలమ్మ వీరయ్యయింటికి రోజూ వస్తూ పోతూవుంది. వీరయ్యను మంచిచేసుకుంటోంది. సెనగచ్చులు తెచ్చి పెడుతోంది. డబ్బిచ్చినా తీసుకోలేదు.

తనంటే విరోధంగా ఉన్న పల్లెవాళ్లంటే అసహ్యంతో మరీ దూరంగా వుంటున్నాడు వీరయ్య. గవరయ్యమామ చచ్చిపోయాడు. అందరికీ ఆశ్చర్యం కలిగేటట్టు దహనానికి తంతుకీ అయే ఖర్చంతా వీరయ్య భరించాడు. సీతాలుని తనయింటికి వచ్చి ఉండమన్నాడు కాని సీతాలు ఎవరితో చెప్పకుండా పల్లె విడిచి వెళ్లిపోయింది. వీరయ్య కొన్నాళ్లు వరుసగా వెళ్లి మామగుడిసెలో దీపం పెట్టివచ్చేవాడు. ఇప్పుడు కొన్ని పందులూ పందికొక్కులూ ఆగుడిసెని విశ్రాంతి భవనంగా వాడుకుంటున్నాయి.

వీరయ్యపట్టుదల ఆనాటి కానాడు ఎక్కువయింది. దేహశ్రమని లెక్కపెట్టకుండా సముద్రాన్ని గాలించేస్తున్నాడు. ఎన్నో రోజులు ఫలితంలేకండా పోయేవి. బాధతో వొంటి నొప్పులతో తిరిగివచ్చేవాడు. ఒక్కొక్కరోజున చేపలు కొల్లలుగా పడుతున్నాయి. ప్రతీచేపకీ లెక్క

కట్టి నిలవ వేస్తున్నాడు. ప్రతీరోజూ తనదగ్గరున్న సొమ్ము లెక్కపెట్టుకుంటున్నాడు. డబ్బుని తన మొలలోనే పెట్టి చుట్టూ గుడ్డని చుట్టబెట్టుతున్నాడు. అడవిలో తన ఆహారాన్ని జాగ్రత్తపెట్టుకునే ఖడ్గమృగం లేక ఎలుగుబంటి వంటి ప్రవృత్తి అతనిలో దళంగా వ్యాపించింది. నూకయ్యకి యిజార్లు కుట్టించలేదు. బాబుకి దుప్పటీ కొనలేదు. చంద్రికి చీరనీ కొనిపెట్టలేదు. 'అన్నంతా సేసితీర్తాను. అప్పుడుగాని ఒక్క దమ్మిడీ ఖర్చుపెట్టను' అని చెప్పాడు చంద్రితో.

ఆ సముద్రంవంటిదే దరిద్రం కూడా. అవతల వొడ్డు కనపడదు. కాని వీరయ్య మొండిగా ముందుకు సాగిపోతున్నాడు.

## 7

కన్ను కనపడని చీకట్లో పల్లె భయంకరంగా వుంది. సముద్రపు హోరు క్షయరోగంతో బాధపడుతూన్న రాక్షసుడి శ్వాసలాగా వుంది. చిరిగిన పాత కంబళీ చిరువెచ్చని ముసితల్లో వీరా నూకయ్యా గాఢంగా నిద్రపోతున్నారు. చలిగాలి చూరుని కొట్టుకొని వెనక్కి మళ్లుతోంది.

ఎవరో గుడిసె తలుపును డబడబ బాదుతూన్నట్టు చప్పుడయింది. 'యారదీ' అంటూ వీరయ్య లేచి తలుపు తీశాడు. చౌదరి పెద్ద చుట్ట కాలుస్తూ బంపమీద కూర్చున్నాడు. పక్కనే గుమాస్తా నౌకరూ చేతులు కట్టుకుని వున్నారు. నౌకరుచేతిలో లాంతరు వుంది. వెంకన్న చేతిలో మరో లాంతరు వుంది.

'రేతిరేల ఒచ్చారు బాబుగారు' అన్నాడు వీరయ్య కంగారుగా నిద్రని దులుపుకుని.

వెంకన్న దీపం మొహంమీద పెట్టి 'నీకోసమే' అన్నాడు.

'సర్కారువారికి నీమీద చాలా కోపంగా వుంది' అన్నాడు చౌదరి తాపీగా.

'ఏం బాబూ?'

'క్రితం ఏడాది పన్నంతా బకాయీవుంది. వృత్తి పన్నూ గుడిసెపన్నూ కూడా. జుల్మానాతో యిచ్చుకోవాలి' అన్నాడు చౌదరి.

'మాబాబు పన్ను కట్టేశినాడండి. నాను యీయేడాది సొంతంగా చూసుకుంటున్నాను' అన్నాడు వీరయ్య.

'మీ బాబు ఎప్పుడూ రాగిపైసా కట్టలేదు. నాకు తెలుసు' అన్నాడు వెంకన్న.

'జుల్మానాతో యిరవై ఆరు రూపాయలయింది' అన్నాడు చౌదరి.

'అన్నాయం బాబూ. మాబాబు పన్ను కట్టేశానని నాతో చెప్పాడండి.'

'అయితే నేనబద్ధమాడానంటావా?' గద్దించాడు చౌదరి.

'మా బాబుకూడా నిజాయితీ మనిసేనండి' తొణక్కుండా అన్నాడు వీరయ్య.

చౌదరి గుమాస్తా పేరిశాస్త్రికేసి చూశాడు. పేరిశాస్త్రి 'అయితే రసీదులేవీ?' అని అడిగాడు.

వీరయ్య తెల్లబోయాడు. రసీదులు తీసుకునే అలవాటు ఎప్పుడూ లేదు. చౌదరి లేచి యిలా అన్నాడు. 'నువ్వు ఉదయమేవచ్చి పన్ను జుల్మానాతో కట్టెయ్యాలి. లేకపోతే వీలులేదు. తరవాత ఏంజరిగినా విచారిస్తావు.'

గుమాస్తా దాన్ని వ్యాఖ్యానించాడు. 'సర్కారువారు నీగుడిసెనీ నీకున్న యావదాస్తినీ స్వాధీనంచేసుకుంటారు.'

చౌదరి వెళ్లిపోయాడు. వెంకన్న కొంతదూరం వెళ్లి తిరిగి వచ్చాడు.

'ఇదుగో యీరయ్యా. నామాటినూ. ఓపదిరూపాయలు నాకియ్యి సౌదరిబాబుతో సెప్పి రైటుసేస్తాను' అన్నాడు మీసం తిప్పుతూ.

'నిన్నూ ఆసౌదరినీ సేపలకూరలా తరిగేత్తాను' అన్నాడు వీరయ్య మండిపడుతూ. అతనిగొంతులోని కాఠిన్యానికి జంకి వెనక్కి తిరిగాడు వెంకన్న.

తర్వాతరోజున ఉదయమే బయలుదేరి వీరా బాబు ఉంటూన్న ఊరికి వెళ్లాడు. అక్కడకు చేరేటప్పటికి నడినెత్తిమీదకు సూర్యుడొచ్చాడు. కీళ్లనొప్పులతో బాధలతో శల్యావశిష్టుడైన బాబు యిలాగ అన్నాడు. 'పన్ను కట్టేశానురా అబ్బీ. కాని ఆసౌదరి మా పెమాదం మనిషి. సాటుగాపోయి ఓపదిరూపాయలు యిచ్చుకుని రచ్చించమని అడుగు. లేకపోతే పాంపగ పట్టి నిన్ను బతకనివ్వడు.'

తనకి అవ్యక్తంగా ఆదర్శంగా ఉంటూన్న చౌదరి యిలాంటివాడని తెలియగానే తనమీద తనకే రోతపుట్టింది వీరయ్యకి. ఏమైనా బాబుచెప్పినట్టే చేసి యీగండం దాటాలని సంకల్పించుకున్నాడు. బాబుకి అలాగే చేస్తానని వాగ్దానం యిచ్చాడు. బాబు భోంచేసి వెళ్లమన్నా ఆగలేదు. సత్తెమ్మ వండినకూడు తినకూడదనుకున్నాడు. ఎండలోనే బయలుదేరి సాయంత్రానికల్లా తనపల్లె చేరుకున్నాడు వీరయ్య.

చీకటి పడుతూ పడుతూ వుంది. గుడిసెముందు నూకయ్య కూర్చుని ఏడుస్తున్నాడు. అలసటతో ఉన్న

వీరన్న కోపంతో అడిగాడు. 'ఎందుకురా యేడుత్తావ్? ఎవరు వచ్చినార్రా?'

'సౌదరీ ఆళ్ళూ ఒచ్చి సేపలు తీసుకుపోనారు' అన్నాడు నూకయ్య ఏడుస్తూనే.

వీరాకి గుండె ఆగినట్లయింది. మూడురోజుల నుంచి పట్టిన చేపలు జాగ్రత్తచేసి వుంచాడు. రేపే వర్తకులు వస్తారు. మూడురోజులు తిండైనా తినకుండా ఎండలో సముద్రంలో వెతికివెతికి పట్టాడు. చాలా ఖరీదుచేసే చేపలు. వీరా రక్తం వేడెక్కిందు. కళ్ళ చివర ఎర్రజీర నాట్యమాడింది. 'ఇదేంటో తేల్చుకుని వత్తానుండు' అంటూ గుడిసెలోకి అడుగుపెట్టకుండానే వెనక్కి తిరిగాడు.

'ఓ అప్పీ-కల్లోత్తావా?' అన్నాడు వీరయ్య.

అప్పలమ్మ తెల్లబోయింది. కాని నవ్వుతూ ముంత తీసుకువచ్చి ఇచ్చింది. సగంతాగి వికారపెట్టి ముంత నేలకేసి కొట్టాడు వీరయ్య—'హా యెదవ ముండా—యెదవకల్లూ నువ్వూ' అంటూ చర చర వెళ్ళిపోయాడు బలిష్ఠుడయిన అతనివొళ్లు వణకడం మాసి ఏదో ఉపద్రవం రాబోతోందని గ్రహించి నవ్వింది అప్పలమ్మ.

తుమ్మచేలు దాటగానే చౌదరీ, వెనకాల గుమాస్తా కనపడ్డారు. వీరయ్య ఒక తుమ్మకర్ర విరిచాడు. వెనకాలే వెళ్లి 'నా సేపలు తీసుకుపోతావురా దొంగ నా కొడకా' అంటూ చౌదరి తలమీద కొట్టాడు. 'అమ్మో' అంటూ చౌదరి నేలమీద కూలిగాడు. 'చచ్చిపోయాడు మునసబు' అంటూ పేరిశాస్త్రి పెద్ద పెద్ద కేకలు వేస్తున్నాడు.

వీరయ్య పరుగెత్తుకుని అప్పలమ్మ ఇంటికి వచ్చాడు. 'అప్పీ-సౌదరిని తల పగులగొట్టా' నంటూ చతికిలబడ్డాడు. భయవిహ్వలతతో 'ఇప్పుడేంటి సెయ్యడం?' అన్నాడు ఆయాసపడుతూ.

'నీకేం భయం నేదు. నే నున్నానుగా. రా ఇటురా' అంటూ అప్పలమ్మ ఏమాత్రం కంగారు పడకుండా ఒక మూలగదిలోకి తీసుకువెళ్ళింది వీరయ్యని. వీరయ్య వణికిపోతున్నాడు. 'పోలీసు లొత్తారేమో అప్పీ' అని వెర్రిగా చూస్తూ అన్నాడు.

'నేను సూత్తానంటినిగా. భయపడమాకు. ఈ సుక్క తాగి పడుకో. బలం వస్తుంది.'

అప్పి తలుపు గొళ్లెంపెట్టి ఇవతలికి వచ్చింది. ముంత ఖాళీచేసి వీరయ్య క్రమంగా మైకంలోనికి, నిద్రలోకి జారిపోయాడు. అప్పలమ్మ ఓ గంటపోయాక గదిలోకి వచ్చింది. వీరా మొలతడిమి కట్టువిప్పి నోట్ల కట్టని సంగ్రహించి మళ్లీ తలుపు గొళ్లెంపెట్టి తిన్నగా చౌదరి ఇంటికి బయల్దేరి వెళ్ళింది.

చౌదరి పడుకుని ఉన్నాడు. తలమీద కట్టు వుంది, 'ఏంటి జరిగింది చౌదరి' అంది. నిజంగా ప్రమాదం ఏమీ లేదు. కర్రదూసుకుపోయి బుజానికి తగిలింది. తలమీద పక్కగా చర్మం లేచింది. బుజం మాత్రం నొప్పిగావుంది.

'పోలీసుల్ని పిలిపించి వాణ్ణి చితకతన్నిస్తాను. పదేళ్లు శిక్షపడేటట్లు చూడకపోతే నాపేరు చౌదరి కాదు' అన్నాడు చౌదరి.

ఉద్రేకాలవలనకన్న తెలివివల్ల లాభం ఎక్కువుందని అప్పలమ్మ చౌదరికి బోధించింది. ఏ సమస్యలోనుంచైనా డబ్బుని ఉత్పన్నం చెయ్యడం ప్రయోజకుల లక్షణం. పోలీసుకేసువల్ల మరికాస్త డబ్బు ఖర్చవుతుంది. అంతకన్న ఓ వందరూపాయలు నష్టపరిహారం తీసుకుంటే? వీరయ్య లొంగిపడివుంటాడు; ధనలాభమూ వుంటుంది. 'పాతికో పరకో నీకు తోచింది నాకు ముట్టచెప్పు. నాకేం ఆశలేదు' అంది అప్పలమ్మ—తన నిస్వార్థాన్ని రుజువు చేస్తూ.

చౌదరి నవ్వాడు. తనలాంటి ఉత్తమ ఆలోచనలూ, తెలివితేటలూ ఉన్నవాళ్లని గుర్తుపట్టి మెచ్చుకోగల సహృదయుడు తను. 'సరే. నీయిష్టం' అన్నాడు. అప్పలమ్మ తిరిగి తనింటికి వచ్చి గదిగొళ్లెం తీసింది. చచ్చిన దూడలా కాళ్ళూ చేతులూ పడేసుకుని నిద్రపోతున్నాడు వీరయ్య.

తెల్లవారగానే వీరయ్యకి మెలకువ వచ్చింది. భయంతో లేచాడు. చౌదరి శవం కళ్ళముందు కనపడింది. 'బాబోయి' అని కేక పెట్టాడు. గబుక్కుని వీరయ్యకి మొలనుకట్టిన డబ్బు జ్ఞాపకంవచ్చింది. చూసుకున్నాడు. లేదు. అతనిప్రాణంపోయినట్లయింది. 'ఓ అప్పలమ్మో' అంటూ కేకలు వేస్తూ తలుపులు దబదబ బాదాడు. గుంజాడు. అప్పలమ్మ వచ్చి తలుపులు తీసింది.

'అప్పీ. నా డబ్బు నా డబ్బు...' వెర్రిగా అరుస్తున్నాడు వీరయ్య.

'పోతేపోయిందిలే. బుద్ధిలేనోడా. ముందు నీ బతుకు సూసుకో. సౌదరి సావుబతుకుల మద్ద ఉన్నాడు.'

అలాగే చూస్తూ నిలబడ్డాడు వీరయ్య.

'పోలీసు లొత్తారు. నిన్ను ఉరిదీత్తారు.'

అప్పలమ్మ రెండుకాళ్ల మీదా పడ్డాడు వీరయ్య. 'నన్ను రచ్చించు అప్పలమ్మా. నాకు సావొద్దు. సావొద్దు.' దీనంగా ఏడ్చాడు వీరయ్య.

'భయపడకు యెర్రోడా. నేనంతా మాట్లాడి వుంచినానులే. ఓ వందరూపాయలు తీసుకురా. నీమీద కేసు తీయించేత్తాను' అంది అప్పలమ్మ.

'వందరూపాయలే'

'కాపోతే ఉరి!'

'ఎలాగ అప్పీ. నాదగ్గర డబ్బుకూడా పోయింది. దొంగెదవ లెవరో కాజేశారు.'

'అ(—పొలంకాడ ఎక్కడో పడిపోయివుంటది. ఏ సచ్చినాడో తీసేసి ఉంటాడు.'

'మరి ఏం సేసేది అప్పీ. నీ కాళ్లట్టుకుంటాను. దారి సూపించు.' వీరయ్య కళ్లమ్మట నీరు ఏకధారగా ప్రవహిస్తోంది.

'సెంద్రిదగ్గర నిలవ వుంటుంది. పోయి తెచ్చుకురా.'

'సెంద్రినా ?'

'నువ్వు మనువు సేసుగోవా యేంటే. నీకోసమంటే అది పడిచస్తది.'

## 8

చంద్రి ఆడుతూ పాడుతూ యింటికి వచ్చింది. గుడిసెముందు మేనమామ రత్తయ్య చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాడు. చంద్రి గుమ్మంలో అడుగు పెడుతూనే తన్నెవరో పిలుస్తూన్నట్టు విని నలుదిక్కులా చూసింది. రేగినజుట్టుతో మాసినబట్టలతో పీక్కుపోయిన మొహంతో పొలంగట్టమ్మటే వస్తూన్న వీరయ్యని చూసింది. పరుగెత్తుకు వెళ్లింది. చంద్రిని చూడగానే వీరయ్యకి ఓపిక లేనట్టయింది. గట్టుమీద చతికిలబడి మొహం కప్పుకున్నాడు.

'ఇదేంటి యీరయ్యబావా' అంది చంద్రి. వీరయ్య మాట్లాడలేదు. చంద్రి కంగారుపడింది. తల నిమురుతూ అడిగింది.

'ఏంటి జరిగింది బావా?'

వీరయ్య తల పైకెత్తాడు. గద్గదికంగా అన్నాడు. 'నన్ను రచ్చించాలి సెందిరీ.'

ఇలా బేలగా, జాలిగా తనదగ్గరకి ఎప్పుడూ రాలేదు వీరయ్య. అతనిలోవున్న పౌరుషమూ మగతనమూ ఏమయ్యాయో తెలియదు. ఏదో కీడు శంకించింది. అయినా చిక్కబట్టి 'సెప్పు నాతో. అసలేం జరిగింది?' అంది.

'నన్ను జైదీలో పడేత్తారు. ఉరితీత్తారు. ఉరితీత్తే సచ్చిపోతాను.' వీరయ్య విహ్వలంగా ఉరిని తలచుకుంటూ చెప్పాడు. చంద్రి ఆశ్చర్యంగా చూసింది. ఆణి—ఆ సౌదరిని సెత్తి పగలకొట్టాను. పన్ను లియ్యలేదని మూడురోజులసేపల్ని తీసుకుపోయినాడు దొంగనాయాల......'

'పోవల్సిందే ఆ సచ్చినోడు...'

'నా మొలని కట్టి బద్రంసేసుకున్న సొమ్ముకూడా పోయింది. ఎంత కట్టపడ్డాను.' వీరా దుఃఖం ఆపుకోలేక పోయాడు. ఏడ్చాడు, చంద్రివొళ్లో తలపెట్టుకుని.

'ఏడవ మోకు బగమంతుడే ఉన్నాడు. చంద్రికి కూడా కళ్లమ్మట నీళ్ళు తిరిగాయి. 'ఎలా అయిపోయినావ్ బావా. రెండురోజులకే సిక్కిపోయినావు. కూడు తిన్నావా.'

'నాను పడిన కట్టమంతా బూడిదైపోయింది. ఎప్పుడో సముద్రంలోపడి చచ్చిపోతాను.'

చంద్రికి భయంవేసింది. 'ఆడదానిలా యిదైపోతవేంటి. యెదవ డబ్బు పోతే మళ్ళీ వత్తది. మన రెక్కలున్నయిగా.'

'ఇప్పు డొందరూపాయలు కావాలి. లేందే పోలీసులొచ్చి లాక్కుపోత్తారు.'

'ఒంద రూపాయలే!'...చంద్రి దిగులుపడింది. శూన్యంలోకి చూస్తూ కూర్చుంది.

పచ్చని చేలు గాలికి వూగుతున్నాయి. సందె చీకటిలో పచ్చరంగు కలిసిపోతోంది. కొస్త దూరంలో ఉన్న చింతచెట్టుమీద కోకులు కిచకిచమంటున్నాయి. చీకటిపడబోతూంటే వారి గుండెల్లోని భయం బరువై బరువై పోయింది. పొలాల్లో కట్టివేసిన దూడల మెడలలో మువ్వలుమాత్రం ముగ్య ముగ్య ఘల్లు మంటున్నాయి.

వీరా లేచాడు. చంద్రి సహాయ్యం చెయ్యలేదని వీరయ్యకి తెలుసును. అతనిలో ఏదో తెగువా ధైర్యమూ వచ్చాయి. 'నేనెల్తాను.' అన్నాడు. రెండడుగులు వేసాడు. చంద్రి చటుక్కనలేచి వీరయ్యని పట్టుకుంది. 'ఆగు బావా. రా, కూడు తిందుగాని!'

'ఒద్దు సెంద్రీ. నే పోతాను'

'నన్ను సంపుకు తిన్నట్టే. రా బావా. ఏదో ఉపాయం ఆలోచిత్తానుగా.'—చంద్రి గట్టిగా వీరయ్యను కౌగలించుకుంది. ఆమెతడికళ్ళు వీరయ్య గుండెలకి చల్లగా తగిలాయి. వీరయ్య మారు చెప్పలేదు ఆమె వెనకాలే వెళ్ళాడు.

చంద్రి మేనమామ తత్వాలుపాడే ఒక చిన్న సైజు ఆధ్యాత్మికవాది. పెళ్లాం పోయాక ముండల తోనూ, ఒళ్లు పాడైపోయాక మందులతోనూ, ఓపిక పోయాక బైరాగులతోనూ మైత్రి సంపాదించినవిఖ్యాత జీవి. ఎన్ని తత్వాలు పాడినా ఎక్కడెక్కడ తిరిగినా వేళకిమాత్రం వచ్చి కూడు తినాలనే ప్రాథమికవివేకం కోల్పోని జ్ఞాని. వీరా దిగుల్నీ బాధనీ చూసి యిలా అన్నాడు.

'ఆసౌదర్ని తిట్టకు బాబూ. ఈ దేహ మశాశ్వతం. మన ఖర్మ ఎట్టాగుందో అట్టాగే జరుగుద్ది. ఈశరేచ్ఛ.'

'ఈ దేవదూ ఎర్రినాకొడుకు యే దాంతం సొపుతాడు' అన్నాడు అసలే మండిపడుతూన్న వీరయ్య.

'నీ తిట్లు నన్ను తగలవురా కుర్రోడా. ఈ దేహా నికే తిట్లయినా కొట్లయినా. లోపలి ఆతమ కేవీ తలగవ్.'

చంద్రి గబగబా కూడు వండిపెట్టింది. నిశ్శబ్దంగా తిన్నాడు వీరయ్య. చుట్టూరా గాలీ గోడలు బరువెక్కి గుండెమీద నొక్కుతోన్నట్టుంది వీరయ్యకి.

'పడుకో బావా. ఏదోఒకటి చూత్తాను' అంది పక్క పరిచి.

'నాకు నిదర రాదు.'

'ఊరికినే పడుకో.'

కాని వీరయ్య పడుకున్న కొన్నేపట్లోనే నిద్ర పోయాడు. రెండు రోజుల్నుండి తిండిలేక అలసి పోయాడు. మనస్సు తనకి తెలీకుండానే నిద్ర నాశ్రయించి బాధనుంచి విముక్తి చెందింది. చంద్రి దొడ్డి తలుపులుతీసి మేనమామ వినకుండా మెల్లగా అడుగులువేస్తూ రోడ్డుమీదకి వెళ్ళి క్రమంగా వ్యాపిస్తోన్న చిరుచీకట్లోకి మాయమయింది.

తెల్లవారగానే వీరయ్యకి ఎవరో తట్టి లేపుతున్నట్టయింది. చంద్రి వీరిచేతిలో బంగారపు గొలుసు ఒకటి పెట్టింది. 'మరి తొరగా యెల్లిపో యీరయ్య బావా.'

'ఎక్కడి దిదీ'—ఆశ్చర్యంగా అడిగాడు వీరయ్య.

'సిన్నప్పట్నుంచీ నాకుంది యీ గొలుసు. అమ్మితే ఎనభై రూపాయలొత్తయ్. 'ఎల్లు ఎల్లిపో

ఆమె తొందరనీ ఆందోళననీ గ్రహించాడు. వీరయ్య.

'నిజంగా సెందిరీ.'

చంద్రి ముఖం పక్కకి తిప్పింది. పళ్లు బిగబట్టి 'లేందే యాడిత్తాడు నాకు బంగారపు గొలుసు?' అంది.

సందేహంతో, సందేహాన్ని మించిన అవసరం యొక్క బలంతో గుప్పిటితో గట్టిగా పట్టుకుని వెళ్ళి పోయాడు వీరయ్య. చంద్రి గుడెసెలో కూర్చుని చాలా సేపు ఏడ్చింది.

'ఎందు కేడుత్తివు పిల్లా?' అన్నాడు మేనమామ.

'కడుపునొప్పి' అంది చంద్రి.

తెల్లని కిరణాలు తూర్పున తోచి గుడిసె గుమ్మాన్ని తాకాయి. చంద్రి కళ్లు మూసుకుని రెండు చేతులూ జోడించి, 'ఓ నూకాలమ్మ తల్లీ! నా యీరయ్యను రచ్చించు. నీకు కోడిపెట్టని బలియిత్తాను' అని మొక్కుకుంది.

## 9

రెండేళ్లు గడచిపోయాయి. అయినా సూర్యుడు తూర్పునే ఉదయిస్తున్నాడు. ఋతువులు వరుస క్రమంలోనే జరుగుతున్నాయి. రాత్రివేళ చీకటీ, పగటివేళ వెల్తురూ ఉంటున్నాయి. ఏం ఒక్కసారి మారకూడదూ అనుకుంది చంద్రి. కాని ప్రకృతియొక్క చర్యలో మార్పులేదు. నిద్రలేచేముందు అదే-ఆబూట్ల చప్పుడే వినపడుతుంది. కాకీదుస్తులతో టోపీలతో బాగా పోలీసులు ఇటూ అటూ తిరుగుతూంటారు. ముసలికాకి ఎప్పుడూ ఆగోడమీదనే నుంచుని 'కావు కావు'మని అసహ్యంగా అరుస్తూంటుంది. పక్క కొట్లోంచి కొత్తగా శిక్షపడిన కుర్రాడు అస్తమానూ 'ఇది నా ఇల్లాలని' అంటూ పాడుతూంటాడు. ఎర్రని రాళ్లతో పెద్దపెద్ద గోడలు తనచుట్టూ నిలబడి ఉంటాయి. ఆగోడలు కదలవు కరగవు కబుర్లుచెప్పవు.

జైలులో ఉన్నప్పుడు మొదట ఏడ్చేది. గుండె పోటు వచ్చేటట్టు ఏడ్చేది. నిద్రపట్టేదికాదు. అన్నం సయించేదికాదు. తనవాళ్ళందరూ తన్ని హేళన చేస్తారు. గ్రామస్థులందరూ అసహ్యించుకుంటారు. ఈరోజున ఇంతకష్టంలో తనకి బాబులేడు, అమ్మలేదు. వీరా ఏమైపోతాడో! మనోవ్యథ ఎక్కువైపోయి ఓరోజున జైలుగోడలకి తలపెట్టి కొట్టుకుంది. గాయమైంది, రక్తంకారింది. పోలీసు సుబ్బారావు తిట్టాడు.

'సచ్చిపోతావ్.'

'సావడానికే.'

జైలులో ఉన్నన్నాళ్ళూ చాలావిషయాలు తెలుసుకుంది. పోలీసులంటే మనుషులనీ, వాళ్ళల్లోనూ మంచివాళ్ళున్నారనీ తెలుసుకుంది. వార్డెన్ సుబ్బారావు ఎప్పుడేనా ఇంటిదగ్గర చేసుకున్న మినపరొట్టె, జంతికలులాంటివి తీసుకొచ్చి తనకి పెట్టేవాడు. తను ఏడుస్తూవుంటే కబుర్లుచెప్పి ధైర్యం చెప్పేవాడు. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడని తెలుసుకుంది. తెల్లవారగానే లేచి పరీక్షగా చూసేది. చాలాసార్లు పడమట ఉదయించకూడదా అని కసురుకుంది. తన అసంతృప్తిని వార్డెన్ సుబ్బారావుకు తెలియజేసింది. 'సూర్యుడికి బుద్ధిలేదన్నాడు సుబ్బారావు.

రోజూ మూడుపూటలా కటకటాల్ని లెక్కపెట్టేది. పాతసంగతులన్నీ తలచుకునేది. కొమందుల విధవకూతురు సుబ్బమ్మకూడా జైల్లోపడితే బాగుండును. గచ్చనకాయ లాడుకోవచ్చునుగదా అనుకుంది. చివరికి తన్ని వీరా ఎప్పటిలాగే గౌరవిస్తాడనీ, మనువు చేసుకుంటాడనీ, భూమిమీద యిటుకలతో ఇల్లుకడతాడనీ–ఆశ, ఆ ఆశనే ఆహారంకింద, బలంకింద, ప్రాణంకింద మార్చుకుని బ్రతికింది.

కాని ఆమె మారిపోయింది. రెండేళ్లల్లో క్రమంగా ఆమె నవ్వటం మరచిపోయింది. ఆమె బుగ్గల్లో కళ్లల్లో వుండే నిండైన ఆరోగ్యపు నిగనిగ పోయింది. చాతకాని నలిగిపోయిన వడలిపోయిన ఉదయపు కల్వపువ్వులాగ నీరసంగా నీరవంగా అయిపోయింది.

జైలునుంచి యివతలకి రాగానే ముందుకు నడవలేకపోయింది. అక్కడే కూర్చుని ఏడ్చింది. చిన్న మూట చేత్తో పట్టుకుని సముద్రంవొడ్డున ఉన్న వీరయ్య పల్లెకి బయల్దేరింది. వార్డెన్ సుబ్బారావు చేతికొక పావలా యిచ్చి ఏదేనా కొనుక్కు తినమన్నాడు.

ఎర్రని కంకరరోడ్డుమీద దుమ్ములేచి ముక్కులోకీ కళ్లల్లోకీ పడుతోంది. రోడ్డు ఎండకి కాలి కాలికి చుర్రుమని తగులుతోంది. కాళ్లు నొప్పిపెడుతున్నాయి.

తన పక్కనుంచి కార్లూ జట్కాబళ్ళూ దూసుకుపోతున్నాయి. రకరకాల జనం యిటూ అటూ పోతున్నారు. వాళ్ళందరూ తన్ని చూసి 'దొంగ దొంగ' అని అరుస్తారేమో అని భయపడింది. ఓ చెట్టుకింద కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకుంది. రోడ్డువారనే ఉన్న చిన్నకొట్లో ఏవో కొనుక్కుతిని యిన్ని మంచినీళ్లు తాగింది.

సాయంత్రానికి పల్లె చేరుకుంది. పల్లెబహిః ప్రకృతిలో మార్పులేదు. గుడిసెలు, వల్లని చిక్కిన పల్లెజనమూ, అప్పలమ్మ యిల్లూ, రావిచెట్టూ – అన్నీ అలాగే ఉన్నాయి.

'ఓస్ – యారదీ సెంద్రమ్మ ఏంటే?'

చంద్రి పక్కకి చూసింది. మీసాల వెంకన్న ఒంటికాలితో నుంచున్నాడు. చంకల కింద ఆసరాగా రెండు గుడ్డలు చుట్టిన కర్రలున్నాయి.

'యీరయ్య ఉన్నాడా?' భయంగా అడిగింది చంద్రి.

బొంగురుగా నవ్వాడు వెంకన్న. కన్నుగీటి 'రాయే పిల్లా' అన్నాడు. కాలు విరిగినా కామం విరగలేదు వెంకన్నకి.

తొందరగా వీరయ్య గుడిసెదగ్గరకి వెళ్లింది. ఈలోపుగా ఎందరు పిలిచినా పలకలేదు. 'నీ యీరా లేడు' అన్న గంగడిమాటనీ లక్ష్యంచెయ్యలేదు. గుడిసె అంతా శిథిలమై ఉంది. లోపల నారయ్యా, చౌదరికొడుకు సూరయ్యా చుట్టలు కాలుస్తున్నారు. చంద్రిని చూసి నారయ్య 'ఇదిగో—ఇదే యీరయ్య ముండ. ఉత్తి దొంగముండ' అన్నాడు. సూరయ్య పన్నెండేళ్ళ కుర్రాడు లేచి ముందుకువచ్చి 'ఎవర్ నువ్వు' అన్నాడు.

'నాను సెంద్రిని. ఇక్కడ యీరయ్య ఉంటం లేదూ?'

'నీ యీరయ్య సచ్చిపోయాడు' అన్నాడు సూరయ్య. 'హో హో' అని కసిరాడు.

'అన్యాయం. ఉత్తిదే. సావనేదు' అన్నాడు నారయ్య.

చంద్రి నిట్టూర్చి వెనక్కి తిరిగింది. కాని సూరయ్య ఆమెని పిల్చాడు.

'నీకు కూడుందా?' అన్నాడు.

'లేదు' అంది చంద్రి.

'నేను సుట్టలు కాలుత్తున్నానని బాబుతో సెప్పకేం—'

'సెప్పనులే—'

'నువ్వు నిజంగా యీరయ్య ముండవేనా?'

చంద్రికి అంత బాధలోనూ నవ్వొచ్చింది.

'రెండురూపాయలిత్తాను కావాలా' అన్నాడు చౌదరి కొడుకు. చంద్రి ఆశ్చర్యంగా చూస్తోంది. రెండు రూపాయలుతీసి మోగించి. 'ఇవిగో. మరి నాతో వత్తావా?' అన్నాడు చౌదరి కొడుకు. ఈ పసికుర్రవాడి మాటలకి జాలీ అసహ్యమూ రెండూ కలిగాయి చంద్రికి. వాడిమాట లక్ష్యం చెయ్యక 'మీ బాబు ఏంచేత్తున్నాడు?' అని అడిగింది.

'రెయిదవబాబు. పచ్చవాతిమెచ్చి పడుకున్నాడు. సస్తే కాని యియ్యడు. నేను దొంగతనంగా ఎత్తుకొస్తా.'

'ఇప్పుడు కొంచెం నయమేలే. నడుత్తున్నాడు' అన్నాడు నారయ్య.

'అప్పలమ్మ వుందా?'

'ఆఁ! ఇంచక్కాగా వుంది.' అన్నాడు నూరయ్య.

'యీరయ్య ఏమయ్యాడో నిజం సెప్పు.'

సూరయ్య సముద్రంవైపు చూపించి 'అందులో పడిసచ్చాడు.' అన్నాడు.

'ఉత్తిదుత్తిది. అమద్దె నిక్కడి కొచ్చాడు. నాను సూసాను.' అన్నాడు నారయ్య.

చంద్రి సముద్రంవైపు చూసి భయంతో కళ్లు మూసుకుంది. వడివడిగా అప్పలమ్మయింటికి వెళ్లింది. అప్పలమ్మ యిల్లు చాలా మారిపోయింది. గోడలకి సున్నమూ, పైన కొత్తపెంకూ, టేకుతో చేసిన గుమ్మాలూ కిటికీలూ, కలకలలాడుతూంది. ఇంకో రెండు మూడు గదులుకూడా కట్టించింది. అప్పలమ్మకి కొంచెం వొళ్లువచ్చింది. గ్లాస్కో చీర కట్టింది. చంద్రిని చూసి ఏడ్చినంత పని చేసింది.

'యీరా ఎక్కడున్నాడప్పీ?'

'అబ్బో చాలా దూరం. రెండుకోసులు నడవాలి.'—ఏదో వూరుపేరు చెప్పింది. గుడివెనక సందులో ఉన్నాడనీ చెప్పింది. అప్పలమ్మ ఆగమన్నా ఆగకుండా చంద్రి వీరా వున్న గ్రామానికి బయలు దేరింది. 'తిరిగొత్తే తిన్నగా యిక్కడికి రా సెంద్రీ. నా యాపారం సూసి పెడుదువుగాని' అంది అప్పలమ్మ ప్రేమతో.

రాత్రి పదిగంటలయింది. ఊరి పొలిమేర సమీపించింది. కుక్కల మొరుగులూ, నక్కలకూతలూ చీకట్లో భయంకరంగా ఉన్నాయి. గుండెలు దడదడలాడుతున్నాయి. గొంతు ఎండిపోతోంది. రోజంతా తిండిలేదు. పైగా నడక - విరామంలేని నడక. కాని యింతశ్రమా వీరా ఒక్కసారి తియ్యగా పిలిస్తే కౌగలించుకుంటే పోతాయనుకుంది. పొలాల్లో పడుకున్న రైతుల్ని గుడికి దారి అడిగింది. వీరయ్యయిల్లు సందు చివర వుందని చెప్పారు.

ఆతురతతో ఆశతో అలసటతో చివరిగుడిసెని సమీపించింది. అక్కడ దుర్వాసన భరించరానిదిగావుంది. తరిగిపారేసిన మాంసంముక్కలు కాలికి జిడ్డుగా తగిలాయి. కొలదిదూరంలో చెట్టుకింద యానాదివాళ్లు తప్పతాగి తందనాలాడుతున్నారు.

క్షీణస్వరంతో "యీరయ్య బావా" అని పిలిచింది. లోపల్నుంచి కేకలు వినవస్తున్నాయి. "నాకు లేదేం కూడియ్యాల! నువ్వు తినేసి పడుకున్నావా దొంగముండా" ఆడది ఏదో తిట్టింది. కొట్టిన చప్పుడు. "అమ్మో!" అని ఆడదాని కేక. "రక్తంకూడా కారుతుందిరోయ్ సచ్చినాడా" మళ్లీ ఘోరమైన నిశ్శబ్దం.

ఈసారి చంద్రి గట్టిగా పిలిచింది. 'యీరయ్య బావా' అని తలుపుకొట్టింది. తలుపు తెరచుకొని వీరయ్య యివతలకి వచ్చాడు. గడ్డం అసహ్యంగా పెరిగింది. చిరుగుల ఎర్రపంచె ఒకటి కట్టుకున్నాడు. వెన్నెలపడిన మొహంమీద నల్లనిమచ్చలు ఉన్నాయి. కళ్లు లోతుకు పోయాయి.

"యారదీ?" అన్నాడు బొంగురుగా. కంఠధ్వని మారిపోయింది. రంపంతో బండరాయిమీద గీసుతూన్నట్టుంది.

"నాను సెంద్రిని. నన్ను మరిసావా నా యీరయ్యబావా?"

వీరా మాట్లాడకుండా లోపలికి వెళ్ళి గుడ్డిదీపం ఒకటి తీసుకువచ్చి పరీక్షగా చూశాడు. పిచ్చిగా చూశాడు. 'ఖైదులోంచి ఇడిశారా?' అన్నాడు కాస్సేపాగి.

'ఎలా అయిపోనావ్ నా యీరా. ఎలా అయిపోనావ్' చంద్రి ఏడ్చింది.

వీరయ్య పెద్దగా దగ్గి యింకోవైపు చూస్తూ నిలబడ్డాడు.

'లోపల అదెవత్తె?' అంది చంద్రి.

'నరసమ్మ. గంజికాచిపోత్తంది.'

చంద్రి ఒక్కసారి కూలబడింది. కొంతసేపటికి మాట కూడదీసుకొని 'నే నెల్లిపోతాను' అంది.

వీరా మాట్లాడలేదు.

చంద్రికి దుఃఖం వచ్చింది. 'నా కాకలేత్తంది. నిన్నటినుంచీ కూడు నేదు.'

వీరా గొణిగాడు. 'నాకే కూడు లేదియ్యాల.'

లోపల్నుంచి నరసమ్మవచ్చి చూసింది. తలకి కట్టువుంది. 'సెంద్రమ్మ వచ్చిందీ. ఇంకేం యిద్దరూ కొంపమీదపడండి. దాన్ని తగిలెయ్యి. లేందే గుమ్మంలో అడుగెట్టనివ్వను' అంటూ భళ్ళున తలుపులు వేసేసింది.

వీరా లేచి చంద్రిని రమ్మన్నాడు. చంద్రి వెనకాలే వెళ్ళింది. ఊరవతల పాక దగ్గరకెళ్ళారు. అక్కడున్న ఒక లావుపాటివాడితో 'ఇద్దరికీ సుక్కపొయ్యి. తరవాత యిత్తాను డబ్బులు' అన్నాడు. లావుపాటివాడు సందేహించాడు. ఏమనుకున్నాడో ఏమో రెండు కుండలతో కల్లునీ మాంసాన్నీ యిచ్చాడు.

చంద్రి తాగనంది. 'ఛీ ఛీ!' అంది.

'తాగు సెంద్రీ లేందే సచ్చిపోతావు' అన్నాడు వీరయ్య. చంద్రి నోట్లో బలవంతంగా పోశాడు.

ఇద్దరూ తూలుతూ పొలంగట్టుమీదకి వచ్చి కూర్చున్నారు. సప్తమినాటి వెన్నెల బూడిదలాగా వుంది.

'నీకోసం పల్లెకి యెల్లాను.' అంది చంద్రి.

వీరా దగ్గాడు.

'ఏమైపొయ్యావో అని అదలిపోయాను.'

'సముద్రంలోపడి సచ్చిపోదామనుకున్నాను. కాని...సావ నేదు.' తూలుతూ మళ్ళీ అన్నాడు 'సచ్చిపో నేదు.'

'మరి మన యిల్లుమాట ఏంటీ యీరయ్యబావా?' అంది చంద్రి గొంతులో వికారాన్ని అణచుకుంటూ.

'ఉత్తది. అంతా ఉత్తది. మనం యింతే. యిలాగే ఉంటాం. యెదవ ఆశ...అంతే.'

'అంతేనా...' వెర్రిగా నవ్వింది చంద్రి. 'మరి నే నేంటి సేసేదీ. ఎక్కడికి పోయేదీ.'

'ఈడనే వుండు. కల్లోయిత్తాను రోజూ.'

చంద్రికి మత్తువచ్చింది. యెక్కిళ్ళమధ్య యిలాగ అంది. 'పోలీసు సుబ్బారావు బలేగున్నాడు.'

గట్టుమీద చంద్రి పడుకుంది. పమిట జారిపోయింది. నురుగు కారే నోటితో అస్పష్టంగా యిలా పాడింది.

'పోలీసు సుబ్బారావు నా జబ్బ పట్టుకుని
మాలీసు సేసాడు, మరేంటో సేసాడు.'

'హాహాహా...' వీరా బొంగురుగా నవ్వాడు. దగ్గాడు.

చంద్రికి పూర్తిగా మైకం కమ్మింది. నిద్రపట్టింది. అంతా నిశ్శబ్దంగావుంది. వెన్నెట్లో చంద్రి దేహం అర్ధనగ్నంగా మెరుస్తోంది. వీరా కొంచెం వంగి ఆమెని చూశాడు. నిదానించి చూశాడు. తన వణికే చేతులతో ఆమె చిక్కిన బుగ్గలు మెల్లగా రాశాడు. కళ్ళు మూసుకుని బాధగా బొంగురుగా అన్నాడు. 'నా సెందిరీ! నా సెందిరీ!'

అక్కడికి సముద్రపు కెరటాల హోరు వినపడదం లేదు. అది అంతటా పరచుకున్న నల్లని పచ్చని భూమి. కోట్లకొలది జనానికి తల్లిలాగా ఆధారంగా ఉన్న భూమి. చంద్రి నిద్రట్లో కలవరిస్తోంది. 'నాను గొలుసు తియ్య నేదు.....'

# నవ్విన నవ్విపోవనీ!

శ్రీ శంకరంబాడి సుందరాచారి

వారును వీరు మెచ్చుకొను భంగిని కోరి, కలమ్ముపట్టి, నే
నేరను వ్రాయ కబ్బముల; నింపుమన మ్మది పొంగి యేరులై
పారెడుదాక, యుక్తపదబంధము తీరెడుదాక, భావముల్
జారవు గంటమున్ విడిచి, సత్యము, నా హృదయమ్ము తెల్పితిన్.

పరుగిడు శబ్దజాలముల, భావముచాలని పట్టులన్నిటిన్
మరుగిడు గారడీల గురుమారము నా కలవాటులేదు, నే
త్వరపడి పల్కునొక్కటియు దండుగ సేయను, భావచింతలో
నరకొరలున్నయంత, మరియాదగ, కైతకె స్వస్తి చెప్పెదన్.

అందములేని యాకృతికి నందము కూరిచి, మందిమీద కే
సందె వెలుంగులోన తగుచాటున చక్కగ నక్కి కృత్రిమా
నందము నీయ నవ్వలచునట్లు నటించెడు భోగకాంత చ
క్కందముచూపి తన్పకల కామిని కావ్యసుమాంగి కాదు, నన్;

కనిన దినమ్మునుండియును, కంటికి రెప్పగ కాచి పెంచి, స
ద్గుణముల నేర్పి, సంఘమున కూడి చరించెడు శక్తినిచ్చి, పె
న్పనవున చక్కదిద్ది, సుఖసంపద చేనిడు పూర్ణమూర్తి యా
జననియె కావ్యమాత యని స్వాంతములో తలపోసి, పూనెదన్:

లలిత పదాల నేరి, మృదుళమ్మగు శయ్యను కూర్చి, భావముల్
తెలియగ చెప్పి పామరుల తెల్వికి నంద, పురాణగాథలం
దలి పరమార్థ ధర్మముల తత్త్వము నింపి సలక్షణమ్ముగా
కలమును కట్టుతో నడిపి, కైతల నల్లగ విశ్వశాంతికై.

భావుకులన్న పేరిటను వందలువేలుగ దేశమెల్లెడన్
తావలమంది, నవ్యకవితా వనవాటుల కోకిలమ్ములై,
భావము బంధము న్వదలి పల్కులనల్లి పదాలు పాడు 'పుం
భావసరస్వతీప్రియులు' ఫక్కున నవ్విన నవ్విపోవనీ.

# 'బాఉల్' ప్రేమతత్త్వం

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

అతని మాటలు వినడానికి నేను దేశదేశం తిరిగాను.
కాని అయ్యో! అంతా వృథా అయింది.
నేను తిరిగి వచ్చినప్పుడు అతనిని విన్నాను నా స్వంత పాటలోనే.
ఎవరివి నువ్వు? అతనిని వెతుకుటకు బిచ్చగానివలె వాకిలి వాకిలి తిరుగుతున్నావు?
నా హృదయ సీమకు రా, అతని ముఖంచూడు నా కన్నీటిలో.

(బాఉల్ పాటకు రవీంద్రుని అనువాదం)

వంగభూమిలో ఒక విధమైన యోగసాధకులను బాఉల్ అంటారు. బాఉల్ అనే శబ్దము వాయువు అనే శబ్దంనుండి పుట్టింది. వాయువు అనగా గాలిసోకిన వాడని అర్థము. అనగా పిశాచోన్మత్తుడని భావము. దత్తాత్రేయ ఉపనిషత్తులో పరమయోగీంద్రులు పిశాచోన్మత్తులవలె వుంటారని చెప్పబడింది. బాఉల్ ఉద్దేశ్యంలో వాయువు అనగా నాడి అని కూడా వుంది. అనగా, నాడీ రహస్యములు తెలిసిన యోగి అని అర్థం. వారిని చూస్తేకూడా పిచ్చివారివలె వుంటారు. కాని వారిలో యోగరహస్యములు తెలిసిన సిద్ధులెందరో వున్నారు. వారి సిద్ధాంతములను పాటలలో పాడుతూ వూరూరు తిరుగుతుంటారు. పాటలలో ఉన్నత భావములు, యోగరహస్యములెన్నో వున్నవి. రవీంద్రుని గీతాంజలిలోను, ఇంకా వారి ప్రఖ్యాత రచనలలోను బాఉల్ పాటలలోని భావములు, రాగములు కొంతవరకు ఉన్నవి. ఈ విషయమై టాగూరు స్వంతమాటలను మనవి చేస్తాను. విశ్వభారతి పత్రికలో బాఉల్ రచనకు ఉపోద్ఘాతంగా విశ్వకవి ఈ క్రింది మాటలను వ్రాశారు.

"నా రచనలు చదివినవారు, వాటిలో నేను బాఉల్ పాటలకు ఇచ్చిన ప్రాముఖ్యం ఎరుగుదురు. సీల్దాలో వుండగా బాఉల్‌తో తరచు మాట్లాడుతూ వుండేవాడిని. నా పెక్కుపాటల్లో, బాఉల్ పాటలలో స్వాభావికంగాఉన్న స్వరమాధుర్యమును కావలెనని ఉపయోగించాను. కొన్ని పాటలలో తెలిసీ తెలియకుండానే ఆ స్వరమాధుర్యాన్ని చేర్చాను. బాఉల్ పాటలలో స్వాభావికమైన అనేకవిధాల రాగములు, రాగిణులు వున్నవి. బాఉల్ సందేశములూ, వారి రాగయుక్తమైన పాటలు, ఒకప్పుడు నా జీవితములో భాగములైనవి. నా చిన్నతనంలో సీల్దాలో వుండగా ఒక బాఉల్ సితారుమీద పాడినపాట నాకు ఇప్పటికీ జ్ఞాపకం వుంది:

'ఎక్కడ కనుగొందును నా హృదయ పురుషుని,
అక్కట! అతనిని పోగొట్టుకున్న నాటినుండి
అతనిని వెతుకుటకై
దేశదేశములను తిరిగి వేసారినాను.'

ఈ పాటలోని మాటలు చాలా స్వల్పములైనవే. కాని వాటిని సితారుమీద రాగయుక్తంగా అతను పాడినప్పుడు, వాటి అర్థము అంతులేని అందాన్నిస్తున్నది. వాటిలో ఉపనిషద్రహస్యం వుంది. 'తం వేద్యం పురుషం వేద మా వో మృత్యుః పరివ్యథాః' – అనగా తెలిసికోవలసిన వానిని తెలిసికో, లేక మరణ బాధలనైనా అనుభవించు అని అర్థం. ఈ ఉపనిషత్ సందేశం సామాన్యమైన పాటలో, సామాన్యమైన మాటలలో ఒక చదువురాని వాని నోటిద్వారా నా వద్దకు వచ్చింది. దానిని విన్నప్పుడు నా ఆశ్చర్యానికి అంతులేదు తర్వాత కొంతకాలానికి క్షితిమోహన్ సేన్ గారు సేకరించిన అమూల్యమైన బాఉల్ పాటలలో మళ్ళీ విన్నాను. ఇందులోని సామాన్యమైన మాటలకు, ఆధ్యాత్మిక ప్రలోతులకు పోల్చుటకు ఇతరములేవీ లేవు, వాటి ఛందస్సుకూర్పు, వాటి జ్ఞాన భక్తి పారవశ్య ప్రకాశమునకు తగివుంది. ఇటువంటి పాటలు

ఇంకే ఇతర భాషలలోని ప్రజాసాహిత్యంలో వుంటవని నేను నమ్మను............బావుల్ పాటలలో హిందూ ముసల్మాన్‌ల స్వరములు కలిసి వున్నవి. వాటిలో పురాణమునకు, కురానుకు విరోధం లేదు. భారతీయుల నాగరికత ఇందులోనే వుంది........"

బావుల్ పాటలలో విశ్వమానవ సందేశం వుంది. స్వాభావికమైన, మధురమైన రాగము లున్నవి. వీటిని విశ్వప్రదర్శనలో పెట్టింది విశ్వకవి. 1925 వ సంవత్సరములో కలకత్తా నగరంలో అఖిల భారతీయ వేదాంత మహాసభ జరిగింది. అందు విశ్వకవి అధ్యక్షస్థానం అలంకరించారు. ఆ సభలో బావుల్ అనే మన ప్రజల వేదాంతమును గురించి తమ అధ్యక్షోపన్యాసంలో వివరించారు. ఇంతవరకు అజ్ఞాతంలోవున్న బావుల్ ఇప్పుడు విద్యావంతుల దృష్టి నాకర్షించింది. 1930 వ సంవత్సరంలో ఆక్సుఫర్డు యూనివర్శిటీవారు హిబ్బర్టు ఉపన్యాసముల నిచ్చుటకు విశ్వకవి టాగూరుగారును ఆహ్వానించారు. మళ్ళీ ఆయన విశ్వవిఖ్యాత, వేదాంతుల మధ్య మానవమతమును గురించి మాట్లాడుతూ, బావుల్‌ను అందులో చెప్పారు. ఈవిధంగా మహామేధావంతులమధ్య రెండుసార్లు విశ్వకవి ఉపన్యసించుటవల్ల విద్యావంతుల దృష్టి బావుల్ మీదకు తిరిగింది. అనేకమంది పండితులు బావుల్ గురించి తీవ్రపరిశోధనలు చేశారు. వీరిలో ముఖ్యులు క్షితిమోహన్‌సేన్ పండితులు. ఈ పరిశోధన చాలా కష్టమైంది. బావుల్‌కు శాస్త్రములు లేవు, గ్రంథములు లేవు, వీరు ఒక్కచోట వుండరు. వంగదేశం అంతా తిరిగి దీనిని గురించి అనేక విషయాలు పాటలు సేకరించారు. బావుల్ ఏనాడు పుట్టిందో ఎవరికీ తెలియదు. ఎవరు ప్రవక్తలో తెలియదు. బావుల్‌ను అడిగితే మనిషి పుట్టిన నాటినుండి మా మతం ఉందంటారు. స్వభావ సిద్ధంగా మానవునికి కలిగే భావములే మా మత మంటారు. వారికి మనిషే ముఖ్యం. అంతా మనిషిలోనే వుంది. బైటయెంత వెతికినా ఏమీ లాభం లేదు. కనుక లోపల మాస్తే అంతా తెలుస్తుంది. ఇందుకు ప్రేమ, యోగం సాధనలు. బావుల్ సంత్‌ల అభిప్రాయాలు చాలా సన్నిహితంగా వుంటవి. సంత్‌లు సహజీయశాఖలోని వారు. వీరందరి పుట్టుక అనార్య భూములలోనే. ఆర్యమతం ప్రవేశించని ఈశాన్య భారత భూములలో ఇవి మొలక తొడిగినవి. అక్కడ వేదములకు ఎదురు నిలిచిన జైన బౌద్ధమతములు పుట్టినవి. ఇక్కడే వేదసమ్మతములు కాని శైవ, నాథ, యోగ శాక్తేయ, సహజీయ మతములు వెలసినవి. ఈ మతాలు ఆర్యభూములలో ఎక్కువగా పాతుకుపోలేదు. మధ్య యుగంలో కబీరు కాశీలో జన్మించాడు. అనార్య దేశములైన వంగ, మగధ దేశాలలో ఆర్యమతం ప్రవేశించే నాటికి, అక్కడ సహజమతాలైన సంత్ బావుల్ వున్నవి. సంత్‌లకు మఠాదు లున్నవి. బావుల్‌కు ఇవి లేవు. సంత్‌ల ముఖ్యభాష హిందీ, బావుల్ ముఖ్య భాష వంగ. వంగీయుల ఆధ్యాత్మిక గాంభీర్యాలను తెలిసికోవాలెనంటే బావుల్‌ను గురించి తెలిసికోవలె నంటారు సేన్‌గారు.

బావుల్ రూపంలోకూడా పిచ్చివారివలె వుంటారు. వీరు మతాతీతులు. ఇందులో అన్ని మతాలు, అన్ని కులాలవారూ వున్నారు. అందరిలోవున్న సత్యాన్ని వీరు స్వీకరిస్తారు. హిందువుల శిరోజాలను, ముసల్మాన్‌ల గడ్డం - రెంటినీ పెంచుతారు. పెరిగిన జుట్టూ గడ్డంతో పిచ్చివానివలె వుంటారు. చినిగిన గుడ్డలను బొంతగా కుటి ఆపాదమస్తకం ధరిస్తారు. ఇతర సన్యాసులవలె కాషాయాంబరాలు వేయరు బైటిరంగువల్ల ప్రయోజనం లేదు. లోరంగే ప్రధాన మంటారు. కాయానికి పైపూత పూసినంతమాత్రాన మాధుర్యం రాదు. అది లోపల పండిన తర్వాతే దానికి రుచి వస్తుందంటారు. ఎడమ చేతితో సితారును మీటుతూ, కుడిచేతితో తబ్లావంటి దానిని వాయిస్తూ పాటలు పాడుతూ తిరుగుతుంటారు. వీరిలో గృహస్థులూ వున్నారు. వారిలో మహమ్మదీయులు బ్రాహ్మణులు ఇతర వర్ణముల వారందరూ వున్నారు. వారికి పుణ్యక్షేత్రములు లేవు. గురువు వారికి పాటలరూపంగా బోధ చేస్తారు. వారికి ఆధారాలు ఈ పాటలు. గురువు శిష్యునికి, అతనినుండి అతని శిష్యునికి చెప్తారు. శిష్యుడు గొప్పవాడైతే ఇంకా కొన్ని పాటలు తాను చేరుస్తాడు. వారు సత్యాన్ని 'అలేఖ్' అంటారు. అంతా అలేఖ్ నుండిపుట్టి, అలేఖ్‌లో గిట్టుతుంది. బావుల్ శాస్త్రనిబంధనలను ఒప్పుకోరు. సూఫీలలో ఒక శాఖ వారు ఇట్లే శాస్త్రనిబంధలను ఒప్పుకోరు. ఈ నిబంధనలను 'దివాన' అంటారు. అనగా పిచ్చిఅని అర్థం. ఒక సనాతన ముసల్మాన్ శాస్త్రనిబంధనలులేనిది ఆచరణ సాధ్యంకాదన్నాడు. ఇందుకు వారిచ్చిన సమాధానం ఇది. "బంగారు పనివాడు ఒక పుష్పంయొక్క శ్రేష్ఠతను పరిశీలించవలెనంటే, ఆ పుష్పాన్ని ఒరిపిడి రాతిమీద రాసి చూస్తాడు. ఇట్లె వుంటుంది శాస్త్రవిజ్ఞానం."

# 'బావుల్' ప్రేమతత్త్వం

అంతా సహజంగా రావలెనంటారు. బావుల్ సంప్రదాయం వేదములకంటే అనాదిదని సేన్‌గారు అభిప్రాయపడ్డారు. ఇందుకు బావుల్ సిద్ధాంతాలు వేదములలో చూపించారు. కాని వేదముల సిద్ధాంతములను బావుల్ ఎందుకు స్వీకరించకూడదని నా అభిప్రాయం? ఇందుకు గట్టి ఆధారాలు లేంది నిర్ధారణగా చెప్పలేము. వేదముల కర్మకాండకు ప్రాధాన్యమిచ్చాయి. బావుల్ ఆరాధనకు ప్రాముఖ్యం ఇచ్చింది. కాని, కొంతకాలం తర్వాత వేదములకు ఉపనిషత్తులు చేర్చబడ్డవి. ఇందులో అంతరంగ సాధన ముఖ్యం. వేదములలోని దేవతలును అంతరంగ దేవతలైనారు కొంతకాలమునకు. వేదములకు ముఖ్యదేవత అగ్ని. దీనినే అంతరంగంలో కుండలినీశక్తి అన్నారు. మహాకుండలినీ జాతవేదసమండలం అన్నారు మంత్రంలో. జాత వేదస మండలంలో పుట్టింది కుండలిని. ఈ జాతవేదసుడు, వేదములలోని జాతివేదుడూ ఒక్కరే. ఈ విధంగా యాగాగ్ని యోగాగ్ని అయింది. ఈ మార్పు బావుల్ సిద్ధాంతములనుండి వచ్చిందంటారు సేన్‌గారు.

ఇట్లే పురుష సూక్తమునకు బావుల్ సిద్ధాంతమునకు పోలికలు చూపించారు సేన్‌గారు. ప్రపంచం సృష్టి నాలోనుండి పుట్టిందని బావుల్ అంటారు. నాలో అనగా నా హృదయంలోవున్న పురుషునినుండి ఈ విశ్వమంతా వచ్చిందంటారు. హంసరాజను పేరుగల బావుల్ చెప్పినపాట:

"నా నేత్రములనుండి భూమ్యాకాశములు పుట్టినవి.
నాలోనే విశ్వకారణంవుంది. హంసరాజ్ మాట ఇది."

పురుషసూక్తంలో, యజ్ఞపురుషుని మనస్సునుండి చంద్రుడు, నేత్రములనుండి సూర్యుడు, ముఖంనుండి ఇంద్రాగ్నులు, ప్రాణంనుండి వాయువు, బొడ్డునుండి అంతరిక్షం, శిరస్సునుండి ద్యులోకము, పాదములనుండి భూలోకం, శ్రోత్రంనుండి దిక్కులూ పుట్టెను- అని చెప్పబడ్డది. ఈ రెంటిభావములూ ఒకే రకంగా వున్నవంటున్నారు సేన్‌గారు.

సృష్టికర్త అందరి హృదయాల్లోను వున్నాడు. కనుక మానవులంతా సమానులే. కులమతభేదాలు లేదంటారు బావుల్. ఈ విషయంకూడా ఉపనిషత్తులలోనికి తీసికోబడ్డాయంటారు సేన్‌గారు. వేదములలో నాలుగు వర్ణములున్నవని, బ్రాహ్మణుడు శిరస్సునుండి పుట్టాడని చెప్పబడ్డది. కొంతకాలం తర్వాత కులవిచక్షణ మీద ఆర్యులలోనే తిరుగుబాటు వచ్చిందని, కొన్ని రుజువుల నిచ్చారు సేన్‌గారు. వజ్రసూచ్యుపనిషత్తు క్రీ.శ. 973-981 అదిలో చీనా భాషలోనికి తర్జుమా చేయబడ్డది. అనగా చాలాకాలం పూర్వం ఉండివుంటుంది. ఇందులో అన్ని కులాలవారి శరీరాలు ఒకరకంగానే వున్నవి. పుట్టుకవలన కులంరాదు. ఋష్యశృంగుడు లేడినుండి, వ్యాసుడు చేపనుండి పుట్టి ఋషులైనారు. బ్రహ్మజ్ఞానసంపన్నులే బ్రాహ్మణులు-అని చెప్పబడ్డది. ఈ విధంగా భవిష్యపురాణంలోకూడా చెప్పబడి వున్నవి. కనుక కులాలనే భేదం వుండకూడదనే భావం బావుల్‌నుండి వచ్చివుంటుందన్నారు.

## అంతరపూజ

బైట యెంత వెతికినా ఏమీ ప్రయోజనం లేదు. అంతా లోపలే వుంది. లోపూజవల్లే ముక్తి కలుగుతుంది. శరీరంలో ప్రభు వున్నాడు. కనుక శరీరమే దేవాలయం, అదే పుణ్యక్షేత్రం - ఇదీ బావుల్ సిద్ధాంతం. ఈ విషయమై దాదూ చెప్పినపాట.

"ఈ శరీరమే నావేదం,
ఇందులో వ్రాసివుందీ ఈశ్వర సందేశం."

కబీరుపలికిన బంగారు పలుకులు:

"దేవుడిని బైట గుళ్ళు మసీదులలో
వెతికినంత కాలం దొరకడు,
అతను అందరిలోనూ వున్నాడు.
మానవ హృదయంలో అతనిని చూచినప్పుడె
మతకక్షలు మాయమౌతవి."

దాదూ అన్న మధురవాక్కులు:

"కొండలెక్కాను, నదులలో మునిగాను,
కాని, ప్రభూ నీవు నా వెంటనే వున్నావని
తెలిసికోలేకపోయాను."

## ప్రేమ

బావుల్ కుండలినీ సాధన, హృదయసాధన - ప్రేమ-రెండూ చేస్తారు. ప్రేమ ఈశ్వరుని సందేశం. ప్రేమవల్ల ప్రపంచం స్వర్గలోకం కాగలదు. ప్రేమవలన ఈశ్వర సాన్నిధ్యం దొరుకుతుంది. ప్రేమవల్ల అద్వైతసిద్ధి కలుగుతుంది. ప్రేమకలిగినప్పుడు ఇద్దరు ఒక్కటవుతారు. ప్రేమ లేనప్పుడు వారు వేరు, నేను వేరు. హృదయం హృదయం కౌగిలించుకోగా ఇద్దరు లేరు. ఒక్కరే వుంటారు. ఈ ప్రేమ భగవానునిమీద నిలిపినప్పుడు భక్తి అంటాము. భక్తిలేనప్పుడు జీవి వేరు.

బ్రహ్మవేరు. భక్తికలిగినప్పుడు భక్తుడు (జీవి) బ్రహ్మ ఏకం అయి పోతారు. అప్పుడు కలిగేది అద్వైతసిద్ధి. బావుల్ చెప్పినపాట:

"ఎప్పుడూ రెండు, ఎప్పుడూ ఒకటి.
దీని పేరే ప్రేమ."

ప్రేమ స్పర్శవేది. దానితాకిడివల్ల దైవత్వం కల్గుతుంది. బావుల్ పాట:

"ప్రేమ స్పర్శవల్ల కామం త్యాగం అవుతుంది.
మనిషి మాధవు డౌతాడు."

దాదూ శిష్యుడు రజ్జాబు చెప్పినపాట:

"భక్తుని హృదయంలోనే వుంది
జీవితమనే అక్షరాలత వ్రాయబడ్డ శాస్త్రం.
కాని కొద్దిమందే దానిని గ్రహించేది.
చాలామంది హృదయవేదాన్ని వినలేని బధిరులు"

ఉపనిషత్తులూ ఈ విషయాన్నే చెప్తున్నవి. మైత్రేయోపనిషత్తు శరీరమే దేవాలయం, అందున్న వాడే శివుడంటుంది. బ్రహ్మోపనిషత్తు, నారదీ పరివ్రాజకోపనిషత్తు, బ్రహ్మోపనిషత్తు ముక్తి కావలెనంటే, బైటి పూజలకన్నా లోపూజే ముఖ్యమంటున్నవి. యాజ్ఞవల్క్యులవారు అత్రికి జాబాలోపనిషత్తులో "బైటపూజ ముఖ్యంకాదు. లోపూజే కావలసింది ముక్తికి" అని చెప్పినారు.

బావుల్ ఆలోచించేది హృదయంనుండే. పాడేది హృదయంనుండే. పూజించేది హృదయంనుండే. హృదయంలో పరవశమై పాడేపాటే వారి పూజా పుష్పం. ఒక సనాతన ముసల్మాన్ అడుగగా ఒక బావుల్ చెప్పిన పాట.

"మిత్రమా! నీవు కాదన్నా నేను నీకు లోబడలేను,
నా ఈశ్వరారాధన నా పాటలోనే వుంది.
అందుకే పుష్పం తన అందంతో ప్రభువునుపూజిస్తుంది.
ఇంకో పుష్పం తన సువాసనతో సేవిస్తుంది ఈశ్వరుని.
నా ఆరాధన నా స్వరంలో వుంది.
ఇందుకే నేను పాట పాడటం"

బావుల్ ప్రేమ తమకు రెక్కల నిస్తుం దంటారు. ప్రేమ అనే రెక్కలతో వారు పైకి ఎగర గలరు. కనుకనే తాము పక్షిజాతికి చెందిన వారమంటారు. ఉపనిషతులలో సాధనమార్గాలు రెండు విధాలు అని చెప్పబడ్డవి. (1) పిపీలికామార్గం, (2) శుకమార్గం. ఒక చెట్టుమీద పండు అందుకోవలెనంటే పురుగు మెల్లిదిగా అక్కడకు పాకి వెళ్తుంది. ఇది ఆలస్యం పక్షి ఒక్కసారి ఎగిరి అందుకుంటుంది. ఇది త్వరగా అవుతుంది. హఠయోగాదులు పిపీలికామార్గమని, జ్ఞానయోగం శుకమార్గమని మన శాస్త్రం చెబుతుంది.

ఏ మార్గమైన తీవ్రావేదన, తీవ్రసాధన లేనిది లభించదు. ఇందుకు బొటనవ్రేలినుండి శిరస్సువరకు వాని నామం ప్రతిధ్వనించేట్లు చేయవలెనంటారు బావుల్. అప్పుడుగాని ప్రభువు తలుపులు తెరవబడవు. చూడగా చూడగాగాని జ్యోతి కనుపించదు. ఇందుకు అనేక విఘ్నాలుంటవి. ఈ విషయంలో కాశ్మీరు యోగిని లల్లామాత చెప్పింది సమంజసంగా వుంది. ఈమె చెప్పిన తత్వాల్లో సహజీయ భావా లున్నవి. యోగ విఘ్నాలనుగురించి ఈమె చెప్పిన మాటలివి: యోగభంగమనే చెట్టును, ప్రణవమనే ఆయుధంతో నరుకుతూ పోవాలి. ఈ యోగిని తాను పరంజ్యోతి దర్శనానికై పడ్డ భయంకర బాధలను ఇట్లా చెప్పింది:

"లల్లానైన నేను అతనికై వెతికి వెతికి వేసారాను.
అందుకు మానవసహనం మించిన బాధలు భరించాను.
నేను చూడటం ప్రారంభించాను
ప్రభువు తలుపులు గడియలతో బిగించబడి వున్నవి.
అప్పుడు నే నున్న చోటనే చలించనిదీక్షతో నిలవగా
అతని వెల్తురు చూచాను"

ఇవి సామాన్యమైన మాటలే. కాని ఇందులో యోగ సాధనా రహస్యా లున్నవి: సాధన చేసినవారికే అనుభవవేద్యమైన వివి. ఈ భావాన్ని ఉపనిషత్తులు ఇట్లా అన్నవి "వీరాణా మేవ కరతలగతా ముక్తిః నపునః కాపురుషాణాం." వీరులకే ముక్తి. పిరికివారికి కాదు. ఇటువంటి భరించరాని బాధలు హిందూ ముసల్మాన్ క్రైస్తవ యోగులెందరో అనుభవించారు. దీనినే విషాదయోగమని, విరహయోగమని, చీకటి రాత్రులని అనేక విధాల చెప్పారు. వీటికి నిలవగల వాడే సిద్ధుడు.

పరిపూర్ణ ప్రేమలో అహం నశిస్తుంది. అహం నశించుటె జీవ బ్రహ్మైక్యం. ప్రేమ సాధనలోవున్న రహస్యం ఇది. ఇతరయోగ సాధనలూ అహం నశించ డానికి చేయబడేవే.

## యోగసాధన

బావుల్ ప్రేమసాధనతోపాటు యోగసాధనలూ చేస్తారు. ఇందుకు కుండలినీ సాధన, కాయ

యోగము, ఖ-సమసాధనలు చేస్తారు. ఇవి తాంత్రిక సాధనలవంటివే. తంత్రశాస్త్రమునకు బావుల్ శాస్త్రమునకు కొన్ని సామ్యములూ వున్నవి; కొన్ని భేదములూ వున్నవి. అజేయమైన ఈ దేవాలయంలో (శరీరము) ఎనిమిది చక్రములు, తొమ్మిది ద్వారాలున్నవి. ఈ శరీరంలో జ్యోతిః ప్రకాశంతో కప్పబడ్డ పాత్ర వుంది. ఈ అష్టచక్రములను, నవద్వారాలను, జ్యోతిఃప్రకాశంతోవున్న హిరణ్మయ పాత్రను చూడవలెనంటే సామాన్యులకు అలవికాదు. ఇందుకు యోగసాధనే మార్గం. ఈ మార్గాన అనేకులు వెళ్ళి అనేక అద్భుతాలను చూచామని చెప్పారు. బావుల్ ఎనిమిది చక్రాలు చెప్పారు. తంత్రశాస్త్రం ఆరుచక్రాలనే చెప్తుందంటారు సేన్‌గారు. ఇందుకు పూర్ణానంద స్వామి షట్చక్రనిరూపణ ఉదాహరించారు. కాని తంత్రశాస్త్రంలో ఆరుచక్రాలేకాక, ఇంకా కొన్ని చిన్నచక్రాలున్నవని చెప్పబడివున్నవి. కొన్నిచోట్ల తొమ్మిది చక్రాలు చెప్పబడ్డవి. శరీరములోని ఈ చక్రములను గురించి సరిగ్గా బావుల్ చెప్పినట్లే అథర్వవేదంలో చెప్పబడ్డది. సూర్యచంద్ర నాడులను సుషుమ్నలో ఐక్యంచేయుటే సాధన. వీటి ఊర్ధ్వగతిలో బావుల్‌కు తంత్రశాస్త్రమునకు భేద ముంది. గొప్ప భేదం బావుల్ ప్రేమ తాంత్రికులలో లేదు. సమస్త శరీరంలో వుంది. ఆ శరీర పరిశోధనే కాయయోగము. హఠయోగమును ఘటయోగమనికూడా అంటారు. ఘటమన్న కాయమన్న ఒక్కటేనని నా అభిప్రాయం. శరీరంద్వారా సిద్ధిపొందుటే కాయయోగం.

## ఊర్ధ్వ స్రోతస్సు

శరీరంద్వారా బ్రహ్మసిద్ధినిపొందుట కాయసాధన. దీనికి ప్రధానాంగము ఊర్ధ్వస్రోతస్సు. మానవునికి వీర్యం ముఖ్యద్రవ్యం. ప్రజోత్పత్తికై ఇది అధోగామి అవుతుంది. అప్పుడు కలిగేది మానవానందం. దీనిని ఊర్ధ్వమునకు నడిపితే, అది ఓజస్సవుతుంది. ఇది బ్రహ్మసిద్ధికి తోడ్పడుతుంది. కనుకనే ఊర్ధ్వస్రోతస్సు బ్రహ్మచర్య మన్నారు. దీనివలన బ్రహ్మానందం కలుగుతుంది. బ్రహ్మానందంలో మానవానందం నూరో పాలికకూడా లేదని అనుభవసిద్ధులు చెప్తున్నారు. బ్రహ్మచర్యం స్థూలమును సూక్ష్మములోనికి మార్చుపని అయివుంది. పన్నెండేండ్లు బ్రహ్మచర్యం ఆదరించేయెడల మేధా నాడి అనేనూతననాడి పుట్టుందని రామకృష్ణ పరమహంస చెప్పారు. ఊర్ధ్వస్రోతస్సును గురించి నానీమాత చెప్పిన పాట:

"ప్రవాహంమీద తేలే దీపం నా జీవితం,
నన్ను ఒడ్డుకు చేర్చేదే ఆ దీపం,
కామాన్ని మోక్షం జయించే దెట్లా?
అధః ప్రవాహాన్ని ఊర్ధ్వానికి మార్చు.
ఇది కామదాహాన్ని ఆర్పుతుంది.
దీపంలో వత్తి వలిగించి చూడు
నూనె పైకి నడుస్తుంది, జ్యోతి వెలుగుతుంది."

## జీవన్మృతత్వ సాధన

జీవించి వుండగానే మరణించుట బావుల్ సాధనలలో ఒకటి. జీవించి వుండగా మరణించుటనగా శరీరమును మరచుటైవుంది. యోగసిద్ధికి మనస్సు, ఇంద్రియాలు, శరీరం అడ్డం వున్నవి. శరీరభావం ఎప్పుడు పోతుందో, అహంకారం ఎప్పుడు నశిస్తుందో అప్పుడే సమాధిసిద్ధి. సూఫీలు, సహజశాఖీయులు కూడా ఈ సాధన చేస్తారు. సూఫీలు దీనిని ఫిలాఫనా అంటారు. ఈ విషయమై బావుల్ చెప్పినపాట.

"లోక జలధిలో మునిగే దెవరు?
జీవించి వుండగా మరణించే దెవరు?
అట్టివారికే సాగరగర్భంలోవున్న
రత్నాలు కనుపించేది."

ఈ విషయాన్ని భగవద్గీత 2 వ అధ్యాయంలో బ్రాహ్మీస్థితిని గురించి చెప్పిన 'యా నిశా సర్వభూతానాం' అన్న శ్లోకంలో చెప్పింది. ఎందరో సాధకులు, సిద్ధులు వ్రాసిన భగవద్గీత వ్యాఖ్య చూచాను. విశ్వదాత, స్థితప్రజ్ఞుడు అయిన కాశీనాథుని నాగేశ్వరరావుగారి వ్యాఖ్య నాకు నచ్చింది. సామాన్యులు శరీరంతో జాగ్రత్ స్థితిలో వుంటారు. యోగులు ఇక్కడ నిద్రాస్థితిలో వుంటారు. సామాన్యులు అంతరంగమున నిద్రాస్థితిలో వుంటారు. అనగా సామాన్యులు లోపలకు చూడరు. యోగి అంతరంగంలో జాగ్రదవస్థలో వుండవలెనని అంటుంది. ఇదే జీవన్మృతి, సమాధిసిద్ధరహస్యం. బైటమరచి,లోపల మేల్కొని వుండుటే ఇది. విశ్వదాత వ్రాసిన ఈ వ్యాఖ్య అనుభవపూర్వకమైంది.

## ఖ - సమసాధన

ఖ అనగా ఆకాశము. సమఅనగా సమ వకాట్టు. ఖ-సమసాధన అనగా ఆకాశంవలె అయ్యేసాధన. పర

మాత్మకు రూపం లేదు. రూపంలేని ఆకాశస్థితిని పొందుటనగా, బ్రాహ్మీస్థితిని పొందుటయైవుంది. సమాధిసిద్ధికి బావుల్ ఈ సాధన చేస్తారు. దీనిలో సిద్ధిపొందిన తర్వాత వచ్చేసమాధిని సహజసమాధి అంటారు వీరు. ఈ సాధన ఖేచరి, చిన్ముద్రలవంటిదని నా అభిప్రాయం. ఖ అనగా ఆకాశము, చరి అనగా చరించుట. అనగా ఆకాశమున చరించునదే ఖేచరి. అనగా భ్రూస్థానంవద్ద చూడటమే, ఆకాశమును చూచుట. చూడగా చూడగా ఆకాశంవలె శూన్యస్థితి కల్గుతుంది. జగద్గురు శంకరస్వామి చెప్పిన చిన్ముద్ర ఇట్టిదె. బొటన వ్రేలిమధ్య కణుపుకు చూపుడువ్రేలు ఆనించి, తతిమ్మా మూడువ్రేళ్ళు విడిచివుంచునదే చిన్ముద్ర. బొటన వ్రేలు బ్రహ్మము, చూపుడువ్రేలు జీవం, తర్వాత మూడు వ్రేళ్ళు స్థూలసూక్ష్మకారణ శరీరాలు అని భావం. ఈ మూడు శరీరాలను విడిచి, చూపుడు వ్రేలు బొటనవ్రేలితో కలుపుట జీవబ్రహ్మమును ఐక్యం చేయుట. చూపుడువ్రేలు బొటనవ్రేలితో కలుపగా మధ్యకాళి కనుపించును. ఇదే చిదాకాశం. ఈ కాళీని చూడగా, చూడగా ఆకాశరూపాన్ని సాధకుడు పొందును. ఇదీ చిన్ముద్రా రహస్యం. దీనిని బౌద్ధులు శూన్యపద మని, తథాగత మని అంటారు. మనం అద్వైతసిద్ధి అంటాము. సుషుమ్నా నాడిని శూన్య నాడి అంటారు. సూర్యచంద్రులను శూన్యనాడిలో కలపగా, సహస్రారకమలంమధ్యవున్న మనోన్మనీ స్థానం చెందుతాడు. ఇది వెయ్యి సూర్యుల ప్రకాశం. వెయ్యి చంద్రుల శీతలం, విద్యుత్ కోటి ప్రకాశం కలిగి వుంటుంది. ఇది బ్రహ్మానందస్థానం. ఇదె బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం, జ్ఞానమూర్తిం, ద్వంద్వాతీతం, గగనసదృశం, తత్వమునకు ఆదిలక్ష్యం.

## మూలకారణం బెవ్వడు ?

బావుల్ బ్రహ్మాండంలో వున్నదంతా, పిండాండంలో వున్నదంటారు. పైనచెప్పిన మనోన్మనీ స్థానం బ్రహ్మాండంలో ఎక్కడుంది? భాగవతంలో పోతన్నగారు, గజేంద్రమోక్షంలో ఎవ్వనిచే జనించు అను పద్యంలో మూలకారణం బెవ్వడు? అని అన్నారు. నా అభిప్రాయంలో పిండాండంలోనూ, బ్రహ్మాండంలోనూ ఈ మూలకారణం వుంది. శరీరంలో మూల కారణము సహస్రారంలో వున్న బిందువు. దీనినే సర్వ కారణ బిందువని, ఆనందపీఠమని సుధాసింధువు అని అంటారు. ఈ కారణంనుండే మనస్సు, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథ్వి పుట్టినవి. ఇవి వరుసగా ఆజ్ఞా, విశుద్ధ, అనాహత, మణిపూరక, స్వాధిష్ఠాన, మూలాధార చక్రాలలో వున్నవి ఈ శరీరంలో. సూర్యచంద్రనాడులు, భ్రూస్థానంవరకు వెళ్లి ఆగిపోతాయి. బ్రహ్మనాడియైన సుషుమ్నమటుకు పై సర్వ కారణ బిందువువరకు పోతుంది. ఆజ్ఞాచక్రంపై వున్న స్థానాన్ని తురీయకూటం అంటారు. ఇందులో కాలం లేదు. ఇక్కడ మనస్సు లేదు. మనస్సు ఆజ్ఞాచక్రం వరకే. బ్రహ్మాండంలో ప్రపంచ కారణము ఆకాశాన ఉన్న పాలకడలి అంటారు కొందరు శాస్త్రజ్ఞులు. కాని ఈ పాలకడలికి కారణం ఏది? ఇది ఇంకా పైన వున్నదని నా అభిప్రాయం. ప్రపంచంలో శీతోష్ణపు మార్పులు, తుపానులకు కారణం సూర్యునిలోని మచ్చలు అంటున్నారు శాస్త్రజ్ఞులు. ఈ సూర్యునిలోని మచ్చలకు కారణమేది? ఇది ఇంకా పైన ఉన్నదని నా అభిప్రాయం. శరీరంలోని సూర్యచంద్రులవలె ప్రపంచంలోని సూర్యచంద్రులు కొంతవరకే వెళ్లగలిగేది. ఈక్రిందనే కాలం, స్థలం వున్నాయి. ఈక్రిందనే మనస్సు పనిచేస్తుంది. ఈ సూర్యచంద్రులపైన అవ్యక్తమనే మనోన్మనీ స్థానం ఉందని నా అభిప్రాయం. అందువల్లనే, ఆకాశం పైన ఎంతవరకు వుందో అని మన మనస్సు వూహించలేకుండా వుంది. ఆపైన మనస్సు ఎందుకూ పనికిరాదు. మనస్సుకు అందనివాడే భగవంతుడు, అవ్యక్తుడు. దీనికి ప్రధానమైన ఆధారము భగవద్గీతలో 15 వ అధ్యాయంలోని మొదటి శ్లోకము. ఈ అధ్యాయం జగద్గురు శంకరస్వామివారికి చాలా ప్రీతి అయింది. ఇందులో అనేక రహస్యాలున్నవి. ఇందుకే ఈ అధ్యాయం చివరిశ్లోకంలో 'ఇతిగుహ్యతమం' అన్నారు. అన్ని అధ్యాయాలు వదిలి దీనిని మిక్కిలి రహస్యమైందని అన్నారు భగవానులు. ఇందులోని రహస్యాలు మనకు అర్థం కాలేదేమో ననుకుంటాను.

"ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్."

అశ్వత్థవృక్షంయొక్క మూలం పైన, శాఖలుక్రింద వున్నవని చెప్పబడుచున్నది. దాని ఆకులు వేద మంత్రములై వున్నవి. దీనిని తెలిసినవాడే అంతా తెలిసినవాడు. దీని తాత్పర్యం, మూలం పైన, దాని ఆకులు

క్రిందవున్నవని. దీనిని తెలిసినవాడే సర్వజ్ఞుడు. ఈ శ్లోకం పిండాండమునకు, బ్రహ్మాండమునకు సరిపోతుం దని నా అభిప్రాయం. యోగశాస్త్రరీత్యా సర్వకారణము శరీరంలోని సహస్రారంలో వుంది. ఈ అశ్వత్థ వృక్షమే సుషుమ్నా నాడి. ఇదే బ్రహ్మనాడి. దశమ ద్వారంలోవున్న బ్రహ్మవద్ద ఈ నాడి మూలం వుంది. అక్కడినుండి శాఖోపశాఖలుగా శరీరంలో క్రిందికి నాడులుగా వ్యాపించివుంది. బ్రహ్మాండంలోకూడా బ్రహ్మమూలమూ, కారణస్థానం పైన, సూర్యచంద్రులు పైన వుండి, మనస్సుకు అందని అవ్యక్తంలో వుంది. ఆ మూలంనుండే ప్రపంచం రూపొందివుంది. ఈ శ్లోకంలో రహస్యార్థం వుంది. అందుకే దీనిని తెలిసినవాడె వేద విత్ అన్నాడు. ప్రార్థనాకాలంలో పైవంకచూచి ప్రార్థించుట గమనించతగ్గది. మనకు తెలియకపోయినా హృదయాంతర్యామి చూపిన లక్ష్యం ఇది. కనుక పోత న్నగా రన్న మూలకారణం పైనేనని నా అభిప్రాయం.

## బావుల్ సంకేతభాష

రామకృష్ణ పరమహంసవద్దకు బావుల్ తరుచూ వస్తూవుండేవారు. బావుల్ అంటే పరమహంసకు ఎంతో ప్రీతి. వీరిద్దరూ కుండలినీ సాధకులే. బావుల్ సాధన చేస్తున్నట్లు ఇతరులకు తెలియనీయరు. బావుల్ ఇతరులను అన్యు లంటారు. వారి అన్నది కూడా ఇతరులకు వినిపించకుండా అంటారు. వారిలో వారు సంకేత భాషలో మాట్లాడుకుంటారు. దీని అర్థములను పరమ హంస వారి శిష్యులకు చెప్పేవారు. నీవు ఏ ఇంట్లో వున్నావంటారు. నీవు ఏ చక్రంవద్ద ధ్యానం చేస్తున్నావని దీని అర్థం. కుండ పొయ్యిమీదే వుందా అంటారు. యోగసాధన చేస్తున్నావా అని అర్థం. నా వుద్దేశ్యంలో దీనిభావం ఇంకా విశదంగా వుంది. పొయ్యి అనగా మూలాధార చక్రంలోవున్న కుండలినీశక్తి అనే అగ్ని. పైకుండ అనగా సహస్రారంలో వున్న చంద్రమండలం. చంద్రమండలం బహుశీతలంగా వుండి గడ్డకట్టుకుని వుంటుంది మంచుగడ్డవలె. క్రింద పొయ్యిలోవున్న అగ్ని కుండలినీమంట. సాధన చేయగా, ఈ కుండలినీ అగ్ని ప్రజ్వలిస్తుంది. ఇదే యోగాగ్ని. ఈ అగ్ని బాగా వేడెక్కినప్పుడే, పొయిమీదవున్న కుండ అనే చంద్రమండలం శీతలం తగ్గి కరుగుతుంది. చంద్రమండలమే అమృతసముద్రం. ఇది కుండలినీ అగ్నికి కరగి, అమృతపు జల్లుగా క్రిందికి వర్షిస్తుంది. ఈ అమృతాన్ని సేవిస్తూ పరమయోగీంద్రులు బ్రహ్మానందాన్ని అనుభవిస్తారు. దాని పూర్తి భావం ఇదని నా అభిప్రాయం. పరిపూర్ణత్వంపొందిన వారిని వేదాంతులు 'పరమహంస', శాక్తేయులు 'కౌళ' అన్నట్లు, వీరు 'శాయి' అంటారు. శాయి అన్న గుర్తుగా వారి మెడలో సగం ఆముబొమికలు, సగం తులసి బిళ్ళలు గుచ్చిన దండవేసికుంటారు. వారి గురువును కర్త అంటారు. గురుపూజ చేసేవారిలో కొందర్ని కర్తభు లంటారు. ఒకసారి, నీవే తింటున్నావా, ఇతరులకు కూడా ఏమైనా పెట్టున్నావా అని పరమహంసను ప్రశ్నించారు బావుల్. అనగా బ్రహ్మానందాన్ని నీవు ఒక్కడివే అనుభవిస్తున్నావా, ఇతరులకు కూడా ఏమైనా ప్రసాదిస్తున్నావా అని అర్థం.

బావుల్ శక్తిని ఎంత సాధిస్తారో, ప్రేమను అంత ప్రేమిస్తారు. ప్రేమ శక్తి కలిసినప్పుడు బంగారమునకు సువాసన అబ్బినట్లుంటుంది.

సామాన్యులలోవున్న ఈ పాటలు, రవీంద్రనాథ టాగూరుగారికి ప్రేమ, విశ్వసందేశముల నిచ్చినవి. ప్రజాసాహిత్యంలో అనేక మధురమైన, శక్తిమంతములైన భావము లెన్నో వున్నవి. మన దేశంలో కూడా అచలతత్వాలు, పదాలు, పాటలు ఇటువంటి వెన్నో వున్నవి. యోగశాస్త్రమే రహస్యమైంది. ఈ తత్వాలు ఇంకా సాంకేతిక భాషలో చెప్పబడ్డవి. ఇందులో అనేక యోగరహస్యా లున్నవి. యోగశాస్త్రంలో కుండలినీ ఆగ్నేయశక్తి వుంది. ఇది అణుశక్తి వంటిది. యోగవిద్య కేంద్రప్రభుత్వం వారిది. వారు ఈ కుండలినీ శక్తిని పరిశోధించుట ఎంతైనా సమంజసం. ఇందుకు ఇటువంటి తత్వాల పరిశోధించి, అందున్న రహస్యాలు వెలిదీయుట భారతీయ ప్రభుత్వపు విధి. కాశ్మీరు లల్లా యోగినివంటివారు, తరిగొండ వెంకమ్మ గారు వ్రాసిన యోగశాస్త్రగ్రంథాలు సామాన్యులకు కూడా అర్థం అవునట్లు వ్రాయించడం అవసరం. ఇట్లే తత్వములు ఎన్నో వున్నవి. ప్రజలలోవున్న తత్వములనన్నిటి గ్రంథస్థం చేయుట, అందులోని అర్థం తెలిసికొనుట, తెలిసినదాని పరిశోధించుట అవసరం. అణుశక్తికి ఖర్చుపెట్టే కోట్లధనంలో, ఏకొద్దో ఇందుకు వినియోగించినా బ్రహ్మాండమైన లాభం కల్గుతుంది. దీనివల్ల భుక్తి ముక్తి కల్గుతాయి.

"జలంలేని జలధిలో, కాళ్లులేని విహంగం విహరిస్తుంది."

# సాహితీ సుగతుని స్వాగతం

ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు;
పురుషులందు పుణ్యపురుషులు వేరయా-

అని వేమనయోగి ఉప్పుతో సర్వసామాన్య ప్రజలను ధ్వనింపజేసి, కర్పూరానికి గొప్పదనం ఇచ్చాడు. నేనైతే ప్రతిమానవుని నిత్యజీవితానికి - జీవితానికే- అవసరమైన ఉప్పే గొప్ప దంటాను.

ఉప్పుతో శామ్మిది లేకపోయినా, అన్నానికి తోడుగా ఒక్క ఉప్పు ఉంటే చాలు - ఏకూ చింతా లేక హాయిగా కడుపు నింపుకోవచ్చు. రుచులలో తీపుకు అగ్రస్థానమిస్తారు చాలమంది; కాని సుమతి శతకకర్త అన్నట్లు "ఉప్పే పస రుచుల కెల్ల."

ఇంతగా నిత్యోపయోగి అయిన ఉప్పు పూర్వం ప్రపంచంలో చాలమందికి తెలీదు. ఆఫ్రికాఖండ వాసులకు ఎంతో కాలంవరకు ఇది తెలీదట; యూరోపియనులద్వారా అక్కడ వ్యాపించిందట. వారు ఉప్పు లేనప్పుడు పచ్చి మాంసం, పాలు, పండ్లు తినేవారట.

మధ్యయుగాలలో అబిసీనియా, టిబెట్టు మున్నగు దేశాలలో ఉప్పుబిళ్లలు రూపాయిబిళ్ళలుగా చెలామణి అయ్యేవట. నేటికీ కొందరు ఆటవికజాతివారు ఉప్పును అమూల్యమైన తేనె, సారపప్పు, పగడాలు, పూసలు వంటివాటితో వినిమయం చేసుకోనడం కద్దు. ఇంత విలువగలది గనుక నే, ఉప్పు అంటే సొమ్ము అనే వ్యవహారమూ ఏర్పడింది. "ఉప్పుతిన్న నెనరు," "వాని ఉప్పు తిని బ్రతకడం"వంటి పలుకుబళ్లు, "నమక్ హారాం" "నమక్ హలాల్" వంటి సామెతలు పుట్టాయి.

ఇతర ప్రజల సంగతి ఏమో కాని, మనకు వేద కాలంనుంచీ ఉప్పు తెలుసు. ఇంతగా అత్యవసరమైన ఉప్పును ఎప్పుడు, ఎవరు కనిపెట్టారో? ఇతర జాతులకు ఇది ఎలా లభించిందో మన కెందుకు గాని, మనకు — సముద్రతీర ప్రాంత వాసులమైన మనకు - సముద్రుడు సహజంగానే ఉప్పు ప్రసాదించాడు.

మనపూర్వులు ఉప్పును కనిపెట్టడం ఆశ్చర్యకరంగానే జరిగివుంటుంది. ఉప్పు నేలలో నిలిచిననీరు ఇంకి ఎండిపోయిన తర్వాత కనిపించే తెల్లటి పెచ్చులు మన పూర్వుల కంటబడివుంటాయి. సముద్రతీర ప్రాంతాలలో కెరటాలు ఉరవడిగా లేచి చెలియలికట్టను దాటి వచ్చి తిరిగి పోయినప్పుడు ఆ ప్రాంతాలలో నిలవైన నీరు ఎండకు ఉరఉరలాడుతూ ఎండి, ఉరవై పోగా మిగులు దేలిన పదార్థాన్ని కూడా కళ్లారచూచివుంటారు. ఆ ఉరవైన—గట్టిపడిన—నీరే ఉర్ పు-ఉప్పు-గా వారి వ్యవహారంలో చేరివుంటుంది.

ఉప్పు అన్నమాట సంస్కృతంనుంచి వచ్చిందనే సాహసికులు ఉండరనుకుంటాను. తమిళ, తెలుగు, కన్నడ, మలయాళాలలో — లవణార్థకంలో ఉప్పు అన్నమాట ఒక్కటే వుంది. దక్షిణభారతంలోని తోడ, కోట, అనాదిజాతులవారు ఉప్పు అని, బడగ, కురుంబ, ఇరుళజాతులవారు యుప్పుఅని అంటారు.

తెనుగుదేశంలోని అనాదిజాతులలో ఖోండు వారుమాత్రం వుప్పంగ అంటారు. సవరలు బాసి అని, గదబలు బత్తిఅని, ఎగకలం సోనగఅని, చెంచులు లోన అని అంటారు. సోనగ, లోన అనేమాటలు సంస్కృత భవాలయిన భాషల ప్రభావంవల్ల వచ్చినవి. కనుక ఉప్పు పూర్తిగా దక్షిణాదిపద మనడంలో సందేహం లేదు.

తమిళ, కన్నడ, మలయాళాలలో మండు, గట్టిపడు అనే అర్థాలలో ఉరి, ఉరు ధాతువులు కనిపిస్తున్నాయి. నీరు ఉరలి-మండి (ఎండి) ఉరవై ఏర్పడడమే ఉప్పు. తమిళ్ లో-ఉరి(త్తల్) పదానికి గట్టిపడు, దళసరిఅగు, ఘనీభవించు, తీక్ష్ణమగు, సూర్యునిలాగ తీవ్రమగు అనేఅర్థాలున్నాయి. మలయాళంలో — ఉరి, ఉరవు(దల్)-గట్టిపడు, శక్తిమంతమగు. ఉరవు-బలం హెచ్చడం. ఉరుప్పం-ఎండవంటి వేడి, ఆవిరి, కోపం. ఉగుప్పు-వేడి, కోపం, ఆవేశం, క్రౌర్యం, హెచ్చుకావడం, రంగు.

కన్నడంలో—ఉప్పు, ఉరి, ఉరు, ఉరుపు, ఉరువు అనేమాటలకు కాలు, మండు అని అర్థాలు. తుళులో ఉప్పు అంటే ఉండు, కట్టుబడివుండు సమరించు,రక్షించుఅనేఅర్థాలే కాక ఒగరుఅనేఅర్థంకూడా వుంది. ఇక తెలుగులో ఎరియు (మండు) అనేమాట ఉండనేవుంది. ఉరియు-పక్వమగు, ఉడుకు, కాలు. ఉటిది, ఉటువు-గట్టిది. ఉప్పు అనేమాటకు ఉడకబెట్టు, ఆవిరిపోక ఉడికించు అనేఅర్థాలు కూడ ఉండనేఉన్నాయి. ఉప్పుడుబియ్యం ఉడకబెట్టిన బియ్యం. ఇవన్నీ నీరు ఇంకిపోవడంలోను, మరిగిపోవడంలోను, మంట మండడంలోను కలిగే ధ్వనికి అనుకరణరూపాలే.

ఉప్పెన అనేది ఉప్పు ఉబ్బు అనేమాటవల్ల వచ్చిందిగనుక సముద్రం ఉబ్బి నీరు గట్టుకుకొట్టగా, అది ఎండి, అటు ఉర్ పు-ఉప్పుగాను, ఇటు ఉప్పెనగాను అయిందని అనుమానించవచ్చు.

ఏతావతా, మండు, ఎండు అనే అర్థాలున్న ఉర్, ఉర, ఉరి అనే మాటలవల్లగాని, గట్టిపడు అనే అర్థమిచ్చే ఉటిది,ఉటువు అనే మాటలనుంచికాని ఉర్ పు, ఉప్పు పరిణమించివుంటుంది. —రామచంద్ర.

# పుస్తకాల పోరాటం

తా. రా.

"ఎవరమ్మా నీవు? నా పక్కన కూచోడానికేనా, ఈ వ్యాసపీఠం ఎక్కి వస్తున్నావు?"

"నేనే నండి. ఇది వ్యాసపీఠమో, శంఖపీఠమో తెలియదు గాని, సాటివారు ఉన్నారు గదా అని ఎక్కబోయానండి. ఎక్కడం తప్పంటారా?"

"తప్పేముంది? సర్వాత్మనా ఎక్కవచ్చు. మరిని పుట్టుపూర్వాలు...తాహతు...మరేదో శంఖపీఠమన్నావే, అదేమిటి?"

"మా ధూర్జటికవి చెప్పాడు లెండి. పూర్వం మధురానగరంలో ఒక సరస్సులో శంఖపీఠం అని ఉండేదట. కవిత్వం బరువు హాళువులు చూడడానికి దానిమీద రచనలను ఉంచేవారట. ఉత్తమ రచనైతే తేలేదట. కాకపోతే మునిగేదట..."

"శంఖపీఠమా? నేనెప్పుడూ వినలేదే!"

"శంఖపీఠం కాదు; సంఘపీఠం. పూర్వం తమిళ దేశంలో కవిపండితుల సంఘాలు ఉండేవి. వాటిలో పరీక్షకు నిలిచిన రచన గణించేది. అదే శంఖపీఠంగా మారింది. సంఘం అనేదికూడా బౌద్ధజైన సంఘాలవల్ల వచ్చిన వ్యవహారం-అని పరిశోధకులు అంటారు మరి."

"సరేలే. ఆ శంఖపీఠం వివరాలు నాకు ఎందుకులే. గణరాజ్యాలున్నాయిగా. అలాగే సంఘాలు ఉండి ఉంటాయి కాబోలు...నీ పేరు ఏమన్నావు!"

"నన్ను అగ్నిధార అంటారండీ. నేను పీడిత ప్రజానీకం కష్టాలను, ఆశలను..."

"అగ్నిధార...అగ్నిధార...అగ్నికి ధార ఏమిటమ్మాయి?"

"విద్యుల్లత, ఖడ్గలత అంటే లతలాండీ?"

"కాదూ మరి? మెరుపు తీగలుతీగలుగా వ్యాపించడం లేదూ? కత్తి ఝళిపిస్తే తీగలాగ చివచివలాడదూ?"

"అలాగే నిప్పుమంటకూడా కంటితడితో జంటైనప్పుడు పెల్లుబికి ధారకడుతుందండీ."

"ఓహో! చురకుపాలు ఎక్కువగానే వుండే. ఆ అమ్మాయిలు ఎవరు?"

"ఈమె అగ్నివీణ, ఈమె రుద్రవీణ."

"అగ్నివీణకూ మునుపటి సమాధానమే చెబుతావు. రుద్రవీణ ఏమిటమ్మాయి? రుద్రునికి వీణ...ఢమరుకమె కాని వీణలేదే?"

"ఢమరుకం సంగీతానికి ప్రతీక కదండీ. మేం వీణ పెట్టాము ఆర్తనాదాలు మహారౌద్రంగా పలుకుతుందనే ఊహతో. అంతా మనస్సే కదండీ. మన ఏవ మనుష్యాణాం కారణం - అన్నాడు కృష్ణ భగవానుడు."

"ఊం! కృష్ణభగవానుని వాక్కులూ చదివావూ? ఎక్కడ చదివావమ్మా అంతతాపీగా..."

"గీతలోనండి. గీతకూడా తెలియక వ్యాసపీఠాచార్యులులా ప్రశ్నలు వేయడమే పని పెట్టుకున్నారే, ఎవరండీ మీరు?"

"నీవు అన్న కృష్ణభగవానుని ప్రపంచానికి తెలిపిన మహాభారతమమ్మా నేను."

"వ్యాసప్రోక్త మహాభారతేతిహాసంగారా మీరు? అప్పుడే అనుకున్నాను ఆ ఠీవి, ఆ...?"

"అంత అనుకున్నదానివి...?"

"ఏదో సాటి రచనకదా అని, పక్కలో కూచోబోయానండీ. వాదంకోసం అడుగుతున్నాను. పోటీకి వచ్చాననుకోకండి. మీరు చేసిన దానిలో కొంతయినా నేను చేయకపోలేదు. పీడిత ప్రజావాణికి మైక్ అమర్చి అభవాగులకున్ వినిపింప జేశాను. మీరు ఒక రాజునాశంకోరి, ధర్మస్థాపనకు ప్రయత్నిస్తే, నేను బరాయెనాం నవాబయిన నిజామును కోటిన్నర నోటి వెంట పాటలుగా మాటలుగా దిగిపొమ్మని దిగిపొమ్మని పదేపదే అన్నాను. తరతరాల దరిద్రాల బరువుబతో పరువత్తే నిరుపేదలను హెచ్చరించారు. అనాదిగా సాగుతోంది అనంత సంగ్రామం అనాథులకూ అగర్భ శ్రీనాథులకు మధ్య - అని నిత్య సత్యాన్ని ఘంటాఘోషంగా పలికాను. మనం జనం జనం మనం, జనం లేంది మనం లేదు - అని మనం జనంల అన్యోన్యా

భావాన్ని నిర్వహించి, మానవుడు చిరంజీవి అన్నాను...కష్టజీవులకు..."

"అగ్నిశిఖా...కాదుకాదు అగ్నిధారా ఎవరో చూడు: పదండి ముందుకు అనుకుంటూ వస్తున్నారు. కష్టజీవులకు, కర్మవీరులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ, శరీర కష్టం స్ఫురింపజేసే గొడ్డలి, రంపం, కొడవలి నాగలి నావినివించే నవీన గీతికి నావిరచించే నవీనరీతికి భావం భాగ్యం ప్రాణం ప్రణవం - అంటూ వస్తున్నారు."

"ఎవరూ! ఓహో! మహాప్రస్థానంగారా? మహాప్రస్థానంగారండీ. ఆయన సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చారు లెండి."

"మహాప్రస్థాన మేమిటి? ఆహుతి ఏమిటి ధారా! అర్థంకావడంలేదే! నేనూ పాండవుల మహాప్రస్థానం చెప్పాను. అంతిమయాత్ర కదా అది?"

"కాలం మారిన కొద్దీ అర్థాలు మారుతాయండీ. మీ కాలంలో లాగే కదుడుగట్టుకొని కూచుంటాయా? మీరు వైదిక పదాలు లౌకికార్థంలో ఎన్ని వాడలేదు? కష్టజీవులు తెగించి కడపటియాత్రకు పూనుకుంటేగాని సుఖానికి అమరత్వం రాదని మహాప్రస్థానంగారు అంటారు."

"అదా! ఒక్క సమిధతో ఏమౌతుంది? అసంఖ్యాక సమిధలు కావాలి త్రేతాగ్ని వెలుగడానికి. నాది సవాలక్ష గ్రంథమా? ఎన్ని విషయాలు తెలిపాను. మరొక ప్రపంచమే సృష్టించానే. నా పాత్రలను ఒకమారు చూస్తే ఇక మరువరే. ఎంత వ్రాశాను! ఎంతవ్రాశాను!... ఏమిటి గుణమేకాని, గణమెందు కంటూ ఎవ రాయన 'గంగగోవుపాలు గంటెడైనను చాలు' అంటూ వస్తున్నాడు?"

"ఆయనా! వేమన్నండి. మానవమన స్తత్త్వాన్ని కాచి వడబోశాడండీ. ఈయనను అనుకరిస్తూ, అభినవ వేమన్నాయిలు, అభినవాభినవ వేమన్నాయిలు-బయలు దేరారండి."

"మానవ మన స్తత్త్వం తెలుపడానికి ఏదైనా ఇతిహాసం వ్రాశాడా?"

"లేదండి. కేవలం వైరాగి చిట్కాలు. ముక్తకాలు."

"ముక్తకాలనగానే అదేదో భాష-నేనెప్పుడూ విననిది అజ్జాంమోహాణసుహిఅం ముఏత్తి మోత్తూ పలా ఇఏ హలిఏ - అంటూ వస్తున్నదే; ఎవరమ్మా?"

"ఆమె గాథాసప్తశతి అండీ. ప్రాకృతభాష."

"ప్రాకృత మేమిటి? నేను ప్రాంతీయభాషలను ఎన్నిటినో విన్నాను; ద్రావిడ, ఆంధ్ర, చేర, చేది ఇత్యాదిగా. ప్రాకృత మేమిటి?"

"సంస్కృతం భ్రష్టమై ప్రాకృతమైం దంటారండి. ప్రాకృతమే సంస్కరించబడి సంస్కృత మైందంటారండి. రెండువాదాలూ వున్నాయి. మీకు తెలియకపోవడం ఆశ్చర్యమే."

"చాలబాగా అన్నావు. నాకు ఎలా తెలుస్తుంది? వైదికభాషా, ఉపనిషత్తులభాషా, నా కాలపుభాషా మారాయా? నాతర్వాత ఇంత అపభ్రష్టమైపోయాయా? వాటిలో కవిత్వమూనా?"

"కవిత్వం హృదయోద్గారం కదండీ. భాషతో పనేమిటి? ఏ భాషలోనన్నా కవితలు అల్లవచ్చు. పాశ్చాత్య పండితు లేమన్నారో తెలుసా? భావోత్కర్షతా ప్రకటనమే కవిత - అన్నాడు వర్డ్స్‌వర్త్. గానాన్వితమైన ఆలోచనే కవిత-అన్నాడు కార్లయిల్. కల్పనకు బాహ్యరూపమే కవిత - అన్నాడు షెల్లీ. ఉదాత్తభావావేశాలను ఉదాత్త కల్పనతో వ్యక్తం చేయడమే కవిత్వం - అన్నాడు రస్కిన్. లయాన్వితమైన రామణీయక సృష్టే కవిత్వం- అన్నాడు ఆలన్‌పో. తూగూ ఊగూ గల పదాలతో మానవుని మనస్సును కళాత్మకంగా చిత్రించడమే కవిత్వం - అన్నాడు వాట్స్‌డంటన్. మరి ఆదికవి హృదయవికారోద్గారమే మా నిషాద శ్లోకం కదండీ..."

"ఏమిటి? నేను మానిషాద అనేశ్లోకం వ్రాయలేదే?"

"మీది కాదండీ. ఆదికవిది అది."

"ఆదికవా? ఎవరమ్మా అంతవాడు?"

"వాల్మీకి మహర్షి కాదటండీ. రామాయణం పాడలా?"

"రామాయణమా? నేను అరణ్యపర్వంలో మొదట చెప్పాను రామకథ. అంతవరకు ఎవరికీ తెలిదే? తర్వాత వాల్మీకి అనే ఆయన గానంచేశారేమో?"

చేశారేమో ఏమిటి? రామాయణం ముందు,భారతం వెనకాలా - అంతేనా. రామాయణం వ్రాసినవారు ముందే వుండాలా? ఆయనే ఆదికవి."

"రామాయణ కథ భారతంకన్నా ముందు అన్నమాట నిజమే. రచనమాత్రం వాల్మీకి దేదీ నా కాలానికి లేదు. తర్వాతిదే నేమో."

"అలా కొందంటూ వస్తున్నదండీ కృష్ణ రామాయణం. అదుగో! అక్కడ తోసుకొని రామాయణ కల్పవృక్షం, దండక రామాయణం. ఇవన్నీ మీ సరసన చేరడానికేనండి. కృష్ణరామాయణం సోదరి కృష్ణ భారతం. మిమ్మల్ని తొలిసారిగా భాషాంతరీ కరణం చేసుకొనే భాగ్యం మా తెలుగువారికే దక్కింద నుకోండి. నెయ్యేళ్ళనుంచి మీ అనువాదాలు సాగుతున్నాయండి. కృష్ణభారతం మీరు అయుతం గజానాం — అంటే 'పదివేల హస్తులు పదివేల గుర్రాలు ఎవ్వాని వాకిట నెనయుచుండు' అనేలాగ అనువదించడమే కాక, మీకు కొన్ని చోట్ల మెరుగులూ దిద్దాన ంటున్నదండి. కనుక తనకు మీ సరసన మా అందరికన్నా మిన్నగా స్థానం కావాలటండి. మీరు అనుగ్రహించిన కథ కదా! పాత కథఅయితే, మీరు ఒక విధంగా చెప్పారు, మరొకరు మూలానుసారంగా మెరుగులు పెట్టారంటే నమ్మవచ్చు. ఆకరమే మీది...మరి..."

"నిజమే, నిజమే అగ్నిధారా! వా రెవరు, మా పాంచాలి పోలికలున్నాయి? తనే పాంచాలి అంటున్నది; అర్జునుడూ అదోరకం వేషం వేశాడు?"

"ఆవిడ మా తిక్కనగారి ద్రౌపది అండి. అసలు పాంచాలి ఆమే అంటారు ఇప్పటివారు కొందరు. మీరు చేసిన అనౌచిత్యాలను ఆయన తొలగించి ఈమెను తీర్చాడంటారు."

"బాగుంది, బాగుంది. గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించడం అంటే ఇదే కదూ?"

"అతను కన్నడ జైన అర్జునుడండీ. విక్రమార్జున విజయంలో వాడు. దానికి నాయకుడు. దీని అన్న గదాయుద్ధమండి. భీముడు దానిలో నాయకుడు. మీ నాయకుడు ధర్మరాజు కదండీ?"

"మరి! తోసేయ్ వారిని, ఇక్కడ వారికి స్థానం లేదు. నా కథను తారుమారు చేస్తే ఎలా?"

"భాసుడు చేయలేదటండీ?"

"ఎవరు అతడు?"

"మీ సంస్కృతంవాడే. మిమ్మల్ని విడగొట్టి నాటకాలుగా వ్రాసి, తనకు కావలసిన మార్పులు చేశాడు. మావాడు శృంగరనైషధమూ అదే చేశాడండి — కమలేందీవరషండమండిత లసత్కాసార తీరంబునన్ గమికర్మీకృత నైకనీవృతుడై గంటి న్విదర్భంబునన్ అంటూ."

"ఏమిటది? నా నలచరిత్రమా? చిన్న చిన్న — కథా విఘాతకంలేని — మార్పులు సరే. మూలచ్ఛేది పాండిత్యప్రకర్ష మైతే ఎలా?"

"మరి పురాణకథలను తీసుకొని మనుచరిత్ర, వసుచరిత్ర, నృసింహ పురాణం, హరివంశం—అన్నీ స్వతంత్రపు పోకడలుపోతూ అదిగో చూడండి వస్తున్నాయి; పోటాపోటీలతో పోరాడుతూ."

"మా వ్యాసులవారు చేసిన పురాణకథలే తారుమారయాయా?"

"తారుమారేమిటి? ఆమూలచూడం మార్చివేసిన కథలూ వున్నాయి. ఉపనిషద్భావాలకు అపార్థం కలిగించేవరకూ వాటి వాఖ్యలు వెళ్లాయండి. వినండి "ఆనందం బ్రహ్మేతి వ్యజానాత్" అనే మాటకు మనుచరిత్రలోని వరూధిని చెప్పిన భాష్యం.

ఎందే డెందము కందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికా
శ్రీ దోప నెందెందు బో
కొందే నింద్రియముల్ సుఖంబుగను నా
యింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ' మటన్న ప్రాజ్ఞుపు
లంతర్బుద్ధి నూహింపుమా.

ఓహో! ఆ ముక్తమాల్యదా, రావమ్మ తల్లీ, రా. నీవు ఒక్కతెవే మన ప్రాచీనసాహిత్యంలో విలక్షణవు సుమా. అచ్చతెలుగు పడుచువు. నీతండ్రి ఎంతటి అతిథిసత్కార నిరతుడమ్మా!

"ఆ నిష్ఠారతు గేహసీమ నడురే
యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్ర శయాన పుణ్యకథలున్
దివ్యప్రబంధానుసం
ధాన ధ్వానము నాస్తి శాకబహుతా
నాత్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవం చ కృపయా
భోక్తవ్య మన్మాటలున్.

ఎలాటి వర్ణనలు చేసిందనుకున్నారు మహాభారతం గారూ, ఆముక్తమాల్యద? వర్షర్తువులో నట:

పుట్టవెడలి నభోభిత్తి బట్టుశక్ర
కార్ముకపు బెద్ద పలువన్నెకట్లజెర్రి

దైన నడచెను కొళ్ళగుంపనగ గాలి
గార్కొని దిగంతముల వానకొళ్ళు నడచె.

ఎంత తెలుగు జిగి, తెలుగు ఊహండి."

"సరళంగా లేదమ్మా అగ్నిధారా, నారికేళ, పనసఫలపాకం."

"సంస్కృతంలో పురాణాలూ ఉప పురాణాలు లాగే వీరశైవుల పురాణాలు, తమిళంలో పెరియ పురాణమని, తెలుగులో బసవపురాణమని వున్నాయి. అవీ వస్తున్నాయి లెండి. చూడండి. అందరి మోక్ష ప్రాప్తికి తనే కంకణం కట్టుకున్నానంటుంది బసవ పురాణం."

"బసవ ఏమిటి?"

"వృషభ శబ్దాపభ్రంశ మండి. మహేశ్వరుని వృషభం బసవేశ్వరుడనే శివమతస్థాపకుడుగా అవతరించాడు. అతని చరిత్రండి. పెరియ పురాణమూ ఇలాటిదే శివభక్తుల కథా కదంబం. కాని బసవ పురాణం దీనికి కేవలం అనువాదం కాదు."

"సరే—సరే. ఇవి భగవద్భక్తి బోధకాలే; సన్మార్గ స్థాపకాలే. కాని, సమగ్రత ఏదీ? స్వతంత్రపు పోకడలు పోయాయన్నావే ఏవో, నా కథలు అందుకుని; ఆ రచనలు ఏమిటి చెబుతాయి? వాటి గమ్యం..."

"వాటిగమ్యం నైషయిత అని విమర్శకులు అంటున్నారండీ.

"నైషయికతకు మాత్రమే స్థానంలేదు. త్రివర్గం వుండాలి. చతుర్థపురుషార్థం దాని పూర్తి. విశ్వకల్యాణం దాని పరిమళం."

"విశ్వకల్యాణంకోసమే నా కవితాగానం. కావ్యం చతుర్వర్గ సాధనకు కాంతాసమ్మితమన్నారు పెద్దలు. ఇతిహాసంలాంటిది కాదు కావ్యం. ప్రతి మాటకు రంగు రుచి వాసనా వుంటాయి. అలాటి మాటల పేటే పరిమళమే కవిత. దీనితోనే విశ్వకల్యాణం సాధిస్తాము. నా నివాసమ్ము తొలుత గంధర్వలోక మధుర సుషమా సుధాగాన మంజువాటి. ఏనొక వియోగ గీతిక. ఈ ప్రవాసయాత్రా రతి నిటులె నేను కదలిపోవుదు నాశావకాశములను అంటూ—కృష్ణ పక్షం వస్తున్నదండీ మీతో సాటిగా కూర్చోవడానికి వ్యాసపీఠం మీద."

"కృష్ణపక్షమా ? అదేమిటి గ్రహజనితమా ?"

"కాదండీ. తెనుగు కవితలో కాల్పనిక సంప్రదాయానికి తెన్నులు తీర్చిన రచన.ఉండండి. ఉండండి. నవీన మార్గస్థాపనా చార్యత్వం నాది అంటూ రామాయణకల్పవృక్షం తన పరివారం వెంటరాగా దూకుడుగా వస్తున్నది...మీతో పోటీ పడదగిన రచనలు ఎన్నో ఉన్నాయటండి ఆ పరివారంలో; మీకు తెలియని కొత్త సాహిత్య ప్రక్రియలు నవలలు, కథలు, ఏకాంకికలు మొదలయినవి...నా రచనలంటే ఎందుకో చాలా మందికి గిట్టదు. ఏదో ఆక్షేపణ. ఏదో సణుగుడు. వేయి పడగలు నవలే కాదంటారు కొందరు. అసలు నవలంటే ఏమిటి? దీర్ఘ సమాసాలు – కొండవీటి చేంతాడువంటివి–వేస్తానని ఇంకో చెప్పడు. సమాసాలేమీ లేని శశిదూతం వ్రాశాను. ఎందరు చదివారు ? అచ్చం తెలుగు ఋతువులతో ఋతుసంహారం వ్రాశాను. నా రామాయణ కల్పవృక్షం వాల్మీకి రామాయణానికి భాష్యమే కాని, అనువాదం కాదు. రామాయణ కల్పవృక్షం లేకపోయినా సాహిత్యంలో నేను బదికేటంతటి రచనలున్నాయి. ఇంతకూ నేటి సారస్వత విమర్శలు పెత్రితలలు వేస్తున్నాయి. రేషనల్ క్రిటిసిజంకంటే, సైంటిఫిక్ క్రిటిసిజం హెచ్చయిపోయింది. జీవితం లోతులను తరచినవాడిని కనుకనే ఇలా ఇంతగా వ్రాయగలుగుతున్నాను. నాకు ఎవరూ ఏ యుగంలోనూ పోటీ లేరు–అనే మాటలూ వినిపిస్తున్నాయండీ ఈ పరివారం చాటునుండి..."

"అరెరె ! యెంకిపాటలండీ ! మనసారా మనవి చేస్తున్నాను. నాకు వద్దుకానీండి. ఆవిడను కొంత చోటుచేయండి. శృంగారం కేవలం కామక్రీడగాను, స్త్రీ వలువల అచ్చులోపోసిన కులుకుమిటారి బొమ్మగాను వున్న సాహిత్యంలోనుంచి స్త్రీని ఉదాత్త మహిళా మణిగాను, శృంగారాన్ని ఉదాత్త ప్రేమగాను అందించే సాహిత్యశాఖ తొలినవలలో ఒకటండీ యెంకిపాటలు."

"ఏమిటి నీవనేది ? స్త్రీని మేమెప్పుడూ ఆ విధంగా చూడలేదే ! తర్వాత తర్వాత స్వార్థపరులు అలా చూశారేమో !"

"తర్వాత తర్వాత మీ కాలపు వ్యవస్థ దిగజారిపోయింది లెండి. ఆ బాధలు మాకు తెలుసు."

"సరే ధారా, నీవు చెప్పడాన్ని బట్టిచూస్తే ఏదో పామరగేహి విషయంగా వుండే ఈ పాటలు–పై స్థాయి లేదే ?"

"ధర్మవ్యాధుని సమర్థించిన మీరు ఇలా అనడం ఏం న్యాయం? రావోయ్, రా, శిశువిహారం. నీ వొక్కడే కొరవ. ఏదీ ఆ తత్వం పాడు!

అనగా అనగా ఆంధ్రదేశమున
అధికారానికి వచ్చారయ్యా
అకస్మాత్తుగా ముగ్గురు రాజులు
ఒకరికి ఊరూ లేదు. రెండు పేరూ లేదు.
ఊరూ పేరూ లేని రాజులు
పట్టంకట్టే సంకల్పంతో
ఇట్టటు దిక్కులు పరకాయిస్తే
జాగా కానారాదు చెప్తే వినాలేదు.
కని విని ఎరుగని కందనవోలు
కొలువగట్టున డేరా వేసి
సాలు రాబడిని గుణించి చూస్తే
రాబడి సున్నకు సున్నా
పోబడి హళ్లికి హళ్లి.
హళ్లికి సున్నకు పెళ్ళిచేయ పం
దిళ్లు వేసి పెద్దలను పిలువగా
వచ్చిన మూడూ రూపాయల్లో
ఒక్కటి చెల్లా చెల్లదు
రెండూ ఒల్లాఒల్లవు!"

"ఏమిటమ్మా ఇదీ? ఏదో గూఢార్థంతో వున్నట్టుందే?"

"ఔనండీ ఆంధ్రరాష్ట్రం తాత్కాలిక రాజధాని నిర్ణయంపై మా దేశపు తత్త్వాల ధోరణిలో ఈ గేయం వుందండి. దీనికి మీ సరసన స్థానంకోసం పిలవ లేదు లెండి. మీరు తత్త్వ మహోదధి కదా?"

"ధారా! అదేదో విను. కుంభంలో పలికినట్టు లోగొంతుకతో వినబడుతున్నాయి మాటలు."

"ఓహో! అవా? నూతిలో గొంతుకలు లెండి."

"నూతిలో గొంతుకలా? నూతిలో బంతిపడితే ద్రోణాచార్యులు తీశారు బాణరజ్జువుతో. ఆయనను పిలవనా?"

"................."

"అగ్నిధారా, అవేమిటి విరాటరాజు కొలువుకు వెళ్ళిన పాండవుల వేషాలులా? ఆ గుంపేమిటో చెబుదూ. ఇన్ని రకాల పోటీలూ, పోరాటాలూ నా సాహిత్యంలో స్థాయికి; నా వ్యాసపీఠానికి; బరువు ఉండాలి గాని."

"అది మీ నలచరిత్రానికి రూపకీకరణ మండి. చిత్రనళీయ మంటారు. తను తెలుగులో మొదటి నాటకం కనుక మీ సరసన స్థానం కావాలంటుంది. అదో ఆ పైదిక్కు బుద్ధులగుంపు-కన్యాశుల్కం నాటకమండి. దానికి పట్టంకట్టే బలగం చాలా వుందండి. అబ్బ మీరూ వచ్చారూ! కావ్యాలతో పోటీకి, వచన రచనా మంజరులు? ఆ అదో అది వేమన..."

"వేమన ఇదివరకే వచ్చాడుగా."

"ఇది వేమనను గూర్చిన విమర్శగ్రంథ మండి. అది నాటకోపన్యాసాలు. ఇదిగో ఇదిగో తెలుగు మెరుగులు. అదిగో లోవెలుగులు. వీటి రమ్యశైలి పద్యానికి ఏమీ తీసిపోదండి."

"అగ్నిధారా నా వచనాలు ఎప్పైనా చదివావూ?"

"మీ వచనాలా? ఎందులో?"

"నాలోనే-భారతంలోనే. ఉదంకోపాఖ్యానం చదువు. తక్కినవి వద్దులే. నేను వచనానికికూడా నికష మని గ్రహిస్తావు."

"అరే. అణురహస్యాలు, భూస్వామ్య సంస్కరణలు, ప్రపంచ క్రీడా సంగ్రహచరిత్ర, నా మహారాష్ట్ర యాత్ర జేగంటలు...మీకేమి టిక్కడ పని?"

"అణు రహస్యాలా, ఏమిటివవి ధారా! పరమాణువు వేదంలోనే వుంది. నేనూ సృష్టివివరణలో తెలిపాను కొంత. అవి గ్రంథాలా?"

"అవునండి. మీ కాలపు అణువు ఇంకా అలాగే వుందనుకోవద్దు. దానిని ముక్కలు చేశారు నేటి శాస్త్రజ్ఞులు. దానితో మారణాయుధాలు సృష్టించారు. వాటిని గురించిన గ్రంథాలండి. వాటిదే పైచేయి కదండీ నేడు! కర్ర గలవానిదే బర్రె. ఆయుధాలు చేత వుంటే అవని అంతా చేతుల్లోనే."

"చాల పొరపాటు. కౌరవులకు అంగబలం, అస్త్రబలం లేకనా? ధర్మం లేదు. కనుకనే విరిగారు. అణువులు, మణువులు ఏమీ చేయలేవని చెప్పు. వాటికి వ్యాసపీఠం దరిదాపులనన్నా స్థానం లేదు; తాత్కాలిక ప్రయోజనం వుంటే వుండవచ్చు గాని."

"అదేమిటి ఆంధ్రభాషాభూషణం గారు ఇలాదయ చేశారే! మీరూ మాతో పోటీయా? మీరు కర్నాటక భాషాభూషణానికి ఛక్తు నకలు అని ఎవరో ఇటీవల వ్రాశారు నిజమేనా? ఆఁ! బాలవ్యాకరణంగారా ఏమిటి? ఏమి గ్రహచారమండీ మీది? పాణిని ఫక్కీలో మీలాగా తెలుగులోనే కాదు మరొక భాషలోనూ సూత్రాలు చెప్పిన వ్యాకరణం లేదు కదా.

వ్యావహారిక వాదంలో ఎన్ని తిట్లు తిన్నారండి మీరు? మీకు చలనం లేదులెండి...మీరు లేందే వాక్యరచనే సాగదుకదా?"

"ఏమిటది ధారా, వ్యాకరణం అన్నావు?"

"ఔనండి పాణిని సంస్కృతానికి..."

"వేదాంగమైన శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్తాలున్నాయి. పాణిని ఎవరు? లేరే నాకు తెలిసి."

"మీరు మొదటివారు. నేను ఇప్పటికి ఆఖరు దాన్ని. నాకు అంతా పూర్వులు. మీకు అంతా కొత్త. ఏమి చేయమంటారు?..."

"అయినా, వ్యాకరణాది లక్షణ గ్రంథాలు సాపేక్షాలు కనుక సమగ్రాలు కావు."

"శబ్దరత్నాకరంగారా! సూర్యారాయ నిఘంటువుగారూ వచ్చారే? వాచస్పత్యమూనా? వ్యాసపీఠం ఎక్కండి. నిండుగా వుంటుంది. ఏదో పదార్థాలు అందిస్తూ, మూలలో వుండక స్థానాలు, ఖానాలు మీకెందుకు?"

"వాళ్ళంతా ఎవరమ్మా! ఏవో బండరాళ్లూ, రేకులూ పుచ్చుకొని వస్తున్నారు; కొట్టడానికి కాదుగదా?"

"అబ్బే! ఏం భయపడకండి. మాది గాంధీ యుగం. గాంధారీసుత యుగం కాదు. వారంతా పరిశోధనలు."

"అంటే?"

"అంటే, ప్రస్తుతకాలంవారికి అర్థంకాని విషయాలను పరిశ్రమ చేసి అందిచ్చే ముఠా. మీ వ్యాసుల వారు చేయలేదూ వేదాల వింగడింపు? అలా."

"ఓహో!"

"పరిశోధకులకు ఏదైనా స్థానమిస్తారా? ప్రభుత్వమూ కొంతమందిని ఆదరిస్తున్నది."

"అది ఆదరిస్తున్నప్పుడు ఇక్కడ స్థానం ఎందుకూ?"

"మాది కథాయుగమండీ. కనుకే కథామంజరులు, కథా గుచ్ఛాలు, కదంబాలు అహమహమికతో వస్తున్నాయి. మొట్టమొదటికథ ఏదో తెలుసా? ఓ హెన్రీ.."

"మొదటికథ చెప్పింది వేదం. తర్వాత నేను."

"మీకథలు తంత్రంతో కాపీకొట్టి పంచతంత్రమనే పేరుతో విశ్వమంతా వ్యాపించినది - అదీ వస్తున్నది చూడండి మాతో పోటీపడడానికి."

"నాకథలను ఏమీ చేసింది?"

"వాటిని రాజనీతికి వినియోగించుకొందండీ."

"సరే. నేను చేసిందీ అందుకేగా."

"మీరు చేసింది రాజ్యతంత్రంకోసం కాదు. విశ్వకల్యాణంకోసం, ధర్మస్థాపనకోసం. అది సరే. మాలోనూ మంచి కథలున్నాయండి; ఓబయ్య, వర్షం, కీలెరిగిన వాత వంటివి. ఒక్కొకటే కావ్యంతో తులతూగగలదండి."

"పిచ్చిదానా! కథ జీవితంలోని ఒక ఘట్టంలోని లవలేశం తెలుపుతుంది. జీవితం సముద్రంవంటిది. ఎన్ని చేరాలి. అలాంటి దానికి, నావంటిదానికి, ప్రతిబింబమేదైనా వుందా?"

"ఉన్నాయండోయ్! శివభారతం, వీరభారతం, విజయనగర భారతం."

"ఏమిటి ఇవంతా! భారతానికీ శివునికీ సంబంధం ఏమిటి?"

"భారతం అంటే యుద్ధం ప్రధానంగాగల ఇతిహాసం కదండి. దానిని లాక్షణికంగా వీరకావ్యం అని గ్రహించి తమ నాయకుల చరిత్రకు అతికించారండీ."

"అతికితే అతుకులబొంత కాదుటమ్మా! నాలో యుద్ధం మాత్రమేనా వున్నది? నేనొక ప్రపంచం. ప్రాచీన, సమకాలిక విజ్ఞాన సర్వస్వం. ఎన్నెన్నో చెబితే నేగదా ఇతిహాస మౌతుంది?"

"నిజమే. ఆలోచించి చూస్తే, ఇప్పటిదేదీ మీ సరసను ఉండడానికి వీలులేదు. నాకూ బలగం చాలావుంది. కాని, ఏం లాభం? మీలాగ ప్రతిపాత్రను యుగయుగాలపాటు మరపురానట్టు తీర్చగలిగినప్పుడు, మాటలను కల్పాంతం వరకు వినబడేటట్టు పలక గలిగినప్పుడు, ఇతివృత్తాన్ని మేఘరథంలాగ నడుపగలిగినప్పుడు, సూక్తులు నిత్యసత్యాలుగ నిర్వచించగలిగినప్పుడు మీ సన్నిధికి వస్తాను. సెలవు."

"శివాస్తే పంథాన స్సంతు."

# కలగూరగంప

## అభాగ్యోపాఖ్యానము

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి

ఆంధ్రవాఙ్మయమున స్థూలముగ జెప్పవలయునన్న రెండేయుగములు: మొదటిది నన్నయ యుగము. రెండవది వీరేశలింగయుగము. నన్నయ గంటము పట్టి శ్రీకారముచుట్టిన వేళావిశేషమెట్టిదో గాని యభ్యుదయపరంపరాభివృద్ధిగా బదివందల వత్సరము లాంధ్రి యవిచ్ఛిన్నముగా నొకేనడక నడచినది. మహాకవులు వెలసిరి. మహాపండితులు విలసిల్లిరి. అందఱు నొకేపాట. మాటభేదమే కాని చేతయొకటే. ఒకరు పురాణము తెనిగించిన నొకరు కావ్యము ననువదించిరి. కర్మము చాలక క్రొత్తగా నొకరొక ప్రబంధము వ్రాసిన నదేమూసలో నెన్నో ప్రబంధములను బోతపోసిరి. ఒకరల్లన నేడ్చిన నింకొకరు బావురుమని యేడ్చిరి. కొంతదవ్వరుగునప్పటి కితివృత్తపు గొఱత యేర్పడినది. వ్రాసిన భారతమే తిరిగి యింకొక ఛందస్సులో, ద్విపదలో వ్రాయబడినది. వ్రాసిన రామాయణము నే తలొక పేరుతో వ్రాసినారు. అట్లయినను వక్తృభేదమును బట్టి రసవంతములయినవి యొకటి రెండు లేకపోలేదు. అట్లని గతానుగతికముగా నేర్పడినవన్నియు మనస్సున కాహ్లాదకరములుగా నున్నవని చెప్పలేము. ముఖ్యముగా ప్రబంధము లీ దోషమునకు బాల్పడినవి. ఎంత మంచిపద్ధతియయినను క్రొత్తదనము లేకపోయినచో బోయినకొలది యది నియమబద్ధమై శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయే ప్రధానముగా గలదయి యచ్చులో బంధింపబడిన కళేబరమువలె రోత కలిగించును. 'Old order changeth yielding place to new...lest one good custom should corrupt the world' అను షేక్స్పియర్ మహాకవి సూక్తి యథార్థమనవచ్చును. గతానుగతికములుగా నాంధ్రసారస్వతమున బుట్టగొడుగులవలె వెలసిన ప్రబంధములను హేళన మొనర్చుటగా శ్రీ వీరేశలింగము పంతులుగారిచే రచింపబడిన వికటకావ్యమే 'అభాగ్యోపాఖ్యానము.'

నన్నయభట్టారకుని బ్రసవించిన రాజమహేంద్రవరపురలక్ష్మియే వీరేశలింగమును గని యాంధ్రసారస్వతమున కర్పించినది. నన్నయ నుత్తేజితుజేసిన గోదావరీమాతయే వీరేశలింగము నుత్తేజితు నొనర్చినది. నన్నయ యాంధ్రగీర్వాణసాహితీస్రవంతులకు వారధికట్టిన నితడాంగ్లాంధ్రసారస్వత తరంగిణులకు నందమైన వంతెన నిర్మించినాడు. సంధికాలమున నుద్భవించిన యితడు పరిస్థితులను జక్కగా సమన్వయపఱచికొని, యాంగ్లసారస్వతమునను్న ప్రక్రియావైవిధ్యము నంతటిని దెలుగున బ్రవేశపెట్టినాడు. నవలలు, నాటకములు, ప్రహసనములు, కథానికలు, వ్యాసములు, విమర్శనములు, ఆత్మచరిత్రలు, వికట (హేళన) కావ్యములు మొదలుగా నన్నిటికి నితడు మూలపురుషుడయినాడు. శతాధిక గ్రంథములను రచించి సారస్వతసేవ గావించినాడు. సంఘసంస్కరణోద్యమము నెక్కువ పట్టించుకొనకున్న నిక్కముగా నింతకంటె నెక్కువ సారస్వతసేవ వీరివలన జరిగియుండెడిది. పూర్వమహాకవులు సంస్కృతమునందలి తీరుతెన్నుల నాకళించుకొనినట్లే యితడాంగ్లసారస్వతమునందలి సొబగుమేలిముల నవగతము చేసికొని, తద్విశిష్టతాలతలను దెనుగుమాగాణమున నాటినాడు. సంస్కృతోద్యానమునుండి తెచ్చిపెట్టిన యమరతరువులకీ కల్పలతికలల్లుకొని సరసుల కానందసంధాయకములైనవి.

ఆంగ్లమునందలి సారస్వత ప్రక్రియావిశేషములలో 'వికటకావ్య' మొకటి. దీనినందు 'పారడీ' (Parody) అందురు. "Parody is a literary composition in which the style, form or expression of dignified writings are closely imitated, usually in a humorous or satrical manner" అని దీని నిర్వచనము. బుద్ధిపూర్వకముగా నొక మహాకావ్యమును హేళనదృష్టితో ననుకరించి కొంచెపఱచుట దీని లక్షణము. తెలుగు వికట

కావ్యములలో నభాగ్యోపాఖ్యానమే మొదటి దన వచ్చును. కూచిమంచి జగ్గకవి రచించిన 'చంద్రికా విలాపము' కూడ వికటకావ్య మనదగియున్నది. ఆంగ్లమున 'పోపు' రచించిన 'రేప్ ఆఫ్ ది లాక్' వంటివి సుప్రసిద్ధములు.

'అభాగ్యోపాఖ్యానము' ప్రాచీనాంధ్ర ప్రబంధముల నెత్తిపొడుచుటకయి వ్రాయబడిన వికట కావ్యము. పరిహాసకు డొకడు వనవాసము చేయుచున్న ధర్మాత్మజుని కష్ట కరుడించి కాలక్షేపార్థ మీ కథ చెప్పినట్లు కల్పింపబడినది. వ్యాఘ్రాఖ్య పట్టణమున కేకిమీడగు నభాగ్యుడను దానవుడు వేటకయి పోయి యొకపాడుపడిన దేవళముపొంత నొక కులటను వికృతాకారను జూచి మదనపరవశుడయి యెట్లో కూడియుండ, దాని భర్తయు బంధువులును వచ్చి యభాగ్యుని దేహశుద్ధిచేసిపంప వాడెట్టకేల కిల్లుసేరి యొడలు వాచి నీరగ్రమ్మి మరుని దశమావస్థను బొందెననునది సంగ్రహముగా నిందలి కథ.

ప్రబంధములం దే యే వర్ణనము లే తూకమున నున్నవో యిందు నంతే తూకమున నున్నవి. కాని యీ పురము లచ్చియప్పకు గాపురము. విలువసారాయి సీసాలకొలది ద్రావి యొడలు దెలియక వీథులబడి మర్యాదలగాంచు బ్రాహ్మణోత్తములు; ఉత్తగుని బురుడించు రాజకుమారులు, పగఱకు బోమ్మజూపని వీరభటులు, వికారము రూపెత్తిన పుష్పలావికలు నా పురికి బెట్టని యాభరణములు. వేయునేల! పురిని బుట్టిన నుక్కైన భుచ్చిపోవునట.

ఇక గథానాయకు డభాగ్యుడా పురి బాయకుండును. అతనికి బొట్టకోసిన నక్షరములేదు. వాత పెట్టినను వాని జిహ్వకు సత్యము రాదు. వాడు వేటకు వెడలుట చూడ ముచ్చటయినది. ఎండిన మొండిగోడల మీద, బాడిదచెట్లమీద నెక్కి దారుణనేత్రలు వానిని దిలకించిరి. పిమ్మట వాడు కుక్కుట మర్కట మార్జాల శశకాద్యనేక మృగములను వేటాడి సేద దీర్చుకొనుచుండ నొక ఘననినాదంబు దిక్కుల మాఱుమ్రోగుచు వినిపించును. ఒక దూతను బంప నతడు పోయివచ్చి సమీపమున నొకపాడుగుడిపొంత నొక విలసత్కాంతా కదంబాధము కలదని వర్ణించి చెప్పును. అభాగ్యుడు పోయి దానిని జూచి విరాళింగొని దానిపైబడగా నది పండ్లు రాలదన్నును. ఇక విరహవర్ణనము. 'మధ్య' దూతీ ప్రవేశము - సమాగమము - అంతలోనే పాదుకా పట్టాభిషేకము. తన్మూలమున నభాగ్యుని కనాయాసముగ బరమపదప్రాప్తి. ఇది యిందలి కథాసంవిధానము.

అభాగ్యోపాఖ్యానమున జాతీయములు విరివిగా వాడబడినవి. "పొరుగింటి పుల్లనగు కూరయు దా రుచిగాదె యేరికిన్" 'కాగడన్ వెదకిన' 'చచ్చి చెడి' 'తడిసిన నుల్కకుక్కగతి' 'పీసె గుద్దులు' వంటివి కృతికి వన్నె దెచ్చినవి. "ఒక దిక్కునను గుక్కలొక గ్రుక్కగా గూయ" మొదలైన పద్యములు వసుచరిత్రమును, "ఆ పుర మేలు రాక్షసమహోకులవారిధి బాడబుండు" వంటి పద్యములు మనుచరిత్రమును దలపించుచున్నవి. ప్రబంధాకాశమున మనువసుచరిత్రములు సూర్యచంద్రుల వంటివి. వాని నొరవడి పెట్టుకొని యాంధ్రసారస్వతమున నెన్నో పిల్లమనుచరిత్రములు, పిల్లవసుచరిత్రములు వెలసినవి. అన్నిట నొకే యెత్తుగడ, యొకే తూకము, నొకే 'పథకము'-నవే సన్నివేశములును. వానిని హేళన చేయుటకయి యిది రచింపబడుటచే నిందంతయు విడ్డూరముగ నుండును. పురవర్ణనము, రాజవర్ణనము, మృగయా వర్ణనము, నాయికా వర్ణనము, విరహవర్ణనము, శృంగార రసాభాసవర్ణనము నన్నియును బ్రత్యేకత గలిగియే యుండును. ప్రతిసన్నివేశమును ప్రతివర్ణనయు బూర్వప్రబంధములకు 'బ్రతిగ' నుద్దేశింపబడినవియే. ప్రతిపద్యమునందును బూర్వప్రబంధముల ఛాయలు గోచరించుచుండును. ప్రబంధకవు లుదాత్తముగా నాయా వానిని గావింప నిం దందులకు వ్యతిరేకముగా జిత్రింపబడియున్నది. కాని శయ్య, రీతి, శైలియు నవియే, వికటకావ్యముగా నభాగ్యోపాఖ్యానము పుట్టుక సార్థకమయినది.

# సీతాదేవి : రామాయణము

## శ్రీ కొత్త భావయ్య చౌదరి

ప్రథమంగా సీతాశబ్దము ఋగ్వేదములో నాగటిచాలను అర్థమున వాడబడినట్లు కనబడుచున్నది. బ్రాహ్మణముల కాలమునాటి కిది ప్రజాపతి, సావిత్రుల కుమార్తెగా చెప్పబడినది. తైత్తిరీయ బ్రాహ్మణము 2-3-10లో నట్లున్నది. ఈ సీత చంద్రుని భార్యలలో నొకటియయ్యెను. చంద్రునకు శ్రద్ధ, సూర్య యను భార్యలుగూడ నుండిరి. సూత్ర నిర్మాణము నాటి కొక సీత ఇంద్రుని భార్య యయ్యెను. ఇది పారాశర

గృహ్యసూత్రము 2-17-9 లో చెప్పబడినది. కొన్ని గృహ్యసూత్రములలో సీత భూదేవత యనియు, సౌందర్యరాశి యనియు, ఇంద్రుని లేక పర్జన్యుని భార్య యనియు వర్ణింపబడినది.

ఋగ్వేదములోని మంత్రములో "సీతా! (నాగేటి చాలా!) ముందుకు నడువుము. మేము నీకు వందనముచేయుదుము. నీవు మాకు ఎక్కువగా పంటయు, ధనము నొసంగుము. ఇంద్రుడు సీతను గ్రహించుగాక" యనియున్నది (ఋ. 1-17-21).

పై సీతా కథలనుబట్టి, వాల్మీకి రామాయణము కల్పించి వ్రాసెననియు, నింద్ర వృత్రాసురుల యుద్ధములే రామరావణ యుద్ధములనియు, రాముడే యింద్రు డనియు గొందరు పండితు లూహించి, యయోధ్యా రామునికథ జరిగినది కాదని వ్రాయ సాహసించిరి.

ఇట్లుండ వాల్మీకిరామాయణములో ననేకమగు మార్పులు, చేర్పులు జరగినట్లును, అవి రెండవ శతాబ్దికే జరగి, తర్వాతనే నానాదేశములకు వ్యాపించినట్లు పరిశోధకు లభిప్రాయపడిరి. సీరధ్వజునికి నాగలి దున్నుచుండగా దొరకిన సీతాదేవి శ్రీరాముని భార్యయై, చివరకు భూమిలో నదృశ్య యైనట్లున్న రామాయణ గాధనుజూచి, దానికిని ఋగ్వేద ఋక్కులకు పోలిక లుండుటవల్ల, రామాయణము కల్పితమని కొందరు పండితులు అభిప్రాయపడినను, దేశములోగల పెక్కు గుర్తులవల్ల ,రామకథ జరగినదే జెప్పవచ్చును. వాలివధ, సుగ్రీవసఖ్యము, చిత్రకూటవాసము, కబంధ, ఖర, దూషణ, మారీచ, సుబాహు, తాటకి, రావణ, కుంభకర్ణ, ఇంద్రజిదాదులవధ మొదలైనవి శ్రీరాముని యవతారనిరూపణము జేయుచు, నింద్రకథకు నీయన కథకు సంబంధము లేదని తెలుపును. ఇంద్రుడు వైజయంతీ ప్రాంతీయుడగు శంబరాసురుని 99 గ్రామములను జయించి తీసుకొనినట్లు ఋగ్వేదమునందున్నది. ఇది శ్రీరాముని తండ్రియగు దశరథుని కాలములో జరిగినట్లు రామాయణమున నున్నది. ఆర్యులలోని ఇంద్రుడు క్రమముగా దక్షిణదేశమును జయించు కాలములోనే శ్రీరాముడు రావణుడు మున్నగువారిని సంహరించి, విభీషణునికి రాజ్యమిచ్చి, తనకు సామంతుని జేసు కొన్నట్లు కనబడుచున్నది. రావణయుద్ధకాలమున ఇంద్రుడు, రథాదులనుబంపి శ్రీరామునికి సాయమిచ్చెనని రామాయణమున నున్నది. అందుచే వారిర్వురు వేరు పురుషులేగాని ఒక్కరేకాదు—

ఇంద్రపదవిలో ఇంద్రు లనేకు లున్నట్లే, ఇంద్ర శబ్దము ఖగోళ నక్షత్రాదులకు, దేవతలకు, మానవుల కున్నట్లే, సీతా శబ్దము గూడ చేతనాచేతనములకు, స్త్రీలకు వాడుకొనుచుండినట్లు పై నిదర్శనములు తెలుపుచున్నవి. హరువిల్లు పణముగా నుంచబడగా, దానిని విరచి సీతాదేవినిగైకొన్న శ్రీరామునికథ కల్పితమనరాదు. కుశ, లవులకు తల్లియైన సీతాదేవి కల్పితస్త్రీ యెట్లగును? బౌద్ధ గ్రంథములలోని దశరథ జాతకకథలో రాముని సోదరిగా వర్ణింపబడిన సీత మరియొకరో లేక కథా భేదమో తెలియుటలేదు. కాని జైన రామాయణములో మాత్రము సీత రాముని భార్యగానే వ్రాయబడినది. రామాయణము కల్పితగ్రంథమనువారిలో విదేశ పండితులగు జాకోబి, స్మిత్తు లేక స్మిట్టు, లీబరు, లాసేను, టాల్బాయిస్ హీలరు...మున్నగువారే గాక మన దేశములోని సుప్రసిద్ధ పండితులగు లోకమాన్య తిలకు మహాశయుడు, రమేశచంద్రదత్తు, సి. యస్. శ్రీనివాసాచారి, యం. యన్. రామస్వామి, సి. వి. వైద్యా మొదలగువారున్నారు. అట్టివారు చారిత్రక ప్రదేశములను, చారిత్రక పురుషులను గుర్తించక, కేవల సీతా మున్నగు శబ్దములు, వేదాదుల పోలికలనుబట్టి యీ నిర్ణయము గావించుటవల్ల సత్యమునకు చాలా దూరమైనారనవలసి వచ్చుచున్నది.

సీత కథాకల్పితస్త్రీయైనచో జనకుని చేత "ఇయం సీతా మమసుతా" యని వాల్మీకి పలికించునా యని ఆలోచించవలెను. సీతాకళ్యాణము రామాయణములో నొక ముఖ్యఘట్టము. అట్టిదానికి కల్పన మంటగట్టుటకన్న సహజముగా జరగెననుటే యొప్పిదముగా నున్నది. రామునితో వనవాస మొనర్చిన సీతనుబట్టి రాము డరణ్యములలో భూమి దున్ని జీవించె ననవలసినచో, నది యసంభవమే యగును. ఆ కాలములో కృషికిగల ప్రాముఖ్యమునుబట్టి సీతా శబ్దము హెచ్చుగా వాడుకొనియుందురు. జనకు డందుచేతనే దున్నుచున్న భూమిలో కనుగొనబడిన సీతాకన్యకా పేరిడి ముద్దు మొందెను. ఆమెను వృద్ధికి దెచ్చెను. అందుచే నీ సీతాదేవికి, ఋగ్వేదాదులలోనున్న సీతకు సంబంధము లేదనవచ్చును. నామ సామ్యముచే, వస్తుభేదము గుర్తింపకపోయినచో నిట్టి పొరబాటులే కలుగుచుండును. ఖగోళ, భూలోక విషయ పరిశీలనలోగూడ నిట్టి భేదములు గలుగగలవు.

మహావిభాష అను గ్రంథములో రామాయణము 12 వేల శ్లోకములు గలదని చెప్పబడెగా, నది యిప్పుడు 25 వేలు గలదిగనున్నది. ఉత్తరకాండ తర్వాత వ్రాయబడుటేగాక, మొదటి ఆరు కాండలుగూడ చాల విస్తరింపబడినవి. శక యవనాదులు, బుద్ధుడు మొదలగు వారిని గురించిన భాగములు నూతనములు. ఇట్టి ప్రక్షిప్తములు వదలి చూచినగాని సీతారామ కథ నిజతత్వము గోచరించదు.

# గ్రంథ విమర్శనము

## ఖండఖాద్య సహస్రికా

(భగవద్విభూతి పాదః) కర్త: శ్రీ దూళిపాళ - అర్క సోమయాజి (ఎం. ఏ.), గణితశాస్త్రాచార్యుడు, భీమవరం కళాశాల, భీమవరం. డెమ్మీ 173 + 26 పుటలు. వెల మూడు రూపాయలు. ప్రతులు గ్రంథకర్తవద్ద దొరకును.

సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రజ్ఞుడు బ్రహ్మగుప్తుడు ఆ శాస్త్రంలో 'ఖండఖాద్యకం' అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలో ఆ శాస్త్రాన్ని గురించి లేదు; కాని పేరు బాగుగా ఉన్నందున సోమయాజిగారు తమ గ్రంథానికి ఆ పేరే స్వీకరించారు. ఖండశః ఖాద్యతే ఇతి ఖండఖాద్యం అనే వ్యుత్పత్తినిబట్టి దీన్ని ఖండశః చదివి అవగాహన చేసుకుని ఆనందించవలసిందే అని రచయిత అభిప్రాయం!

పేరునుబట్టే యిందులో వెయ్యి పద్యాలుండేటట్లు తెలుస్తున్నది. అవి నాలుగు పాదాలుగా విభజించబడి, అందులో ప్రథమపాదం రెండువందల ఎనభై నాలుగు శ్లోకాలూ 'భగవద్విభూతిపాద' నామంతో ఈ గ్రంథరూపంగా వెలువడినవి. ఇందులో భగవంతుని యొక్కయూ, అతని సృష్టిసంపదను గూర్చియూ వర్ణనలు ముక్తకరూపంలో రచించబడ్డాయి. ఇందలి 40 శీర్షికలలోనూ వివిధ విషయాలను గురించిన చక్కని వర్ణనలు సులభశైలిలో సర్వజన గ్రాహ్యంగా ఉన్నవి. గ్రంథం చివర ఉపనిషదర్థాన్ని గురించీ, విశ్వమతాన్ని గురించీ ఆంగ్లంలో సంగ్రహంగా రెండు వ్యాసాలు అనుబంధంగా చేర్చబడివున్నవి. సంస్కృతభాష బాగా అర్థంచేసుకోలేనివారి ఉపయోగార్థం ప్రతి శ్లోకానికీ ఎదురుగా ప్రక్కపుటలో - ఆ శ్లోక సారం ఆంగ్లంలో వివరించబడినది. ఈ పద్ధతి భాషాజిజ్ఞాసువులకు ఎంతో ఉపయోగకరం!

శ్రీ అర్క సోమయాజిగారు గణితశాస్త్రం ప్రధానంగా మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆచార్య (ఎం. ఏ) పట్టాన్ని పొంది, అక్కడే కొంతకాలం గణితశాస్త్రంలోనే పరిశోధకులుగా పనిచేశారు. ఆంగ్ల భాషాభ్యాసానికి పూర్వమే సాంగంగా యజుర్వేదాన్ని అధ్యయనంచేసి, సంస్కృతంలో చక్కని పాండిత్యాన్ని, రచనాపాటవాన్ని సంపాదించారు. ఈ విధంగా బహుముఖంగా పాండిత్యాన్నీ, రచనాశక్తినీ సంపాదించినవారు చాలా అరుదు. అట్టి సోమయాజిగారి యీ రచన అత్యుత్తమంగా తయారుకావడంలో ఆశ్చర్యంలేదు.

ఈ కావ్యంలోని శ్లోకాలన్నీ రసవంతంగా ఉండి, సంస్కృతంతో కొంచెం పరిచయం వున్నవారికైనా సులభంగా అర్థమవుతూ ఉంటవి. మచ్చునకొకటి—

"అన్నం యః పురతః ససర్జ భగవాన్
సర్వౌషధం మే క్షుధః
పానీయం మధు జీవనం సుఖకరం
యోఽధాత్ పిపాసాగ్రతః,
చక్షుః శ్రోత్రముఖాని చాసృజ దధో
రూపాది సృష్టేః పురః
తం వన్దే కరుణామ్బుధిం త్రిజగతీ
భర్తార మీశం ప్రభుమ్."

[భగవత్ సృష్టిః, పుట 16]

సంస్కృత భాషాభిమాను లందరూ ఈ గ్రంథాన్ని ఆదరించడం ధర్మం! శ్రీ సోమయాజిగారి రచనవలెనే గ్రంథముద్రణ కూడా ఎంతో ముచ్చటగా ఉన్నది. మిగిలిన భాగాలు కూడా త్వరలో వెలువడగలవని ఆశిస్తున్నాను.

## పూర్ణపాత్రమ్

రచయిత: శ్రీ సన్నిధానం - సూర్యనారాయణ శాస్త్రిగారు, క్రౌను 59 పుటలు. వెల రూపాయి.

ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు ఇదివరలోనే పెక్కు గ్రంథాలను

# గ్రంథ విమర్శనము

సంస్కృతాంధ్రాల్లో రచించి అగ్రశ్రేణికి చెందిన విద్వత్కవు లనే కీర్తిని గడించారు. ఈ గ్రంథం శ్రీ శాస్త్రిగారి ఆంధ్రగ్రంథానికి సంస్కృతానువాదం! మూలానువాదాలు ఒకే చేతిమీద సాగుట వల్ల అభిప్రాయాల పొందిక చక్కగా కుదరడం సహజమే! ఇందులో శ్రీరామకృష్ణ పరమహంస సందర్భోచితంగా చెప్పిన కథలూ, ఏకలవ్యుని కథ, ప్రమద్వర కథ మొదలైన విషయాలూ సులభశైలిలో ఇవ్వబడినవి. ఉదాహరణంగా—

"భోభో యూయం హరయో
వృక్షా హరయో విహంగమా హరయః,
హరయః పశవశ్చ వినా
హరిం నకించి దపి దృశ్యతే లోకే."

[పుట 21]

ఈ గ్రంథం పద్మభూషణ, ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి కృతి యివ్వబడినది. శ్రీ బూర్గుల - రామకృష్ణరావుగారి మున్నుడీ, శ్రీ బి. ఆర్. శాస్త్రిగారు (సంస్కృతాచార్యులు, ఉస్మానియా యూనివర్సిటీ) వ్రాసిన ప్రస్తావనా దీనికి వన్నె పెడుతూ వున్నవి.

## త్రికమ్

కర్త: శ్రీ సన్నిధానం - సూర్యనారాయణశాస్త్రిగారు, శిరోమణి, పి. ఓ. ఎల్. క్రౌను 76 పుటలు. వెల రు 1-50.

శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు తాము రచించిన కీరసందేశము, విప్రవీరము, మధుకోశము అనే ఆంధ్ర పద్యకృతులకే సంస్కృతానువాదాలను రచించి, ఆ మూడింటినీ 'త్రికం' అనే పేరుతో ఈ గ్రంథరూపంగా ప్రకటించారు.

కీరసందేశంలో రుక్మిణీదేవి శ్రీకృష్ణునివద్దకు - అగ్నిద్యోతనునికి బదులుగా - చిత్రవర్ణమైన కీరాన్ని రాయబారిగా పంపినట్లు రసవంతంగా కల్పించబడినది. 'విప్రవీరం' అనే రచనలో ఖడ్గతిక్కన కథ కూర్చబడినది. అందులో తిక్కనకు అపకీర్తిని కల్గించే ఘట్టం మార్చబడినది. తిక్కనపాత్ర చక్కగా పోషించబడింది. 'మధుకోశం'లో అనేక శృంగారచాటువులు కూర్చబడ్డాయి. అన్నీ మధురములే!. ఒక శ్లోకరత్నాన్ని గమనించండి—

"అలకా స్తవ హరినీలా
అధరం తే రమణి! శోణమణిః,
కనకగిరీ వక్షోజౌ
క్రీణాతి త్వాం రసికరాట్ కః?

[మధుకోశః ప. 6]

ఈ రచన శ్రీ బూర్గుల - రామకృష్ణరావుగారికి వారి షష్టిపూర్తి సందర్భంగా అంకిత మియ్యబడినది. మొదటి రెండింటికీ వరుసగా శ్రీ గుండేరావు హరకారే, శ్రీ వేదాల - తిరువెంగళాచార్యులుగారూ ఉపోద్ఘాతాలు వ్రాశారు. పూర్ణపాత్రం, త్రికమ్ - ఈ రెండూ గ్రంథకర్తపేర 44 జీరా, సికింద్రాబాద్, అని వ్రాసి తెప్పించుకోవచ్చు.

బు. వేం. ర.

## శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము

[ప్రథమఖండము. కర్త ప్రాణాచార్య, శతావధాని దివి రంగాచార్యులు. ప్రతులకు గ్రంథకర్తపేర, శ్రీరామమోహనాయుర్వేదకళాశాల, గుంటూరు. 34+188 పుటలు. వెల రు. 5.]

'శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము'ను గ్రంథనామమే ఈ కావ్యధోరణిని స్పష్టముగా చెప్పుచున్నది. భాగవతాదులందువలెగాక ధేనుకాసురుని, చివరకు కాళీయునిగూడ కంసుడే పంపినట్లు కథలు మార్చబడినవి. శ్రీకృష్ణచారిత్రమును తీర్చుటలో కొన్ని ఈనాటి భావములు వచ్చి చేరినవి. బృందలో బలరామకృష్ణులు రోగులను బలుకరించి వత్తురు; శక్తిహీనులకు సాయపడుదురు. (45 పు.) ధేనుకాసురుడు ఖరరూపమున వచ్చియుండగా 'ఈ వృత్తాంతంబెల్ల మున్నయెఱింగియు సురాపానమత్తచిత్తులను క్రోత్తపరివృత్తి హత్తింప నత్తామరసాక్షుం డుపేక్షించి' యుండెను. (82 పు.) రక్కసులు బృందాటవి గాల్పగా కృష్ణుడు దానినార్పెను. చిత్రముగా నా రక్కసులు వచ్చి ప్రోవుమని వేడిరి. కృష్ణుడు వారితో మీకు మనఃపరివర్తనమైనది. అందుచే మీ తామసము తీరినది. నన్ను మది గోరినచో జనసేవ, స్వదేశరతితో చేరవచ్చునని ఉపదేశించెను. (96 పు.) ఇంద్రయాగ సమయమున కృష్ణుడు గొల్లలచే చెట్లు మొక్కలు తెప్పించి గోవర్ధన గిరిపై నాటించి 'వనమహోత్సవము' చేయించును. (152 పు.) ఇట్టి తీర్పునకు వైయక్తికమైన దృష్టిభేదము, రుచిభేదము కారణము కావచ్చును. కాని

ప్రాతకథలో నంత పట్టియిచ్చునట్లుగా నాధునిక భావముల పొదుగుట అందఱకు గుచింపకపోవచ్చును. మఱి, కథాంతముల నుపన్యాసములకు పూనుట పురాణపథమే గాని కావ్యమార్గము కాదు గదా.

ఆచార్యుల వారిది ధారాళమైన కవిత. తెలుగు సంస్కృతములలో దిట్టమైన చేయి. గోపికాగీతలలో గోపికలు శ్రీకృష్ణుని వెదకుచు పోయి ధృతిఁదీలి మూర్ఛిల్లిన చోటును వర్ణించెడి ఈ పద్య మాచార్యులవారి సరసకవిత్వమునకు చక్కని ఉదాహరణ.

'ఒక పెన్గొండల లోయలో సరసహా
తోద్యాన మధ్యంబులో
వికచోత్ఫుల్ల మృదూత్పలాంబుజ సరో
వేలాసమీపస్థ కో
రక సంయుక్త నికుంజ పుంజ నవ సూ
ర్యాంశుచ్ఛటాద్రావితో
దక సందోహ మరందసిక్త తృణని
స్తంద్ర ప్రదేశంబునన్'

## విద్యాధరి

[శివసాహస్రి. కర్త. విద్యాదేవకులపతి పి. వి. యల్. వి. ప్రసాదరావు. ప్రతులకు గ్రంథకర్త పేర ఆంధ్రశాఖ, హిందూకళాశాల, గుంటూరు. 212 పుటలు. వెల రు. 3.

ఉపాసన లేక కవిత కూర్జితశక్తి రాదు. మహాకవులనిపించుకొన్నవారిలో ప్రాచీనులే కాదు నవీనులు కూడ అనేకు లిట్టి 'విశ్వాసము కలవారే. మహాకవిత్వదీక్షా విధికి సామాన్యముగు మనుష్యప్రతిభ చాలదు. ఉపాసకులు కాని కవు లెంత ప్రతిభావంతులైనను తుణ ప్రభలవంటివారు.

విద్యాదేవకులపతి బిరుదాంకితులైన ప్రసాదరావుగా రుపాసకులు. కొలము వీరి సాధనమార్గముగా తోచుచున్నది. 'విద్యాధరి' అచ్చముగా ఉపాసనా కవిత. శివస్తోత్ర సహస్రము. ఇందలి 'అమరీత్రిశతి' సంస్కృత రచన. ఆంధ్రీసప్తశతి, సరి, తెనుగు - మొత్తముమీద ఈ కావ్యమొక 'వీరలాసిక'. అవశమైన భక్తిరాగమున కిందలి వివిధచ్ఛందములు తానము పాడినవి. శతికకవుల ఆవేశము, భక్తి, లోకవృత్తపరామర్శ పుంజుకొన్న చక్కని రచన ఇది. తెలుగులు వ్రాసినచోట దిరిసెనపూలు రాలును; సంస్కృతములు వచ్చినచోట శిలీముఖభ్రమణఘోష ముప్పతిల్లును; చటులమైన ఊహవెనుక స్ఫటికమువంటి హృదయమున్నది. వేదములలోని ఇంద్రుడు, శివుడు ఒక్కరే యను నమ్మిక కులాచారమార్గము ఈ రచనయందు గమనింపదగిన అంశము. ఇందలి సంస్కృత రచనకీ క్రింది శ్లోకము ఉదాహరణ :

'సరోజ దృక్ పితామహ స్ఫురద్రణో మహోదయం
జనావళీ మనోగుహా తపస్వినీ తమశ్ఛిదం,
త మద్భుతం త మున్నతం తటిత్ప్రభా తరంగితం
భజామి తం పరంతపం పరాత్పరం మహేశ్వరమ్.'

తిరిగి చూడని సమాసఘటనగల ఈ తెలుగు పద్యము చిత్తగింపుడు :

'కులకుంభ జ్వలితాగ్నిమండల
నటత్పూర్కృ ధ్వనిక్షిప్తకుం
డలినీ ఖేలన చాలనోన్నమ దఖండ
బ్రాహ్మ సంకల్ప సం
చలితాజాండ కరండ ఘట్టన
మహాశ్చ్యుతామృత విద్యుద్ద్రవపుః
పులకాంకూరము లుద్గమింపగ
నినున్ బూజింతు విశ్వేశ్వరా!'

సామాన్యులు మొదలుకొని తంత్రసాధకుల దాక కవితావేగమునకో, స్తోత్రగానమునకో చదువదగిన పుస్తకము.

ఎస్. కె.

## ప్రబోధ గేయాని

రచయిత : శ్రీ శ్రీభాష్యం విజయసారథి, బి. ఓ. ఎల్. క్రౌను 24 పుటలు. వెల ఎనిమిదణాలు. ప్రకాశకులు : మిత్రపంచకం, అనంతలక్ష్మీ ఆయుర్వేద కళాశాల, వరంగల్లు.

సంస్కృతభాషలో రచింపబడిన పది గేయాలు ఈ చిన్న కావ్యంలో ఉన్నవి. భారతదేశ ప్రశస్తినీ, మహాపురుషుల సేవనూ, సంస్కృతభాషను గూర్చిన ప్రబోధాన్ని వెల్లడించే గేయాలు ఇవి. రచన చాలా సరళంగానే సాగింది. రసవత్తరంగామాత్రం

కానరాదు. "ఛందో వ్యాకరణాది నియమాః రచనాయాం విశ్లథీ (థి) కృతాః, సహృదయ పణ్డితైరిదం సాహసం క్షమ్యతాం ఇతి ప్రార్థయే" అని రచయితయే దీన్ని గురించి చెప్పినందువల్ల విశేషించి వ్రాయనక్కర్లేదు.

"భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది; భారతీయ విద్యాసంస్కృతి సంవర్ధనానికి ఆవశ్యకత ఏర్పడింది" - అనే అభిప్రాయాలు వ్యక్తం కావడానికి 'విజ్ఞప్తి'లో - "భారతస్య స్వాతంత్ర్యం ఆగతం, భారతీయవిద్యాసంస్కృతి సంవర్ధనస్య అవసరోఽపి ఆయాతః" అని వ్రాయడం ఉచితంగానూ, సరసంగానూ ఉన్నట్లు తోచలేదు. ఉపజ్ఞ వున్నందున యీ కవి మునుముందు మంచి రచనలను సాగింపవచ్చునని మాత్రం చెప్పవచ్చును.

## ఆత్మదానమ్

రచయిత: శ్రీ శ్రీభాష్యం - విజయసారథి, బి. ఓ. ఎల్. క్రౌను 16+55 పుటలు. వెల రూపాయి. ప్రకాశకులు - మిత్రపంచకం, అనంతలక్ష్మి ఆయుర్వేద కళాశాల, వరంగల్లు.

మన్మథుణ్ణు దేవతల కోరిక మేరకు పార్వతిపై శివునికి ప్రేమ కలిగించడానికి ప్రయత్నించి, అతని కోపాగ్నికి ఆహుతియైన కథ యీ కావ్యంలో గేయ రూపంగా కూర్చబడినది. కాళిదాస మహాకవి రచించిన కుమారసంభవ కావ్యంలోని తొలి నాలుగు సర్గలే దీనికి మాతృక. గ్రంథం చివరమాత్రం కొంత మార్చబడింది. రతీదేవి శివుని పతిభిక్ష పెట్టవలెనని ప్రార్థించగా - ఆయన దయతలచి మన్మథుడు ఇతరులకు అదృశ్యరూపంలో ఉండి, రతీదేవికి మాత్రం దృగ్గోచరుడయేటట్టు వరం యిచ్చాడు - ఇదీ యిందులోని మార్పు!

"పద్మాసనస్థం సు పద్మ ముద్రాంచితం
దాక్షాయణీ ధ్యానయోగ సంసక్త మివ
తత్సమాధౌ మగ్నమానసం తం శివం
విజిగీషు రసమేషు రుద్ధతో దృష్టవాన్."

అనేది యిందలి శైలికి ఉదాహరణం.

ఇందలి రచన ప్రశస్తంగా కానరాదు. మునుముందు ఈ రచయిత చక్కని కవి కాగల సూచనలు కానవస్తున్నవి. ముద్రణ కూడా సరిగా లేదు. అక్షరాల తప్పులతోపాటు స్పేసింగులు తారుమారుగా ఉన్నవి. అందువల్ల సమన్వయం చేసుకోవడానికి చిక్కుపడవలసివస్తూ వుంటుంది.

## తిక్కన

(పద్యకావ్యము) రచయిత: శ్రీ వేముగంటి - నరసింహాచార్యులు. క్రౌను 8+95 పుటలు. వెల: రు.1-25. ప్రాప్తిస్థానం: సరస్వతీ బుక్ డిపో, సిద్ధిపేట, మెదక్ జిల్లా.

కవిబ్రహ్మ తిక్కన చరిత్రలేశాన్ని గురించిన పద్యకావ్యం యిది.

"ఇందు వర్ణింపబడిన ముఖ్యఘట్టము తిక్కన మనుమసిద్ధికి మరల రాజ్య మిప్పించుట. అది యాతగా గొని తత్సంబంధమైన విషయములను కొన్నిటి నంగములుగా కవి గ్రహించినాడు. ఇందు నాల్గుల్లాసములు కలవు. మొదటి యుల్లాసము తిక్కనార్యుడు భారత రచనము చేయుచుండగా ముగియును. ద్వితీయోల్లాసమున నోడిపోయిన మనుమసిద్ధి పంపున తిక్కన యోరుగల్లు వడలి గణపతిదేవ చక్రవర్తి రాక నిరీక్షించుచుండును. మూడవ యుల్లాసమున చక్రవర్తి యాస్థానమున భారతమును తిక్కన గానముచేయుట, అందులకు సంతసించి చక్రవర్తి మనుమసిద్ధిని, స్వయముగా సాయమువచ్చి పునః ప్రతిష్ఠితుని చేయుదునని బయలుదేరుట తెల్పబడినది. తుర్లీయోల్లాసమున మనుమసిద్ధి పునఃప్రతిష్ఠాపనమును, భారత రచన పూర్తి యుగ్గడింపబడినది."

ఆచార్య శ్రీ కురుగంటి - సీతారామయ్యగారు తమ 'తొలిపలుకు'లలో "మొదటినుండి చివరవరకు కావ్యము రసప్రవాహ మనజెల్లును. ఏ పద్యము చదివినను చదువరి యాహ్లాదమును నందగలడు. చక్కని ప్రబంధ శైలి యీ కవి కలవడుట యీతని భాగ్యము. అట్లని వెనుకటి శైలియొక్క పునరుక్తి యెంతమాత్రమును కాదు. ప్రబంధకవితాపద్ధతి ఆధునిక అలంకారములతో, నేటి వన్నెచిన్నెలతో నీ గ్రంథమున నాట్యమాడినది..." అని వివరించిరి.

అయినను కవితాప్రవాహవేగమున కొట్టుకొని వచ్చు వెరసు లీ కావ్యమున అందందు లేకపోలేదు. "ఉత్తర రామాయణమును, పొత్తమ్ము రచించె" (పుట 12) ననుటకంటె 'గ్రంథమును రచించె' ననుట లెస్స. 'త్రిలింగ భూమి' అనుటకు బదులు 'త్రిలింగ కాశ్యపి (పు 12)' అనుట అప్రసిద్ధం. "పౌరుషోద్రిక్త

మగు ఇరుపక్షములకు" (30) అనడం సరిగాలేదు. "ఓరుగల్లు పద్ధతి వెంటనే" (38) ఇక్కడ 'పద్ధతి' అనేపదం రాజమార్గానికి అవాచకం. "నిన్ను నిల్వరించినచో మా నేలనెల్ల" (48) అనుచో 'చో' హ్రస్వమగుట సరికాదు. 'మాయాతిథ్య, మందుకొనుచు నిచట నధివసించి, మమ్ములను కృతార్థమహితులు గాఁజేయు" (51)—ఇక్కడ 'అధివసించి' అని వుండేటప్పుడు ద్వితీయా విభక్తి ఉండవలెను. సప్తమి పనికిరాదు. ఆ విధంగానే 'మమ్ము' అనే బహువచనాంతంపైని 'లను' చేర్చడం ఉచితంకాదు. 71-వ పద్యంలోని 'ప్రతివాడు, ప్రతియొకడు, సమస్త సభికులు-' సరియైనవి కావు. 'సభికులకు' బదులు 'సభ్యు'లని ఉండడం శ్రేయం.

కవిబ్రహ్మ మనుమసిద్ధికి నిర్వచనోత్తర రామాయణాన్ని అంకిత మిచ్చిన వెంటనే భారత రచనకు పూనుకొన్నట్లునూ, ఆంధ్రానువాదం కొంత జరిగిన తర్వాత నిలిపి రాజ్యభ్రష్టుడైన మనుమసిద్ధిని పునఃప్రతిష్ఠితుని చెయ్యడంకోసం అతని ప్రార్థనపయి గణపతిదేవ చక్రవర్తివద్దకు పోయి, అతని మూలాన కార్యాన్ని సాధించి, తర్వాత మళ్లీ రచన ప్రారంభించి పూర్తి చేశాడనీ యిందులో కలదు. కాని, కవిబ్రహ్మ మనుమసిద్ధిని పునఃప్రతిష్ఠితుని చేసిన తర్వాత, రాజకీయాలతో సంబంధం విడిచిపెట్టి యాగంచేసి, భారతం ఆంధ్రీకరించినట్లు అభిజ్ఞులు చెప్పడం ప్రసిద్ధంగా వున్నది. కవి కథాంశాన్ని మార్చడానికి కారణమేమో?

ఇందలి 16 వ పుటలో— "నన్నయ కవిరాజు మున్ను రెండున్నర-పర్వములను తెనుగుబాససేసి, వదలిపోయినట్టి పంచమవేదమున్, పూర్తిసేయ దీక్షపూనినాడు" అని చెప్పి, మరొకచోట(25-వ పుటలో) "పగు నెనిమిదిపర్వములకు, కుదుర్చె నానారసార్థ గుణసంపదకున్ సదనము విరాటపర్వం, బది మొదలుగ తెనుగుసేత ప్రారంభించెన్" అని పదిహేను పర్వాలు ఆంధ్రీకరించినట్లు రచయిత వ్రాశాడు. ఇందేది గ్రాహ్యమో!

అట్టమీది తిక్కన చిత్రం ఆకర్షణీయంగా కానరాదు. దశకుమారచరిత్రలో కేతన వర్ణించిన తిక్కన స్వరూపం ఇందు గోచరించడంలేదు.

గ్రంథంలోని పద్యాలు రసవంతంగా వున్నా అచ్చుతప్పులు పట్టికలో చూపినవానికంటె చాలా ఎక్కువగానే ఉన్నవి. కొన్ని పుటలలో 20 పంక్తులు, కొన్నిట 16, కొన్నిచోట్ల 12 పంక్తులూ వుండటం పుస్తకం అందానికి లోపమే. రచయిత వీటినన్నింటినీ రెండవ ముద్రణంలో సవరించుకోగలరని ఆశిస్తున్నాను. ఈ యువకకవి అచిరకాలంలోనే ఉత్తమశ్రేణికి చెందిన కవికాగలడని విశ్వసిస్తున్నాను.

## తెలుగు పాఠగళు

మైసూరు విశ్వవిద్యానిలయ గ్రంథమాలా ప్రచురణము. సంపాదకులు విద్వాన్ - శ్రీ కే. సుబ్బరామప్ప, ఎం. ఏ, బి. ఇడి. క్రౌను 23+69+73+299+23 పుటలు. వెల సాదా ప్రతి రు 3=75; ఉత్తమ ప్రతి రు 4=75. ప్రకాశకులు మైసూరు విశ్వవిద్యానిలయం, మైసూరు.

తెలుగుభాష అప్రధానంగా తీసుకున్న మైసూరు విశ్వవిద్యాలయ విద్యార్థుల ఉపయోగార్థం ఆంధ్రభాషలోని వివిధ పద్యకావ్యాలలోని భాగాలు కొన్ని యీ "తెలుగు పాఠగళు"లో కూర్చబడినవి. ఇందులో కవిత్రయం, పోతన, శ్రీనాథుడు, వేమన, పెద్దన, ముక్కుతిమ్మన, ధూర్జటి, మొల్ల, కంకంటి పాపరాజు, ఏనుగు లక్ష్మణకవి, పాల్కురికి సోమనాథుడు, రంగనాథుడు, గౌరన - అను కవుల రచనలు తగుమాత్రం ఉన్నవి. వీటిలో ఇంచుమించుగా అన్నీ యిదివరలో మద్రాసు, ఆంధ్రవిశ్వవిద్యాలయాల పరీక్షలకూ, స్కూలు ఫైనలు పరీక్షకూ పాఠ్యాలుగా ఉన్న భాగాలే! అవి అన్నీ కూడా విద్యార్థులకు ఎంతో ఉపయోగమైనవే! వీటినన్నింటినీ బృహత్పాఠ్య గ్రంథంగా ఒక చోట చేర్చికూర్చిన శ్రీ సుబ్బరామప్పగారి ప్రయత్నం ప్రశంసించదగినది. కన్నడ విద్యార్థుల ఉపయోగార్థమై గ్రంథాదిని కన్నడంలో పయికవుల జీవితచరిత్ర సంగ్రహంగా ఇవ్వబడినది. ఆ విధంగానే తెలుగు సాహిత్యపు స్థూలపరిచయమున్నూ కన్నడంలో ఇవ్వబడినది. అందు సంపాదకులకు నచ్చిన ఆధునికులు చేర్చబడినారు.

"తెలుగు పాఠగళు"వంటి గ్రంథం ఎంతో ఆవశ్యకమైనదే! వాఙ్మయంలోని రసవద్ఘట్టాలు ఈ విధంగా ఏర్చికూర్చడంవల్ల ప్రాంతీయభాషా వాఙ్మయాల వైశిష్ట్యం అన్యప్రాంతాలవారికి అందిచ్చినట్లు అవుతుంది. అయితే, ఆ అందించడంలో కొంతజాగ్రత కూడా అవసరమే! ఈ పుస్తకంలోని పాఠ్యభాగాలు చాలాసార్లు వివిధ పరీక్షలకు నిర్ణీతాలై ఉన్నందువల్ల

# గ్రంథ విమర్శనము

శ్రీ సుబ్బరామప్పగారు ఆ ముద్రితభాగాలను యథాతథంగా ఎక్కించి వేశారేమో అని అనుకోవలసి వస్తున్నది. అలా కాకుండా మూలగ్రంథాల వివిధప్రతులనూ, లిఖితగ్రంథాలనూ పరిశీలించి సరియైన పాఠాలను గ్రహించివుంటే ఇంకా ఇది ఎంతో చక్కగా తయారయివుండేది. ఉదాహరణకు 'ఉత్తరుని పరాక్రమము' అనే చిక్కన పాఠ్యభాగాన్ని గమనించండి.

(1) 'ఎత్తున గొందు గౌరవుల
సెల్లను మార్కొని రేని గోవులం
.........................
ఇత్తఱి నేఁగదా కడప
నెంతయు నేర్తు రథంబనం బురిన్' (ప.7)

ఇవి ఉత్తరుని మాటలు. ఇక్కడ 'ఎత్తునఁ గొందు' అనే పాఠంకన్న 'ఎత్తెలఁ గొందు' అనేదే సరసమైనది. 'వలవేసి పట్టుకొనేటట్లు ఒక్కరినీ మిగల్చకుండా పట్టుకొందు'నని భావం. 'రథంబ నం బురిన్' అంటే సమన్వయం సరిగా కుదరదు. 'రథంబు నీపురిన్' అనేదే ప్రాచీన ముద్రితపాఠం. సరైనదికూడాను.

(2) 'విని ద్రుపద ధరణి పతినం
దన సామర్షాపహాస తరళహృదయయై
చని తద్వృత్తాంతము మె
త్తని పలుకులఁ జెప్పె నింద్రతనయుని తోఁడన్'
(ప. 11)

'కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యులు మత్సముద్యమ, స్ఫురణము చూచి పార్థుఁడను బుద్ధిగలంగగ' అని ఉత్తరుడు తన్ను గురించి ప్రగల్భాలు పలుకుతూ, కిరీటితో పోలిక తెచ్చుకోవడం చూచి ద్రౌపది 'సామర్షాపహాసతరళహృదయ' ఐనది. ఉత్తరుడి సంగతి ఆమెకు బాగా తెలుసు. అతనికి బుద్ధివచ్చేటట్టు చెయ్యాలనే ఆమె కోరిక. అందువల్లనే అర్జునుడివద్దకు వెళ్ళి, అక్కడి వృత్తాంతమూ, ఉత్తరుని మాటలూ తెలిపినది. అలాంటి సమయంలో మెత్తని మాటలుకాక గట్టిమాటలే కావాలికదా! ఇక్కడ 'తద్వృత్తాంతము నా, తని పలుకుల జెప్పె' అనే ప్రాచీన ముద్రితపాఠమే సరియైనది.

(3) ఉత్తర బృహన్నలను తన అన్నగారికి సారథిగా ఉండవలెనని ప్రార్థించగా—

'నగుచు బృహన్నల యిట్లను
జగతీశ్వర పుత్రి! నాకు సారథ్యము నే
ర్పు గలదె? నీమాటకు నే (28)

మిగులంగా వెఱతు; పోదము; మీదెట్లుండెడిన్' మీద ఎలాగున్నా సరే, నీమాట కాదనలేక తప్పక వెళ్లెదను – అని అంటున్నాడు. ఇట్టియెడల 'పోదము' అనడంకంటె 'పోదు' అనుటయే మేలు! ఇది ప్రాచీన ముద్రితపాఠం!

(4) కౌరవసైన్యాన్ని చాలా దూరంగానే చూచి ఉత్తరుడు భయపడిపోగా అర్జునుడు

'అంతిపురంబులోన
................
దంతి తురంగ సద్భట క
దంబు జూచి కలంగు టొప్పునే?' (ప 56)

అని అంటాడు. ఇక్కడ 'సద్భట రథంబులు' అనేది ప్రాచీన ముద్రితపాఠం! భారత ప్రతుల్లో Foot Notes లో ఇయ్యబడినదే! కదంబాన్ని గ్రహిస్తే 'రథాలు' లోపిస్తాయి. వాటిని చూచి కూడా అతడు భయపడ్డాడని 'ఉదగ్రధ్వజార్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యే జేరంగ శక్యంబె నే?' అని ధ్వజప్రస్తావన మూలంగా ఉత్తరుడు చెప్పిన మాటవల్లనే తెలుస్తున్నది. అందువల్ల ప్రాచీన పాఠమే గ్రాహ్యం:

(5) కౌరవ బలములను చూచి బెదరిన ఉత్తరుడు
'దవ్వుల విఱిగిన వారలు
నవ్వుదురటు! మేలు మేలు, నను నాఁగకు నీ
క్రొవ్వులుఁగ జేనిఁ దలపడు
మెవ్విధి జనితేని'యనుచు నెత్తిన భీతిన్' (ప.69)

రథంమీదనుంచి ఉరికి వెనుకకు పోవును. ఇట 'నీవెలా పోతే నాకేమి?' అనే ఉత్తరుని అభిప్రాయాన్ని 'ఎవ్విధి జనితేని' అనేది తెలుపలేదు. 'ఏని' ద్రుతాంతం: దానిపై యడాగమం సదికాదుకూడాను. ఇక్కడ 'ఎవ్విధి జనితేమి' అనే ప్రాచీన ముద్రిత పాఠమే సముచితమై వుంటుంది.

ఇలాంటివి ఇంకా ఉన్నవి. మచ్చుకి యివి తెలియజేయబడినవి. పాఠ్యనిర్ణాయక సంఘంవారు ముద్రించిన పుస్తకాలపై ఆధారపడకుండా మూల గ్రంథాలను పరిశీలిస్తే యిలాంటి లోపాలు కలుగవు. ఉదార సంకల్పులైన శ్రీ సుబ్బరామప్పగారు ద్వితీయ ముద్రణంలోనైనా మూలగ్రంథాలను పరిశీలించి, యిలాంటి లోపాలను సవరించుకోవాలని అభ్యర్థన.

# మనవి మాటలు

మొన్ననే శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు నూరేళ్ళ పుట్టినపండుగ చేసుకొన్నారు. ఇక ఐదేళ్ళకు కవిసార్వభౌమ మహామహోపాధ్యాయేత్యాది బిరుదాంచితులు, ఆంధ్రప్రదేశ్ ఆస్థానవిద్వత్కవులు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు నూరవ పుట్టినరోజు పండుగ చేసుకొననున్నారు. ఇటీవల శ్రీ శాస్త్రిగారిని రాజమహేంద్రవర పౌరులు 95 వ జన్మదినోత్సవంనాడు వైభవోపేతంగా సత్కరించడం ప్రశంసనీయం.

బతకడంకోసం బతకడం గొప్పేమీ కాదు. ఇలాటి బతుకునుగురించే, అకర్మణ్యతనుగురించే,

"ఉడుముండదె నూరేండ్లను ?
పడియుండదె పేర్మి పాము పదినూరేండ్లన్ ?
మడుగున కొక్కెర యుండదె ?
కడు నిల పురుషార్థపరుడు కావలె..."

అన్నాడు సుమతిశతక కారుడు. పురుషార్థపరత పూర్ణారోగ్యం లేనిదే సాధ్యపడదు. కనుకనే మన పూర్వులు

"పశ్యేమ శరదశ్శతం
జీవేమ శరదశ్శతం
నందామ శరదశ్శతం
మోదామ శరదశ్శతం
భవామ శరదశ్శతం
ప్రబ్రవామ శరదశ్శతం
అజీతాస్స్యామ శరదశ్శతం"

ఊరికే ఏదో జీవచ్ఛవంలాగ బతకడం కాదు : నూరేళ్ళూ చూద్దాం. నూరేళ్ళూ జీవంతో తొణికిసలాడుతూ ఉందాం. నూరేళ్ళూ సంతోషిద్దాం. నూరేళ్ళూ మోదంతో ఉందాం. నూరేళ్ళూ ఉందాం. నూరేళ్ళూ మాట్లాడుతూ ఉందాం. అన్నిటికన్నా మించి, నూరేళ్ళూ ఒకరికి లొంగకుండా ఉందాం - అని కోరుకున్నారు.

శ్రీ శాస్త్రిగారి తొంభయ్యయిదేళ్ల జీవితమూ కార్యకలాపాల సమృద్ధంతో సార్థకమైంది. వీరు చెప్పినన్ని పద్యాలు ప్రపంచంలో ఎక్కడా ఎవ్వరూ చెప్పలేదు. వీరి కవితావేశం అటు రాజాస్థానాలలోనే కాక, ఇటు న్యాయస్థానాలలోను పొంగులు వారింది. అటు ఒక చేత రామాయణ భారత భాగవతాది ప్రాచీన సాహిత్యాన్ని, మరొక చేత తిలక్ మహారాజు నాటకం, బొబ్బిలి నాటకంవంటి అర్వాచీన సాహిత్యాన్ని - శతాధిక గ్రంథాలను సవ్యసాచిలాగ ఆంధ్రావళికి అందించినవారు; తమకు నచ్చనిదానిని కచ్చితంగా ఎదిరించే గుండెనిబ్బరం గలవారు; వ్యావహారిక భాషావాదాన్ని తమ వజ్రాయుధంతో ప్రతిఘటించారు. అదే ఆవేశంతో, అదే అభినివేశంతో నేటికీ రచనను కొనసాగిస్తూనే ఉన్నారు.

ఇలాటి కార్యవ్యగ్రులు ఐదు సంవత్సరాలను ఐదుక్షణాలుగా గడిపి, నూరవజయంతి చేసుకోవాలని ఆశిస్తున్నాము; చేసుకోగలరని విశ్వసిస్తున్నాము. నూరే ఎందుకు? కృష్ణభగవానుడు 108 సంవత్సరాలు జీవించాడని, ఇతరుడనే ఋషికుమారుడు మహీదాసుడు మృత్యువును నిలువుమని 116 సంవత్సరాలు జీవించాడని (మహీదాస ఐతరేయః...సహషోడశం వర్షశత మజీవత్) ఛాందోగ్యం చెప్పినట్టు నూటపదహారవ జయంతి చేసుకోవాలని ఆకాంక్షిస్తున్నాము.

శ్రీ కాశ్య, శ్రీ విశ్వేశ్వరయ్య గార్లను గౌరవించినట్లే భారతప్రభుత్వం వీరినికూడా ప్రత్యేకపు తపాలాబిళ్లలు ముద్రించి, ఇతర విధాలుగాను సముచితరీతిని సన్మానించగలదని ఆశిస్తున్నాము.

"శతం జీవేమ శరదస్సువీరాః"

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: Sambhu Prasad.